


## బైబిల్‌పై వివరణాత్మక విమర్శనాగ్రంథం

## ప్రథమ భాగము



రచయిత - చిత్రకారుడు - సంఘసేవకుడు

**నెల్సన్ రష్దీ**

[redacted]

**మానవతా**  **ప్రచురణలు**



బైబిల్‌పై వివరణాత్మక విమర్శనాగ్రంథం

ప్రథమ భాగము

తొలి ముద్రణ : డిసెంబర్ 2012

ప్రచురణ : మానవతా ప్రచురణలు

ప్రతులు : 2000

[redacted]

సోల్ డిస్ట్రిబ్యూషన్ :

మానవతావాద బృందం

# విషయసూచిక

# పరిచయము

**కామ్రేడ్ గుండా మల్లేష్**
(సి.పి.ఐ. ఎమ్.ఎల్.ఎ.,)
బెల్లంపల్లి నియోజిక వర్గం,
(ఆదిలాబాద్ జిల్లా) బెల్లంపల్లి.

నెల్సన్ రష్దీగారు చాలా సంవత్సరాలుగా నాకు సుపరిచితులు. వారి అభ్యుదయ భావాలు. మతాలపట్ల వారి అభిప్రాయాలను గూర్చి నాకు బాగా తెలుసు. మరి ముఖ్యంగా మంచి మానవతావాదిగా బెల్లంపల్లిలోను, ఆదిలాబాద్ జిల్లాలో కూడ అనేకులకు వీరిసేవా నిరతిని గూర్చి తెలుసు. వీరి దీనజన సేవా దృక్పథం నన్నెంతో ఆకట్టుకుంది. ఈయన మంచి చిత్రకారుడు. 1977లో వీరు శ్రీమతి ఇందిరాగాంధీ నుండి ప్రశంసలందుకున్నారు. నెల్సన్ గారు సింగరేణి కాలరీస్ కంపెనీ (బెల్లంపల్లి)లో బొగ్గుగని కార్మికుల భద్రతానిబంధనలకు సంబంధించిన చిత్రకారులుగా 1957 నుండి 1968 వరకు పనిచేసి అనంతరం రడీమేడ్ దుస్తుల వ్యాపారంలో సెటిల్ అయ్యారు.

నెల్సన్‌గారు వారి అభిరుచికి తగ్గవిధంగా బెల్లంపల్లి లయన్స్‌క్లబ్‌లో పదేళ్లు పనిచేసి రెండేళ్లపాటు క్లబ్ కార్యదర్శిగా విస్తృత సేవలందించారు. ఈ విధంగా దీనసేవా భావంగల వీరు 1985లో "మానవతా వాద బృందం" అనే స్వచ్ఛంద సేవాసంస్థను స్థాపించి తన స్వంత ఖర్చులపై ఆయా ప్రాంతాల్లో దీనజనులకు, రోగగ్రస్తులకు ముఖ్యంగా కుష్ఠురోగగ్రస్తులకు సేవలందిస్తూ అంగవికలులైన కుష్ఠురోగులను సైతం తన స్కూటర్ మీద ఎక్కించుకొని వారిని ఇంటికి తీసికొని వచ్చి ఆదరించి ఆథిత్యమిచ్చి పంపేవారు. ఈ 1985లోనే వీరు సాల్మన్‌రష్దీ స్ఫూర్తిగా తనపేరుతో పాటు "నెల్సన్ రష్దీ"గా అధికారికంగా మార్చుకున్నారు.

1985 అక్టోబర్ 2న గాంధీ జయంతి సందర్భంగా వీరు "మానవతావాద బృందం" సభ్యులతో సోమగూడెం ఆవలనున్న గిరిజన గూడెం పెద్దనపల్లి అనే కుగ్రామానికి వెళ్లి బాలబాలికలకు స్నానాలు చేయించి వస్త్రాలిచ్చి ఆదినమంతా ఆవూర్లో వారితో గడిపి మూఢనమ్మకాలకు దూరంగా వుండాలని ఆరోగ్యసూత్రాలు బోధించి వచ్చారు. నాటి వార్తా ప్రతికలు ఈ విషయాన్ని ప్రముఖంగా ప్రకటించాయి.







**మానవతా వాద బృందం**

బెల్లంపల్లి, అక్టోబర్ 7 (టెలిన్యూస్): బెల్లంపల్లిలో స్వచ్ఛంధ సేవాసంస్థ మానవతావాద బృందంవారు, గాంధీ జయంతినాడు కాసిపేట మండలంలోని కనీస రవాణా సదుపాయంలేని పెద్దనపల్లి గ్రామంలోని సుమారు వందమంది బాలబాలికలకు వస్త్రాలు, మిఠాయిలు పంచిపెట్టారు. బృందం అధ్యక్షులు బి.నెల్సన్, ఉపాధ్యక్షులు కె.మల్లేష్ నాయకత్వంలో 40 మంది సభ్యులతో ఈ కార్యక్రమం నిర్వహించారు. మాజీ ఉపసర్పంచ్ బి.యతిరాజ్ సభ్యులతో కలిసి ఉత్సాహంగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయిన పల్లె ప్రాంతాలలోని ప్రజల పరిస్థితులు ఏ మాత్రం మారలేదంటూ బృందం అభిప్రాయపడింది.

మరొక్కసారి 1993లో మా హనుమాన్ బస్తీలో కొరిమెల్ల రాజేశం ఇంట్లో వారంరోజుల్లో ఆయన భార్య, బిడ్డ, తల్లి చనిపోగా - ఇది చేతబడి, మంత్రాలు లేక దయ్యాల పనియని - ఆఖరుగా చనిపోయిన వృద్ధురాలి దహన సంస్కారాలకు బస్తీ వారెవరు ముందుకు రాకపోగా నెల్సన్ రష్దీ నాయకత్వాన భానాస సభ్యులు ముందుకు వచ్చి ఈ మరణాలు కేవలం అతిసారవ్యాధి వల్లనే సంభవించాయని వివరించి. అంత్యక్రియలను జరిపించారు. ఈ విధంగా వారు ప్రజల కష్టసుఖాల్లో పాలుపంచుకోవడం విశేషం.

1993 ఏప్రిల్ 23 శుక్రవారం

ఉదయం ఆదిలాబాద్

# ఆ ఇంట్లో మృత్యు హేల..
# ప్రజల్లో భయాందోళన

బెల్లంపల్లి ఏప్రిల్ 22 (టైమ్స్ న్యూస్): వారం రోజుల వ్యవధిలో ఆ ఇంట్లో ముగ్గురు మృత్యువాతకు గురికావడంతో ఆ ఇంట్లో విషాదఛాయలు అలుముకున్నాయి. ఇలా రెండు మూడురోజుల వ్యవధిలో ఆ కుటుంబంలో ఒక్కొక్కరు మరణించడం పట్టణంలో తీవ్ర సంచలనం సృష్టించింది. స్థానిక ప్రజలు చేతబడి, మంత్రాలు ఆ ఇంట్లో పనిచేసి వారి మరణానికి కారణమైనాయని భావిస్తుండగా భారత నాస్తిక సమాజంవారు దీన్ని ఖండిస్తూ కలరా సోకి వారు మరణించినట్లు ప్రకటించారు.

స్థానిక హనుమాన్ బస్తీలో నివాసముంటున్న కొరిమెల్ల రాజేశం అనే వ్యక్తి భార్య రామక్క (40) ఈ నెల 16వ తేదీ మరణించగా, ఆమె సోదరి భాగమ్మ (22) ఈ నెల 18వ తేదీన మృతి చెందింది. వీరిద్దరి మరణాలతో కోలుకోని ఆ కుటుంబానికి ఈ నెల 21వ తేదీన రాజేశం తల్లి లచ్చమ్మ (60)కూడా మరణించడంతో అక్కడి వారు ఆందోళన చెందుతున్నారు. లచ్చమ్మ మృతి అమావాస్య రోజు జరగగా ఇదేదో భూతవైద్య అయి ఉండాలని, చేతబడి అయి ఉండవచ్చునని ప్రజలు నమ్మి రాజేశం ఇంటి ఛాయలకు కూడారాలేదు. దీంతో ఏకాకి అయిన రాజేశం దిక్కుతోచని స్థితిలో తన కుటుంబీకులు ఇలా ఒక్కరొక్కరే మరణించడంపట్ల కలత చెంది స్పృహ తప్పిపడిపోయాడు. చివరికి అతని కులస్థులు, కుల పెద్దలు కూడా ఆ ఇంటి ఛాయలకు రాలేదు.

ఈ విషయం తెలిసిన భారత నాస్తిక సమాజం జిల్లా అధ్యక్షుడు నెల్సన్ రఫ్ఫీ వెంటనే మున్సిపల్ కమిషనర్‌కు, సింగరేణి ఏరియా ఆసుపత్రి అధికారులకు తెలిపి వారి సిబ్బందిని వెంట బెట్టుకొని కలరా సోకిందని భావిస్తున్న ఏరియాలో ఫినాయిల్, డిడిటి, బ్లీచింగ్ పౌడర్ తదితర క్రిమిసంహారక మందులు చల్లే ఏర్పాట్లు చేశారు. మున్సిపల్ కమిషనర్ సత్వర పరిశుభ్ర (మిగతా 2వ పేజీలో)

# మృత్యు హేల...

(1వ పేజీ తరువాయి)

కార్యక్రమాలు చేపట్టుటకు ఆదేశాలు జారీ చేశారు.

ఇదిలా ఉండగా రైల్వేస్టేషన్ ప్రాంతం నుండి వచ్చిన ఒక భూత వైద్యుడు ఆ ప్రాంతంలో తచ్చాడుతూ ఇది చేతబడియేనని ప్రచారం చేస్తూ మానవ బలహీనతలను, మూఢ నమ్మకాలను సొమ్ము చేసుకొనుటకు ప్రయత్నించగా అతన్ని ఆ ప్రాంతం నుంచి భా.నా.స కార్యకర్తలు పంపించివేశారు.

ఇదే కాకుండా ఆ ఇంటి ప్రక్కనే ఉన్న మరో వ్యక్తి ఇంట్లో మౌనిక అనే 11 నెలల పాప కూడా ఇదే విధంగా ఆకస్మాత్తుగా చనిపోయింది. బుధవారం చనిపోయిన వృద్ధురాలు లచ్చమ్మ దహన సంస్కారాలకు కుల పెద్దలు, ప్రజలు ఎవరూ హాజరు కాకపోవడంతో భా.నా.స జిల్లా అధ్యక్షుడు నెల్సన్ రఫ్ఫీ నాయకత్వాన హనుమాన్ బస్తీ భా.నా.స శాఖ సభ్యులు శవానికి దహన సంస్కారాలు జరిపించారు. కలరా ప్రబలిన ప్రాంతాలను మున్సిపల్ కమిషనర్, నెల్సన్ రఫ్ఫీ, ఎం.ఇ. కృష్ణారావు, సింగరేణి శానిటరీ ఇన్స్పెక్టర్ సిమబాబు తదితరులు బుధవారం సందర్శించారు.

1985లో రాష్ట్రంలో అనేకచోట్ల మద్యపానానికి వ్యతిరేకంగా మహిళలు ఉద్యమాలు చేస్తున్నతరుణంలో బెల్లంపల్లిలో రాజకీయ నాయకులు, స్వచ్ఛంద సేవా సంస్థలు కలిసి అఖిలపక్ష సమావేశం జరపగా అందు నెల్సన్‌గారు మాట్లాడుతూ మన ఉద్దేశం చాలా బాగుంది. ముఖ్యంగా మన తెలంగాణా ప్రాంతంలో అనేకులు ఈ వ్యసనానికి బలియైపోతూ ఆయా కుటుంబాలు నానా అవస్థలు పడుచున్నాయి. మన మీ కార్యానికి తలపడే ముందు ఇక్కడున్న రాజకీయ నాయకుల్లో ఏ ఒక్కరైనా "త్రాగని" వారుంటే ముందుకు రాగలరా యని ప్రశ్నిస్తే ఏ ఒక్కరూ ముందుకురాలేదు. ఒక్క మునిసిపల్ ఛైర్‌మెన్ మాత్రం లేచి నేటినుండి తాను ఇక త్రాగనని శపథం చేశారు. ఈ కార్యక్రమ కన్వీనరుగా మేమంతా నెల్సన్‌రఫ్ఫీ గారినే ఎన్నుకున్నాము. అనంతరం మంచిర్యాల సభకు నెల్సన్ రఫ్ఫీ అధ్యక్షత వహించారు. ఈ విధంగా ఆయన మద్యపాన వ్యతిరేకోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఈ సభలో నేనుకూడ పాల్గొన్నాను.





# మద్యం ముట్టబోమని ప్రమాణం

మంచిర్యాల, అక్టోబరు 18 (న్యూస్‌టుడే): రాష్ట్ర సంపూర్ణ మద్య నిషేధ సమితి ఆధ్వర్యంలో ఆదివారం మంచిర్యాలలో జరిగిన మద్య నిషేధ సదస్సులో సమితి అధ్యక్షురాలు టి.అరుణ హాజరైన నాయకులతో, ప్రజలతో ఇకముందు మద్యం ముట్టబోమని ప్రమాణం చేయించారు. ఈ సందర్భంగా ప్రమాణం చేసిన బెల్లంపల్లి మాజీ మున్సిపల్ ఛైర్మన్ ఇ.చంద్రశేఖర్ మాట్లాడుతూ, ఇకముందు తాను మద్యం ముట్టుకోనని, ముడితే చెప్పుతో కొట్టండని ప్రకటించారు. పొద్దంతా కష్టపడ్డామని రాత్రంతా తాగి, ఉదయంపూట వేదికలెక్కి మద్యం ముట్టుకోవద్దని ప్రచారం చేసే నాయకులను తరిమికొట్టాలని ఆయన అన్నారు. రాష్ట్ర మహిళా నాయకులు నాలుగు గోడల మధ్య సదస్సులు ఏర్పాటుచేసే బదులు కార్మికవాడల్లో తమ ప్రసంగాన్ని వినిపిస్తే తప్పకుండా మార్పు వస్తుందని ఆయన కోరారు.

ఈ సమావేశంలో రాష్ట్ర ఆర్య సమాజ్ అధ్యక్షుడు బి.విఠల్‌రావు, మద్య నిషేధ కమిటీ రాష్ట్ర ఆర్గనైజర్ శంకర్, బెల్లంపల్లి కన్వీనర్ టి.గోపీకిషన్‌సింగ్, మాజీ ఎమ్మెల్యే గుండా మల్లేశ్, మాజీ మున్సిపల్ ఛైర్మన్ ఆర్.కృష్ణారావు, చంద్రశేఖర్, చిదానందకుమారి, మంచిర్యాల బ్లాక్ కాంగ్రెస్ అధ్యక్షుడు ఎస్.దివాకర్‌రావు, బి.ఎస్.పి. నాయకుడు ఎస్.ఓదెలు, మంచిర్యాల జిల్లా సంఘర్షణ సమితి అధ్యక్షుడు శ్యాంరావు, తదితరులు ప్రసంగించారు.

**ఐక్యవేదికకు అధిక సంఖ్యలో జనం**

ఆదివారంనాడు స్థానిక జిల్లా పరిషత్ పాఠశాల ఆవరణలో జరిగిన జిల్లా ఐక్యవేదిక సదస్సుకు పెద్దసంఖ్యలో అధికార పార్టీ నాయకులతో పాటు ఇతర పార్టీల నాయకులూ పాల్గొన్నారు. మద్య నిషేధ కమిటీ నాయకుల ప్రసంగాలు సభికులను ఆకట్టుకున్నాయి. సదస్సుకు పెద్దసంఖ్యలో పురుషులు, మహిళలు హాజరయ్యారు.



ఆదివారం మధ్యాహ్నం మంచిర్యాలలో నిర్వహించిన ఐక్యవేదిక సదస్సులో ప్రసంగిస్తున్న రాష్ట్ర సంపూర్ణ మద్య నిషేధ సమితి అధ్యక్షురాలు టి. అరుణ, ఈ సభకు నెల్సన్ రఫ్ఫీ అధ్యక్షత వహించారు.

సాధారణంగా మనదేశంలో క్రైస్తవ సమాజాలు చాలాకాలంగా కాంగ్రెసు పక్షానే వుండడం ఆనవాయితీగా కొనసాగుతుంది. కమ్యూనిస్టుల పేరు చెబితేనే వారు దేవుడు లేడంటారని వారిభయం. ఆకారణంగా వీరెవరూ వామపక్షాల దరి దాపులకు వచ్చేవారు కారు. నేను విద్యార్థి దశ నుండి కార్మికోద్యమాల్లో పాల్గొంటూ యుండేవాడిని. అనంతరం నేను కమ్యూనిష్టుపార్టీలో ఎనలేని సేవలందించి 1983లో సి.పి.ఐ."యం.ఎల్.ఎ."గా ఆసిఫాబాద్ నియోజకవర్గం నుండి ప్రప్రథమంగా విజయం సాధించి ఆసిఫాబాద్ నుండి విజయోత్సాహంతో ఊరేగింపుగా బెల్లంపల్లి వచ్చేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. అంతలో ఊహించని విధంగా సరిగ్గా నెల్సన్‌గారి ఇంటి సమీపానికి వచ్చేసరికి వారి ఇంటిముందు ఒక స్వాగత బ్యానర్ కట్టబడియుంది. అంత నెల్సన్ దంపతులు నాకు ప్రథమంగా స్వాగతం పలికి పూలమాలలు సమర్పించిన సంగతి నేనెన్నటికి మరువలేను.

అసలు విషయానికి వద్దాము. ఇటీవల నవంబరు 2012లో నేను చైనా పర్యటనకు బయలుదేరనున్న సమయంలో నెల్సన్‌గారు "ఇది నిజమా" ప్రథమభాగం వ్రాత ప్రతిని నాకిచ్చి ఈ గ్రంథానికి పరిచయవాక్యాలు వ్రాయవలసిందిగా కోరారు. దానిని నా సుదీర్ఘ ప్రయాణంలో చదవ వచ్చునని దానిని నాతో పాటు తీసికొని వెళ్లాను. నేనొక రాజకీయ నాయకుడను. ప్రస్తుతం నేను నాల్గవ సారి సి.పి.ఐ.ఎమ్.ఎల్.ఎ.గా బెల్లంపల్లి నియోజిక వర్గం నుండి ప్రాతినిథ్యం వహిస్తున్నారు. ఈ కారణంగా నేను హిందూ, ముస్లిం, క్రైస్తవ సమాజాలతో సన్నిహితంగా వుంటాను. నేను చాలాచోట్ల అనేక చర్చీలకు వెళ్లాను. బెల్లంపల్లిలో పాస్టర్ ప్రవీణ్‌కు చెందిన "కల్వరిచర్చి"ని కూడ సందర్శించాను. ఆయా చర్చీలందు నేనువిన్న ప్రసంగాలు నన్ను ఎంతగానో ఆకర్శించాయి.

ముఖ్యంగా నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించుమని, నరహత్యచేయవద్దు, దొంగిలవద్దు, అబద్ధసాక్ష్యం పలుకవద్దు, ఈ చెంపమీద కొడితే మరో చెంపచూపమని... దీన దరిద్రులకు, రోగులకు చేతనయిన సాయం అందించమని, ఆదరించమని యేసుక్రీస్తు చెప్పిన సూక్తులు నన్నెంతో ఆకర్శించాయి. యావత్ ప్రపంచంలో క్రైస్తవమతం ప్రేమామయమైనదిగా భావించాను.

అనంతరం నెల్సన్ రఫ్టీ రచించిన ఇది నిజమా పైలెట్ ఎడిషన్ అనే చిరుపుస్తకాన్ని నాకు, సి.పి.ఐ. ప్రధాన కార్యదర్శి నారాయణ గార్కి ఇవ్వగా దానిని ఆసాంతం చదివాను. ఏమిటిది? యేసు ఉపదేశించిన ప్రేమ సందేశాలకు - ఆయన తండ్రియైన యెహోవా భావజాలం బద్ధవిరుద్ధమైన రీతిలో అన్యమతస్తులపైన, ఇతర జాతులపైన అక్కసు వెడల గ్రక్కడమేమిటి? శ్రయేలీయులు మాత్రమే తన స్వజనులని అభివర్ణించడం గమనించి "డైలమా"లో పడిపోయాను. సర్వమానవాళి దేవుని బిడ్డలేయనే మాట నిజం కాదాయని సంధిగ్ధంలో పాతనిబంధన గ్రంథం కూడ చదివాను. అందు యూదేతర జాతులను సర్వనాశనం చేయమని చెప్పడం, వారి ఆస్తిపాస్తులను దోచుకోమనడం, వారిని నిర్మూలం చేయమనడం వంటి ఆదేశాలు చూడగా ఆయన ఇచ్చిన పది ఆజ్ఞలను ఆయనే ధిక్కరింపజేసినట్టు విదితమౌతుంది. యేసు-యెహోవాల మధ్య ఇంతటి వ్యత్యాసమున్న సంగతి నాకు ఇది వరకు ఎంతమాత్రము తెలియదు. ఏది ఏమైనా బైబిల్ అనుభవము నాకు అంతగా లేనందున ఇంతకన్నా మరేమి వ్రాయలేను.

ఇంతవరకు యావత్ ప్రపంచ క్రైస్తవులు ఒకే బాటలో సాగుచున్నారని తలంచడమే తప్ప ఇందువేలాది బద్ధవిరుద్ధమైన శాఖలున్నట్టు " ఇది నిజమా" ప్రథమ భాగంలో "పేరుకే ముందుమాట - చెప్పేదంతా వెనుకటి మాట" అనే శీర్శిక చదివాకే నాకు





తెలిసింది. అయితే సనాతన క్రైస్తవ సమాజం శాస్త్రపరిజ్ఞానాన్ని, మహోన్నత శాస్త్రవేత్తలను అత్యంత కౄరంగా అణచివేయడము, సజీవ దహనాలు గావించడము చూడగా విభ్రాంతి గొల్పింది. బహుషా నేటి క్రైస్తవ సమాజాలకు ఈ విషయాలు అంతగా తెలియక పోవచ్చునేమో.

యావత్ ప్రపంచంలో ఇంతటి విస్తృత ప్రచారంలో నున్న ఈ క్రైస్తవ మతానికి రష్యా, చైనాలు ఎందుకు దూరంగా జరిగాయో నాకిప్పుడే అర్థమయ్యింది. క్రైస్తవ మతం పెట్టుబడి దారీ వ్యవస్థకే పెద్దపేట వేయడం ముఖ్యకారణం. క్రైస్తవ మతసారాంశం దరిద్రులు-దరిద్రులు గనే వుండిపోవాలని, భూలోకంలో తిండి, బట్ట, గూడునీడ కరవైనా నోరుమెదపకుండ ఎదురుతిరగకుండ "దరిద్రలాజరు" వంటి దిక్కుమాలిన వారికే పరలోక స్వర్గం అని మభ్యపెడుతుందీ క్రైస్తవమతం అనిపిస్తుంది. ఆకారణంగానే పాశ్చాత్యప్రపంచం తమ పెట్టుబడిదారీ భూస్వామ్య వ్యవస్థకు అనుకూలమైన క్రైస్తవ మతాన్ని ఆదరిస్తుంది. ఇట్టి కారణంగా ఎన్ని కష్టనష్టాలెదురైనా అవమానాల పాలైనా, దోపిడీకి గురియైనా పల్లెత్తుమాటనకుండ విప్లవాలకు దూరంగా యుంటూ మిధ్యాలోకాలకోసం ఎదురు చూస్తూ క్రైస్తవలోకం కాలగర్భంలో కలసి పోతుంది.

చాలామందికి తెలుసునోలేదో గాని నాకు ఇప్పుడిప్పుడే తెలిసింది. అసలు ఈ కమ్యూనిష్టు సిద్ధాంతం కూడ క్రైస్తవ మతం అణచివేతనుండే పుట్టుకొచ్చిందేమో ననిపిస్తుంది. జన్మత క్రైస్తవ మతస్తులైన మార్క్స్, ఏంగిల్స్, లెనిన్ తదితర మేధావులు ఈ క్రైస్తవ మత నేపథ్యంలో నుండి వచ్చినవారే! ఇట్టి మతాల క్రింద అణచివేయబడుచున్న కార్మిక లోకానికి, బడుగువర్గాలలో వీరు భావవిప్లవం రేకెత్తించి మార్గ దర్శకులైయ్యారు.

ఇటీవలి కాలంలో కమ్యూనిజం కొన్ని విమర్శలకు లోనౌతూ వచ్చినా నేటి పీపుల్స్ చైనా నూతన దృక్పథంలో మరింత ముందుకు పోతూ అటుపారిశ్రామికంగాను, ఆర్థికంగాను అభివృద్ధి పథంలో ముందుకు సాగుతూ అగ్రరాజ్యాలను సైతం అధిగమించే పోకడలు కనబడుచున్నాయని విశ్లేషకులు "జోస్యం" చెబుతున్నారు. అలాగే అంతరిక్ష పరిశోధనల్లో కూడ ముందుకు దూసుకుపోతుంది.

నేటి కంప్యూటర్ యుగంలో పుస్తక పఠనం కొంతవరకు తగ్గినట్టుగా కనబడుతుంది. అయినా ఈ ఇది నిజమా? ప్రథమభాగం యొక్క ముద్దులొలికే ముఖచిత్రం చూస్తేనే ఈ పుస్తకాన్ని ఏక బిగిని చదివేయాలని పిస్తుంది. ఇదంతా ఎందుకు అసలు పుస్తక ప్రారభమందలి "ఉపోద్ఘాతాలు", ముందుమాటలు, ముగింపువాక్యాలు చదివితే చాలు

మీకు చక్కని అవగాహనతో కూడిన ఆలోచనా విధానం సమగ్రరూపందాలు స్తుంది. అనేక క్రొత్త విషయాలను బయల్పరుస్తుంది. ఇందు అనేక క్రొత్త విషయాలు, అనేకులను ఆలోచింపజేసే సంగతులు నెల్సన్‌రఫ్షీ గారు జనాలముందు పెట్టారు.

ఏది ఏమైనా నెల్సన్‌రఫ్షీ తన జీవిత చరమాంకంలో తన 80వ పడిలో ప్రవేశించినా వారి సుదీర్ఘమైన పరిశోధనా వ్యాస పరంపరలతో మరిన్ని భాగాలు విడుదల చేయపూనుకోవడం, అత్యంత ధైర్యసాహసంగా భావిస్తున్నారు. ఇట్టి సాహసోపేతమైన అచంచల దీక్షాతత్పరతకు నేను "రెడ్ శాల్యూట్" చేయకుండ వుండలేక పోతున్నాను. ఇక శలవు. ఆఖరుగా వీరుచెప్పిన సూక్తి ఒకటి చెప్పిముగిస్తాను. "దేవుడికి వేయికొబ్బరి కాయలు కొట్టడం కన్నా - అన్నార్తునికి ఒక అరటి పండివ్వడం మిన్న" అనేవారు.

25.11.2012





# నా అభిప్రాయం

● డా॥ సి. జాకొబ్ B.A., B.L.(Phd.)

జిల్లా జడ్జ్ (Retired), నరసాపురం (ప॥ గ॥ జిల్లా), (A.P.)

నెల్సన్ రఫ్షీ సనాతన క్రైస్తవ కుటుంబంలో పుట్టి, క్రైస్తవునిగా పెరిగి, క్రైస్తవ గ్రంథమైన బైబిల్‌ను విమర్శిస్తూ నాస్తిక ధోరణిలో "ఇది నిజమా!" అనే గ్రంథాన్ని వ్రాయడమేమిటి? అని క్రైస్తవ సమాజం ఈయనను గర్హించవచ్చు. అయితే వీరు బైబిల్ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివి, విమర్శనా దృష్టితో పరిశీలించి ఈ మత గ్రంథంలో చెప్పబడిన విషయాలు పరస్పర విరుద్ధంగా వుండుట వలన ఇవి ఎంతవరకు నమ్మదగినవి? అనే విషయాలకు వీరు అనేక ఉదాహరణలుగా బైబిల్ వాక్యాలతో రిఫరెన్సులిస్తూ అవసరమైన చోట్ల అనేక చిత్రాలతో విడమరచి చెప్పడం విశేషం.

విమర్శనా దృష్టితో ఏ మత గ్రంథాన్నైనా ఎవరైనా సరే నిష్పాక్షికంగా చదివితే ఈ రచయితకు వచ్చిన అనుమానాలు, ఆలోచనలే వస్తాయి. వీరు ఈ గ్రంథ పరంపరలకు "ఇది నిజమా?" అనే పేరు పెట్టడంలో ఎంతో అర్థముంది. బైబిల్‌లోని ఆదికాండం మొదటి అధ్యాయంలో విశాల విశ్వాన్ని యెహోవా ఎలా సృష్టించాడో అనే విషయాన్ని వివరిస్తూ, ఆదాము హవ్వలు సర్పము ద్వారా ఏ విధంగా వంచించబడ్డారో ఆ సందర్భంలో సర్పము యుక్తిగా పలికిన మొదటి మాట "ఇది నిజమా?" అనే మాటనే ఈ ప్రథమ భాగానికే కాక సీరియల్‌గా విడుదలకానున్న రెండు - మూడు - నాల్గవ భాగాలకు కూడ ఇదే "టైటిల్"తో అనేక విషయాలను సరిక్రొత్త కోణాల్లో చర్చిస్తూ ఇది నిజమా? యని ప్రశ్నించడం జరుగుతుంది. ఇట్టి ఈ రచనలను ఆలోచనా పరులైన ప్రతి ఒక్కరు వారివారి అనుభవాల్లోకి వచ్చిన అనేక విషయాలను ఇది నిజమా లేక అది నిజమా! లేక ఏది నిజం? అని ప్రశ్నించుకొంటూ, ఇది శాస్త్రీయమా? కాదా అనే విషయాలను ఆలోచించుకోవడము అవశ్యము. సామాన్యుని నుండి మేధావి వరకు తమకున్న జ్ఞాన పరిమితులలో అన్ని విషయాలను పరిశీలించి, ఆలోచించి బేరీజు వేసికొని ఒక నిర్ణయానికి రావడానికి ప్రయత్నించే వారికి ఈ రచన సహకరించగలదు. నెల్సన్ రఫ్షీ చేసిన పని ఇదే! కాని అనేకులు ఎంతటి విజ్ఞాన వంతులైనా మత గ్రంథం ముందు మోకరిల్లే సరికి తమ శాస్త్రీయ ఆలోచనలను స్తంభింపజేసుకోవడం కనబడతాది. సత్యాసత్యాలను గ్రహించే ప్రయత్నం చేయడము, దేనినీ గుడ్డిగా నమ్మక ప్రశ్నించే మనస్తత్వాన్ని అలవరచుకోవడం ఎంతైనా అవసరము, మంచిది కూడ.

బైబిల్ పాతనిబంధన యందలి ఆదికాండము మొదలుకొని మలాకీ గ్రంథం వరకు గల 39 గ్రంథాలలో వ్రాయబడిన అంశాలలోని యెహోవా ధర్మశాస్త్రాలు... క్రొత్త

నిబంధనలోని యేసు బోధనలకు ఎటువంటి సారూప్యత కనబడదు. అందు పరస్పర విరుద్ధమైన ధర్మసూత్రాలు ప్రత్యక్షమౌతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే యేసు క్రీస్తు క్రొత్త నిబంధనలో మత్తయి (5:17-19)లో చూస్తే (నేను) ధర్మశాస్త్రమునైనను, ప్రవక్తల వచనములనైనను కొట్టి వేయుటకు వచ్చితినని తలంచవద్దు! నెరవేర్చుటకే గాని కొట్టివేయుటకు నేను రాలేదు. ఆకాశమును భూమియు గతించిపోయిననే గాని ధర్మశాస్త్రమంతయు నెరవేరు వరకు దాని నుండి ఒక్క పొల్లైనను, ఒక సున్నయైనను తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని ఖరాకండిగా చెబుతూనే పాత నిబంధన ధర్మసూత్రాలను ఒకటొకటిగా తీసిపారేయడం జరిగింది. దీనిని బట్టి పాత నిబంధన యందలి ధర్మ సూత్రాలు సరియైనవి కావనేగా దీని అర్థం. మానవ మాత్రులైతే తాము ఏర్పరచుకొన్న రాజ్యాంగ సూత్రాలు సరియైనవి కావని కాలానుగుణంగా మార్పులు చేర్పులు చేసికొంటారు. అయితే భవిష్యత్ గ్రాహులైన ఈ దేవుళ్లు కూడ ఇట్టి మానవ తప్పిదాలవంటివి చేయడమేమిటి? భవిష్యత్ వీరికి తెలియదా?

దీనికి ఒక్క ఉదాహరణ చాలు. శాస్త్రులు, పరిసయ్యులు ఒకసారి యేసు యొద్దకు వ్యభిచారమందు పట్టబడిన ఒక స్త్రీని తీసికొని వచ్చి ఈ పాపాత్మురాలికి మీరు ఏ శిక్ష విధిస్తారని అడిగినప్పుడు ఇట్టి స్త్రీని రాళ్లతో కొట్టి చంపాలనే నిబంధన వుంది కదా! అయితే మీలో పాపము లేనివాడు ఆమెపై మొదటి రాయి విసరాలని చెప్పగా ఏ ఒక్కరు ఆమెపై రాయి విసరకుండ నిష్క్రమించారు. యేసు ఆమె పాపాన్ని క్షమించి పంపివేశాడు. ఈ విధంగా ధర్మశాస్త్రాన్ని మార్చిన యేసు ధర్మశాస్త్రంలో ఒక సున్నగాని, పొల్లుగాని మార్చబడదని చెప్పి ఇంతటి పెద్దమార్పు ఎందుకు చేశాడు? ఇది తాను చెప్పిన మాట తప్పినట్లే కదా!

అలనాటి ఆటవిక అనాగరిక సమాజాలు తమతమ క్రూర ప్రవృత్తికి దర్పణంగా "కంటికి కన్ను... పంటికి పన్ను" వంటి క్రూరశాశనాలను నిర్దాక్షిణ్యంగా అమలు జరిపేవారు. ఇట్టి ఆటవిక అనాగరిక సంఘసంస్కర్తలైన రచయితలు ఇట్టి ధారుణ శిక్షాస్మృతిని తమతమ క్రూరమనస్తత్వానికి అనుగుణమైన రీతిలో తమ దేవుడైన యెహోవా ధర్మశాస్త్రంగా పాత నిబంధనలో దశాజ్ఞలను పొందుపరచడం జరిగింది.

యేసు తాను తన తండ్రియైన యెహోవా ధర్మశాస్త్రాని నెరవేర్చుటకే వచ్చానని దానిని కొట్టి వేయుటకు రాలేదని చెబుతూనే పాత నిబంధనలను సమూలంగా మార్చివేయడం జరిగింది. దీనిని బట్టి యేసు తన తండ్రి ఆజ్ఞలను ధిక్కరించి నూతన ధర్మసూత్రాలను బోధించినట్లే కదా! అటువంటప్పుడు మనము పాతనిబంధన ఇంతటి క్రూరమైనదై యుండగా దానిని పరిశుద్ధ గ్రంథమని భావించడము ఎంతవరకు సబబు? అయితే దీనికి బైబిల్ మేధావులు పాతనిబంధన కాలం "ఉగ్రతా కాలమని", క్రొత్తనిబంధన





"కృపాకాలానికి" చెందినదని సమర్థించ ప్రయత్నిస్తారు. అయితే అనేకులు అట్టి ఆగ్రహోదగ్రుడైన యెహోవా దేవుడు ప్రేమామయుడని, దయా దాక్షిణ్యపూర్ణుడని భజనలు చేయడము ఎంతవరకు సమర్ధనీయం?

అయితే మనమిక్కడ మరో ముఖ్య విషయాన్ని గమనిస్తే వ్యభిచారమనేది ఒక్క స్త్రీకి సంబంధించిన విషయం మాత్రమే కాదుకదా! ఇందుకు స్త్రీకన్నా పురుషుని ప్రోద్భలమే ఎక్కువగా వుండగా ఆ దుష్ట పురుషుడ్ని మాత్రం నిర్దోషిగా విడిచిపెట్టి ఒక్కస్త్రీని మాత్రమే అంతటి భయానకమైన హృదయ విదారక మెరటు శిక్ష విధించడంలోని ఔచిత్యమేమిటి? దీనిని క్రైస్తవ సమాజాలు కనీసం ప్రశ్నించడమైనా చేయకుండ ఆమోదించడమేమిటి? పై "పాపం"లో సరిసమానమైన భాగసామ్యం పురుషులకు లేదా? పురుషుడు నిర్దోషా! ఈ దోషం వారికి అంటదా! దీనికి మూలకారణమేమిటంటే ఈ మత గ్రంథాలన్నీ పురుష పుంగవులు రాసినవే అయినందున వారి స్వేచ్ఛకు ఏ మాత్రము భగం వాటిల్లని రీతిలో వ్రాసుకొని దేవుళ్లచే వత్తాసు పలికించుకున్నారు. ఎంతయినా దేవుడు కూడ పురుషుడేకదా! ఆకారణంగా స్త్రీలను పాపాత్ములుగా చిత్రిస్తూ, స్త్రీలను నరకద్వారాలుగా అభివర్ణిస్తూ వ్రాసుకున్నారని ఇట్టి అజ్ఞాన సమాజంలో స్త్రీలే ముందుండి భక్తి పారవశ్యంలో మునిగి తేలడం చిత్రమైన విషయం అంటూ యీ రచయిత తీవ్రమైన రీతిలో ధ్వజమెత్తడం సహజమేకదా! ఇంతటి వివరంగా విశదీకరించిన తరువాతనైనా స్త్రీలు కాస్త ఆలోచించగలిగితే సంతోషమే! ఏ మానవుడైనా తాను చేసేపనికి వ్యతిరేకమైన ఫలితం వస్తుందని ముందే తెలిస్తే అతడాపనిని చేయడం మానుకుంటాడు. భవిష్యత్ గ్రాహియైన యెహోవాకు అధ్యతన భావిలో తన ధర్మసూత్రాలు ఎందుకూ కొరగాకుండా పోతాయని తెలియదులాగుంది. ఇట్టి కారణాల వల్ల దేవుడు మానవునికన్నా తెలివితక్కువ వాడనుకోవాలా? ఎందుకు - ఏమిటి - ఎలా! అని మనము ప్రశ్నించుకుంటేనే సత్యాసత్యాలు బయటపడతాయి.

ఒకటికాదు రెండుకాదు వందలాది సందర్భాలలో పాతనిబంధనయందు పరస్పర విరుద్ధమైన విషయాలు అనేకం బయటపడతాయి. యెహోవా దేవుడు ఉగ్రుడని... దహించు అగ్నియని... యుద్ధవీరుడని... సైన్యాలకు అధిపతియని చెప్పబడుతూ ఇందు అనేకం మనుష్యులకు వుండే లక్షణాలనే బైబిల్ రచయితలు యెహోవాకు ఆపాదించారు. నరహత్య చేయవద్దు... దొంగిలవద్దు... వ్యభిచరించవద్దు అనే ఆజ్ఞలను సాక్షాత్తూ యెహోవాయే తుంగతో త్రొక్కి తన స్వజనులని చెప్పుకున్న ఇశ్రయేలు జనాంగమైన యూద ప్రజలతో... అనేకసార్లు దురాక్రమణ యుద్ధాలను తాను ముందుండి నడిపిస్తూ అనేకమార్లు అన్యజనాంగాలను దొరికిన వారిని దొరికినట్టుగా నరికిపారేయమనడమే గాక ఒకసారి యెహోవా తన దూతను పంపి ఒక్కరాత్రిలోనే లక్షాఎనబదియైదు వేలమంది

అన్యజాతి యోధులను హతమార్చినట్లు బైబిల్ చెబుతుంది. ప్రశాంతంగా జీవించే అనేక జనాంగాలపై దాడులకు పురికొల్పి వారి యావదాస్తిని దోచుకొని దోపుడుసొమ్మును వాటాలు లేసికోమని చెప్పడమేగాక వారి ఆవాసాలను దహనం చేయిస్తూ, పురుషసంయోగ మెరుగని కన్నె పిల్లలను మాత్రం బ్రతకనిచ్చి మీ ఆనందం కొరకు ఉంచుకోమని చెప్పడం వ్యభిచరించమని సెలవివ్వడము జరిగింది. ఈ విధంగా యెహోవా తానిచ్చిన నియమ నిబంధనలను తానే ధిక్కరింప జేయడము ఎంతటి అవివేకంగా వుందో వర్ణించనలవికాదు. దేవుని ప్రేమను గూర్చి బల్లలు చరిచి ప్రసంగించే మహానీయులెవరికి ఇట్టి దుష్ కృత్యాలు కనబడవా?

మనము లేవియాకాండం చూడగా యెహోవాకు ఆహారంగా జంతుబలులు ద్వారా రక్తమాంసాలు, క్రొవ్వు, వాటి అంతర్ భాగాలను యెహోవా దహన బలులుగా స్వీకరిస్తూ "చక్కని - సువాసన"లను ఆఘ్రాణించి తృప్తిపడతాడా? ఇట్టి అనాగరిక ఆటవిక ఆలోచనలు మారుతూ వచ్చేసరికి యెషయా, ఇర్మియాల కాలం నాటికి నాకు జంతుబలులు, రక్తమాంసాలు కావాలా? నాకు విరిగి నలిగిన హృదయాలే కావాలని చెప్పి ప్లేటు పిరాయించడమేమిటి? దైవానికి ఇట్టి విధమైన చంచల మనస్తత్వ మేమిటి! తాను ఒకసారి జారీచేసిన ఆదేశం, ధర్మసూత్రం తనంతట తానే మార్చివేయడమేమిటి? నాడెందుకు తనకు పాపపరిహార బలులు కోరడము, తిరిగి అవన్నీ అనవసరమని చెప్పడం ఎంతవరకు సమర్ధనీయం? ఇవి సమంజసమైన విమర్శలుకావా? దీన్ని గూర్చి మీరు ఆలోచించలేరా!

నిష్పక్షపాతంగా ఆలోచిస్తే క్రీస్తు పూర్వం గాని, అనంతరం గాని అనేకమంది జ్ఞానులు తత్వవేత్తలు, వేదాంతులు మొదలైనవారు అనేక విమర్శలు చేస్తూవచ్చారు. అదే కోవలో నేడీ రచయిత చెప్పిన విధంగా భూమ్యాకాశాలు, సూర్యచంద్ర నక్షత్రాదులను చూచిన పామరజనాంగంతో పాటు బుద్ధిజీవులు కూడ సూన్యంలో నుండి ఏదీ రాదని అంటూ ఏదో ఒక అతీతశక్తి లేక దేవుడు ఈ యావత్ సృష్టిని, జంతుజాలాన్నీ, నరులను సృష్టించివుంటాడని ప్రగాఢంగా విశ్వసిస్తూ వుంటారు. అసలు ఒక సృష్టికర్త అనే వాడులేకుండ ఏ వస్తువుగాని జీవంగాని పుట్టియుండదని తిరుగులేని విధంగా వాదిస్తూవుంటారు. ఇట్టివారి వాదన సమంజసమే అనుకుందాము! అయితే ఇదే విషయాన్ని వీరుచెప్పే దేవుడికి ఎందుకు వర్తింపజేయరు? ఈ దేవుడ్ని సృష్టించడానికి మరో బలీయమైన శక్తిలేక సుపీరియర్ సృష్టికర్త మరొకడు వుండి తీరవలసిందే కదా! ఈ విధంగా అనుకుంటూపోతే ఈ వాదనకు అంతం వుండదుకదా! అట్టి అతీతశక్తి ఒక్కదేవుడ్ని సృష్టించి ఊరుకోదుకదా! ఇట్టి ఆలోచనా యుతమైన చర్చకు ఏ మతగ్రంథము సమాధానం చెప్పలేదు!





నేటి నాగరిక ప్రపంచలో శాస్త్రవిజ్ఞానం మరింతగా పెరిగిపోతుంది. ఇట్టి విశేష జ్ఞాన సంపదలతో మరింత ముందున్న పాశ్చాత్య దేశాల్లో ఇట్టి అంధ విశ్వాసాలతో కూడిన మత ప్రాభల్యం క్రమక్రమంగా తగ్గుముఖం పడుతుంది. ప్రజలు మెలమెల్లగా చర్చీలకు దూరమౌతున్నారు. అట్టి పరిశుద్ధ ఆరాధనా సౌధాలు వెలవెలబోతున్నాయి. థియాలజీ కోర్సులు చదివిపాస్టర్లుగా పని చేయుటకు నేటి యువతరం ముందుకు రావడము లేదట లక్షలాది రూపాయల వేతనం దొరికే సాఫ్ట్‌వేర్ చదువుల వైపు వారు ఆకర్శించబడుచున్నారు. ఇట్టి కారణాల వల్ల ఆఫ్రికావంటి వెనుకబడిన దేశాలనుండి పాస్టర్లను దిగుమతి చేసికోవలసిన అగత్యం ఏర్పడింది. ఈ నేపథ్యంలో అనేక సుందరమైన చర్చీలు మూతపడుచుండగా వాటిని స్టార్‌హోటళ్లుగాను, "కేసినో"లు గాను రూపొందిస్తున్నారని తెలుస్తుంది.

"ఇంటర్ నేషనల్ హ్యూమనిస్ట్ న్యూస్" పత్రిక సౌజన్యంతో

అయితే అనేక దేశాల్లో మరిముఖ్యంగా వర్ధమాన దేశాల్లో భక్తి ప్రభంజనం మరింతగా పెరుగుతుంది. దేశంలోని అనేక గ్రామీణ ప్రాంతాల్లో చిన్నాచితుకు చర్చీల్లో అనేకమంది థియాలజీ కోర్సుల్లో పాస్టర్లుగా శిక్షణ పొందకుండానే కంట్రీ-పాస్టర్లుగా కుప్పలుతెప్పలుగా సంఘాలను స్థాపించి స్వస్థతా ప్రార్ధనలు, దయ్యాలను పారద్రోలే తతంగాలు నిర్వహిస్తూ రెండు చేతులా సంపాదిస్తున్నారు. విశ్వాసుల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతుంది. పెరుగుట విరుగుట కొరకే అన్న విధంగా మున్ముందుకు వీటికి కూడా అదేగతి పట్టవచ్చును.

సాధారణంగా మనము ఏ మతగ్రంథాలు తిరగేసినా అందు దేవుళ్లతో పాటు దయ్యాలు, భూతప్రేత పిశాచాలు అపవాది పాత్రలు, రాక్షసగణాలు, దురాత్మాసమూహాలు సమాంతరంగా సాగుతూవుంటాయి. పై రెండు వర్గాల మధ్య నిర్విరామంగా ప్రచ్ఛన్న యుద్ధాలు కొనసాగుతూనే వుంటాయి. నిజానికీ భూతప్రేత పిశాచాలనేవి కేవలం కల్పితాలు ఒక ప్రక్క దేవుడే మిధ్యయని చెబుతూ యుండగా ఈ దయ్యాల ఉదంతాలన్నీ కాశీమజిలీ కథలే!

బైబిల్ నందలి అపవాది పాత్ర ఎక్కడి నుండి సంగ్రహించబడిందో సాక్ష్యాధారాలతో సహావివరిస్తూ ఈ సైతాను, ఘటసర్పం, అంధకార శక్తి, అపవాదిగా బైబిల్‌లో చెప్పబడిన "అపవాదిల" పుట్టు పూర్వోత్తరాలు వాడిని గూర్చిన చిత్రకథనాలు ఈ ప్రథమ భాగంలో ప్రముఖంగా ప్రచురించబడి ఈ ప్రథమ భాగం "అపవాది" స్పెషల్‌గా కనబడతాది.

ప్రముఖ తత్వవేత్త శ్రీ సర్వేపల్లి రాధాక్రిష్ణ మహాశయుడు ఈ క్రింది విధంగా చెప్పారు. The Knowledge of GOD depends up on the Knowledge of and individual అనగా ఒక వ్యక్తి యొక్క దైవాన్ని గూర్చిన ఆలోచన అతని జ్ఞానసంపదపై ఆధారపడియుంటుందని అర్ధం.

ఆ విధంగానే "స్పినోజా" అనే తత్వవేత్త నీగ్రోవాళ్లు కానివ్వండి లేక స్వేత జాతీయులు కానివ్వండి ఎవరైనా సరే వారు తమతమ దేవుళ్లను సృష్టించుకోవడం తటస్థిస్తే వారు తమతమ ఆ కృతుల్లోనే వారి రంగులలోనే సృష్టించుకుంటారని చెబుతూ కుక్కలు నక్కలు సమస్త జంతుజాలం మరణించి మట్టిలో కలసిపోతే మనుష్యులు కూడ వాటివలెనే మరణానంతరం నశించిపోతారని, అంతేగాని ఆత్మ, పరమాత్మ, పాపం - పుణ్యం, నిత్యనరకాగ్ని, నిత్యపరలోక స్వర్గం అన్నీ కల్పితాలే అన్నారు. ఇట్టి తత్వవేతలు ఈ విధంగా చెప్పారంటే క్రైస్తవ సమాజాలు నమ్మడం దుర్లభం. పరిశుద్ధ గ్రంథం ఏమి చెప్పినా వీరు తప్పకవింటారు. అందుచే ఎక్కడెక్కడి నుండో ఏవేవో విషయాలు సేకరించి చెప్పేకన్నా "కాగల కార్యం గంధర్వులే తీర్చారన్న" చందాన మనము సత్యవేద గ్రంథమైన మన పరిశుద్ధ బైబిల్ గ్రంథాన్నే ఆశ్రయిందాము.

(ప్రసంగి 3:19-22)లో మనము చూస్తే... నరులకు సంభవించునది యేదో అదే మృగములకు సంభవించును. వారికిని, వాటికిని కలుగుగతి ఒక్కటే! నరులు చచ్చునట్లు మృగములును చచ్చును. సకల జీవులకు ఒక్కటే ప్రాణము. మృగములకంటి నరులకు ఏమియు ఎక్కువలేదు. సమస్తము వ్యర్థము సమస్తము ఒక్కచోటునకే పోవును. సమస్తము మంటిలో నుండి పుట్టెను. సమస్తమును మంటికే తిరిగిపోవును. నరుల ఆత్మ పరమునకు ఎక్కిపోవునో లేదో - మృగముల ప్రాణము భూమికి దిగిపోవునో లేదో ఎవరికి తెలియును?

కాగా తమకు తరువాత జరుగుదానిని చూచుటకై నరుని తిరిగి లేపుకొని పోవువాడెవడును లేకపోవుట నేను చూడగా, వారు తమ క్రియలయందు సంతోషించుట కంటే వారికి మరి ఏమేలును లేదను సంగతి నేను తెలిసికొంటిని. ఇదే వారి భాగము.

ఈ ప్రసంగి గ్రంథ రచయితయైన రాజైన సోలోమోనుకు యెహోవా దేవుడు అనుగ్రహించిన జ్ఞానమే! పై వాక్యాలను మనము శ్రద్ధగా చదివితే స్పినోజా తదితర తత్వవేత్తలు చెప్పిన విధంగానే ఈ దైవజ్ఞాని చెప్పిన మాటలను బట్టి ఆత్మ, పరమాత్మ, స్వర్గం, నరకం అనేవి లేనేలేవని అవన్నీ కల్పితాలని, బైబిల్ చెప్పే ఇవన్నీ లేనప్పుడు దేవుడుకూడ లేనేలేడని సోలోమాను ప్రసంగం యొక్క సారాంశం. ఈ పలుకులన్నీ పరిశుద్ధ గ్రంథంలో భాగమై వున్నందున ఇట్టి దైవజ్ఞానాన్ని క్రైస్తవ సమాజం నమ్మగలదా? బహుషా తిరస్కరించవచ్చు. అంటే వీరు స్వయంగా యెహోవా అనుగ్రహించిన వాక్కులను సైతం అంగీకరించుటలేదని దీని అర్థం. ఈ విధంగానే బైబిల్ నందు గల అనేక అవకతవకలు, అసందర్భాలు, అబద్ధాలు, జాత్యాహంకారాలు, పరమత ద్వేషం, సామూహిక హింసాకాండ, విచ్చలవిడి వ్యభిచార ప్రోత్సాహం, భూత ప్రేత పిశాచాల వంటి అనవసర భయాందోళనలను ఖండిస్తూ, నిశితంగా విమర్శిస్తూ సాగిన ఈ "ఇది నిజమా?" రచనా పరంపరలు అనేకులను ఆలోచింపజేయుననుటలో ఎటువంటి సందేహము లేదు.

2-10-2012





# నా మాట

● తుమ్మా భాస్కర్
[redacted], హైద్రాబాద్

నెల్సన్ రష్దీగారు రచించిన వ్రాతప్రతి "ఇది నిజమా" ప్రథమ భాగం చదివి ఆశ్చర్యపోయాను. వీరు వ్రాసిన మిగతా భాగాలు కూడ చదివితే బాగుండునని పించింది. ఎందుకంటే అవి ఇంకెంత ఘాటుగా వుంటాయోనని. గతంలో మీరు నాకు చిత్రకారుడి గానే తెలుసు. కాని వీరు మంచి రచయిత అని కూడ తెలిసింది. నాకు సాల్మన్ రష్దీ "సాటనిక్ వర్సెస్" వ్రాశాడని తెలుసు గాని దానిని నేను చదవలేదు. నేను దీనినిచదివి, సాటనిక్ వర్సెస్ చదివినంతగా ఫీల్ అయ్యాను. మంచి యన్నదే మాలయైతే నేను మాలనౌతానని గురుజాడ అన్నట్టుగా మంచిని కోరేదే సాతాను అనట్టు కనిపించింది.

వీరు బైబుల్‌లోని అల్ఫానుండి ఒమెగా వరకు అనగా ఆదికాండము నుండి ప్రకటన గ్రంథం వరకు స్పృషిస్తూ ముందుకు సాగారు. చదువరులకు తేలికగా అర్థమయ్యే రీతిలో అక్కడక్కడ సామెతలను, చిన్న చిన్న కథలను వ్రాయడమేకాక సందర్భోచితంగా అనేక చిత్రాలను గీయడం బాగుంది. యెహోవాను ఒక అనాగరిక జాతి తమకు కావాలనే సృష్టించుకున్న దేవుడులా కనబడుచున్నాడు. ఆ దేవుడ్ని వారు ప్రతిపాదించే నాటికే ప్రపంచంలో అనేక ప్రాంతాలందు ఇతర జాతులు, తదితర దేవుళ్లు కూడ వున్నారు. ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతులు రాజులు ఏర్పడక ముందే ఇతచోట్ల రాజ్యాలు రాచరిక వ్యవస్థ వుండడమే కాదు ఈజిప్టు, మెసపటోనియా, భారత్, చైనా, మెక్సికో లాంటి ప్రదేశాల్లో నాగరికతలు విలసిల్లాయి. ఇశ్రాయేలీయులను ఒక కట్టడిలో వుంచుటకు ఒక త్రాటిపై నడిపించుటకు యెహోవా పేర న్యాయాధిపతులను రాజులను నియమించడము. అయితే యెహోవా నియమించాడని చెప్పే ఒక్క ప్రవక్తగాని, న్యాయాధి పతిగాని, రాజులు గాని నీతిమంతులుగా కనబడక పోవడము చూస్తాము. సంఘంలోను, రాజకీయ వ్యవస్థలోను జరిగే మానవీయ పరిణామాలేగాని అవి దైవికమైనవిగా ఎంతమాత్రము కనబడవు. ప్రతి విషయాన్ని దేవునికి అంటగట్టడం వలన ప్రజలను పురోహిత వర్గాల చెప్పుచేతల్లో ఉంచుకొనే ప్రయత్నమే కనబడతాది. యెహోవా దేవునిలో కూడ మానవులకున్న క్షమ, దయా లక్షణాలతో పాటు కోపతాపాలు, కౄరత్వము మొదలైన మృగ లక్షణాలు కూడ కనబడతాయి.

యెహోవాలో మానవుల వలెనే కులాభిమానం జాత్యాహంకారం కొట్టవచ్చినట్టు కనబడతాది. ఆదిమ జాతుల్లో మనకు కనబడుచున్న జంతు బలులు, హింస, కౄరత్వము అడుగడుగునా గోచరిస్తాది. పాతనిబంధనలో పాపాత్ములకు ఈలోకమందే శిక్షలు విధించబడ్డాయి. నరకం, స్వర్గం సంగతులు చెప్పబడలేదు. కాని క్రొత్తనిబంధనలో

స్వర్గనరకాలు సృష్టించబడ్డాయి. నేను క్రైస్తవే తరుడనైనందున ఇందలి లోతుపాతులు అంతగా తెలియవు. అయినప్పటికి ఈ పుస్తకము ముగింపు చదువుతుంటే మతి పోతుంది. అందు రచయిత యెహోవాను ఘాటుగా విమర్శించినట్టు కనబడుతుంది. కాని వీరు బైబిల్ దేవుడ్ని తనకు తానుగా ఏమీ విమర్శించలేదు. అట్టి విమర్శలన్నీ బైబిల్ రచయితలు యెహోవా చర్యలను, ఆయన గొప్పతనాన్ని శృతిమించి వివరిస్తూ చివరకు దేవుడైన యెహోవాను అత్యంత క్రూరుడుగాను, చండశాసనుడుగాను వివరిస్తూ ఆయననొక దేవుడుగా కాక ఆయన ఒక ఉన్మాదిగా తీర్చిదిద్ది దైవత్వానికే మాయని మచ్చగానిలిపారు. ఇట్టి వివరణలతో వీరు "నార్వే ఉదంతం" వరకు వెళ్లడం బాగుంది. ఇట్టి సరిక్రొత్త విమర్శ పాటకుల్లో క్రొత్త ఆలోచనలు రేకెత్తించి నిజంగా యెహోవా దేవుడేనా? లేక ఆటవిక జాతులు సృష్టించుకున్న దేవుడేనని అనిపిస్తుంది.

వీరు పుట్టుకతో క్రైస్తవులైనందున సమగ్రరూపంలో బైబిల్‌పై విమర్శనా గ్రంథాన్ని వ్రాయగలిగారు. ఈ విధంగా మత గ్రంథాల్లో వున్న అసమంజసాలను, అసంగతాలను, ఆజ్ఞానాన్ని, అబద్ధాలను బట్టబయలు చేసే ఇటువంటి గ్రంథాల అవశ్యకత ఎంతయినా వుంది. ఇటువంటి రచన నేనెప్పుడూ చూడలేదు.





## ఎందరో మహానుభావులు... అందరికీ వందనాలు...

నేను ఈ రచనా వ్యాసాంగం తాలూకు బృహత్ కార్యాన్ని తలపెట్టిన నాటినుండి అనేక మంది అనుభవజ్ఞులతో సంప్రదిస్తూ వచ్చాను. చాలా కాలంగా అట్టి వారినుండి బహుమతులుగా అందుకున్న అనేక విలువైన శాస్త్రీయ గ్రంథాలు నాకు అనేక విషయాల్లో చక్కని అవగాహన కలిగించాయి. ఈ నేపథ్యంలో ఆర్.టి.వొ. మాజీ కమీషనర్, వారి సహధర్మచారిణి (సిటి సివిల్ కోర్ట్ జడ్జిగార్లు) వారి లైబ్రరీనుండి కొన్ని పుస్తకాలు నాకివ్వడం జరిగింది. అందు ముఖ్యంగా ఆంధ్రా ఎన్‌సైక్లో పీడియాగా చెప్పుకునే పెద్ద బాలశిక్ష అనే ఉద్గ్రంథం, అందలి అనేక అమ్యూల విషయాలు నాకు చక్కని బాషా పరిజ్ఞానాన్ని అందించాయి. సి.ఎల్.ఎన్. గాంధీ దంపతులకు శుభాభినందనలు.

చీరాల - మనీషా విద్యావిహార్‌కు చెందిన శ్రీ యన్.వి.బ్రహ్మంగారు 1980లో రచించిన "బైబిల్ బండారం"... అనంతరం పశ్చిమ గోదావరి జిల్లా జిన్నూరు (పాలకొల్లుకు) చెందిన శ్రీ పెన్మత్స సుబ్బరాజు గారి రచనలు... బైబిల్ దర్శిని, నాపరిశీలనలో బైబిల్, బైబిల్ దేవుడి ఆటకట్టు, బైబిల్ సృష్టివాదం వంటి పుస్తకాలు బైబిల్ నందలి అనేక అసంభావ్యాలు, అసందర్భాలు వంటి చిరుపుస్తకాలు నాకు బైబిల్‌పై మరింత అవగాహన కలిగించాయి. యస్.వి.బ్రహ్మంగారికి, పెన్మత్స సుబ్బరాజు గారికి అభినందనలు.

సుమారు 25 సంవత్సరాల క్రితమే విశాఖపట్నానికి చెందిన గురుతుల్యులు "భానాస" వ్యవస్థాపకులైన డా॥జయగోపాల్ గారు గ్రీకు పురాణగాథల నుండి బైబిల్‌లో చేర్చబడిన అపవాది పాత్రను గూర్చిన అంశాన్ని అలనాడే నాకందించారు. అనంతరం ఈ రచన కోసం మరింత సమాచారాన్ని సేకరిస్తూ, అత్యంత విలువైన ఫోటోలను కూడ సేకరించడం జరిగింది. ఈ విధంగా ఇంటర్ నెట్ ద్వారా మరింత సమగ్ర సమాచారాన్ని సేకరించడం జరిగింది. నేటి ఆధునిక యుగాల్లో ఇంటర్ నెట్ ద్వారా మానవాళికి అందిస్తున్న W.W.W. విక్కీ పీడియా ఆర్గనైజేషన్ తదితర సంస్థల వారికి ధన్యవాదాలు.



అలాగే ప్రముఖ అణుశాస్త్రవేత్త ప్రఖ్యాత రచయిత శ్రీ కొడవటి గంటి కుటుంబరావు గారి కుమారుడు "బార్క్" విశ్రాంత శాస్త్రజ్ఞులు, సైన్స్‌రంగంలో అణుశక్తి, మానవ పరిణామ వాదంపై అనేక పుస్తకాలు రచించిన కొడవటి గంటి రోహిణీ ప్రసాద్ గారితో నేను వరుసగా మూడు రోజులపాటు సమావేశమై అనేక నూతన విషయాలు తెలిసికోవడము జరిగింది. వీరు 2011 డిసంబరు 25వ తేదీన మేము "మానవ వికాస వేదిక" హైద్రాబాద్ వార్షికోత్సవ సభల్లో పాల్గొన్న అనంతరం వీరునన్ను

సైనిక్‌పూర్‌లో అప్పటి నా నివాసంలో దింపి వెళ్లారు. దైవభయాలు లేని వారెవరైనా వారి ముఖాలు మహదానందంతో వెలిగి పోతూవుంటాయి. తెలియని భయాలు వీరికి వుండవు. దయ్యాలు వీరిని పీడించవు. అవేమి లేవు గనుక.

వీరు ఇటీవల సెప్టెంబరు 8న 2012లో ముంబాయిలో తనకుమారుని యొద్ద జెన్లోక్ ఆసుపత్రిలో కన్నుమూశారు. వీరి మృతికి నా ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాను. ఇట్టి సందర్భాల్లో పాత చింతకాయపచ్చడి లాంటి అలవాటు సంతాపంగా – వారి "ఆత్మకు" శాంతికలగాలని పొరబాటుగానైనా కోరను. ఆత్మ అనేదేలేదు గనుక?

ఈ రచన విషయంలో నాకు తగిన సలహాలు అందించి ప్రోత్సహించిన వారిలో భద్రాచలానికి చెందిన ప్రజావైద్యుడు డాక్టర్ భానూ ప్రసాద్ గారు.... విశాఖపట్నానికి చెందిన మేధావి విశ్రాంత ఆరోగ్య శాఖాధికారి శ్రీ యస్.నాగేశ్వర రావుగారు అందించిన బైబిల్‌లో యెహోవా గాక ఇతర దేవుళ్ల ప్రసక్తికి సంబంధించిన సమాచారం ఇంటర్ నెట్ రిఫరెన్సులతో సహా అందించారు... ఇదే "విశాఖ"కు చెందిన వై.నూకరాజు గారు... ఉక్కునగరం సెక్టర్-5కు చెందిన స్టీల్ ప్లాంట్ అధికారి లయన్ M.S.N. మూర్తిగారు... మరి ముఖ్యంగా ఈ ప్రథమభాగం వ్రాతప్రతిని క్షుణ్ణంగా చదివి సలహాలందించిన మానవ వికాస వేదిక గౌరవాధ్యక్షులు శ్రీ బి.సాంబశివరావుగారు హైద్రాబాద్, కరీంనగర్‌కు చెందిన రచయిత "మలయ" శ్రీగారు తదితర మిత్రులకు కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

పశ్చిమ గోదావరి జిల్లా నరసాపూర్‌కు చెందిన మిత్రుడు డా॥సి.జాకొబ్ గారు, "నేను మతాన్ని ఎందుకు విడిచిపెట్టాను?," "దేవుడు – మతము – విశ్వాసము" ఒక నూతన దృక్పథం తదితర గ్రంథాల రచయితయైన వీరు ఈ ప్రథమ భాగాన్ని ఆసాంతం చదివి, సమీక్షించి వారి అమూల్యమైన సలహాల నీయడమే గాక ఈ నారచన "ఇది నిజమా!" ప్రథమ భాగానికి పరిచయ వాక్యాలు వ్రాయడం అభినందనీయం. వీరు జిల్లా జడ్జిగా పనిచేసి రిటైర్ అయ్యారు. నాకు ప్రియమిత్రులు. అలాగే ముందుమాట అందరి కన్నా ముందుగా వ్రాసి పంపిన తుమ్మాభాస్కర్ గార్కి వందనములు. మరిముఖ్యంగా నా చిరకాల మిత్రుడు సి.పి.ఐ. సీనియర్ మోస్ట్ ఎం.ఎల్.ఏ. (బెల్లంపల్లి నియోజిక వర్గం) కామ్రేడ్ గుండా మల్లేష్‌గారు "చైనా"లో వ్రాసితెచ్చి ఇచ్చిన పరిచయ వాక్యాలకు నా లాల్ సలామ్!

అలాగే అభ్యుదయ వాదులు, కుల నిర్మూలనోద్యమ ప్రచారంలో ప్రముఖ పాత్రవహిస్తున్న వహీద్‌గారు వారి సహధర్మచారిణి "రాష్మిగ్రాఫిక్" అధినేతలు జ్యోతి గార్కి మరిముఖ్యంగా వీరు డి.టి.పిని చక్కగా నిర్వహించి ముచ్చటైన ముద్రణతో సకాలంలో అందించిన ఈ జంట కళాకారులకు కృతజ్ఞతలు.







The Great Tamil Personality, follower of Sri Periyar the Dravida Kajagam President and the Chancellor of Mani Ammai University, Sri Hon Dr.K. Veeramani, with Nelson Rushdie.

Recently, When I Spoke to Sri Veeramani garu regarding 'Idi Nijama' Book, I remind you that you have taken the resposibility of translating them into English and Tamil to carry on the revolution forward after they are published in Telugu. Now, that the book is published in Telugu, I humbly remind you about the same.

మహామనీషి... తమిళ దిగ్గజం... ద్రవిడ కజగం అధ్యక్షులు... మరియు "పెరియార్ మణి అమ్మాయ్ యూనివర్సిటీ" చాన్సలర్, డాక్టర్ కె.వీరమణి చెన్నై గారితో నెల్సన్‌రష్దీ...

శ్రీ వీరమణి గారితో "ఇది నిజమా" రచయిత ఇది నిజమా రచనా పరంపరలను గూర్చి ముచ్చటించి త్వరలో విడుదల కానున్న ఈ రచనలను తమిళంలోను, మరి ముఖ్యంగా ఆంగ్లంలోను తర్జుమా చేయించి ప్రచురించే బాధ్యతను స్వీకరించి ఉద్యమ వ్యాప్తికై తోడ్పడ వలసిందిగా నేను వారిని కోరగా పై రచనలు మొదటగా తెలుగులో విడుదల అనంతరము ఈ విషయాన్ని గూర్చి తప్పకుండ ఆలోచిస్తానని వీరు మాట ఇవ్వడం జరిగింది. వారి ఆమోదము కొరకు ఎదురుచూస్తూ....



చిరకాల మిత్రుడు మార్గ దర్శకుడు, రచయిత, కవి అయిన శ్రీ "సి.వి." గారు – "నరబలి" "సత్యకామ జాబాలి" ఇత్యాది చారిత్రక రచనల ద్వారా అందించిన రోమన్ కేథలిక్ మతాదివతుల సమగ్రచరిత్ర ఈ రచనకు ఎంతో తోడ్పడింది.

అట్టి మహామనీషి, నిగర్వి, నిరాడంబరుడైన మహనీయుడు శ్రీ సి.వరహాల రావు విజయవాడ (భవానీపురం) గార్కి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

– నెల్సన్ రష్దీ రచయిత

# మార్గ దర్శకాలు

ఈ విమర్శనా గ్రంథాన్ని రచించే సందర్భంలో అన్ని కోణాల నుండి ఆలోచించి, పరిశీలించి భారత రాజ్యాంగ ఆదేశిక సూత్రాలను పరిగణనలోనికి తీసికొని, అత్యంత జాగరూకత వహించి ఎదుటివారి మనోభావాలను కించపరచని రీతిలో రచనను సాగించే ప్రయత్నం జరిగింది. అయినప్పటికి నిజం చెబితే నిష్ఠూరమే నన్నవిధంగా వారు పరిశుద్ధ దేవుడని నమ్మే యెహోవా నిజస్వరూపాన్ని కేవలము బైబిల్ ఆధారంగానే బట్టబయలు చేసినప్పటికి అది పరమసత్యమైన దైనప్పటికి వారి దృష్టికి కటువుగానే గోచరించవచ్చు. ఇట్టి సత్యాలే కొందరి మనోభావాలకు పడకపోవచ్చు. అయితే రచయిత అబద్ధపు ఆరోపణలు చేస్తే బాధపడాలిగాని సత్యాన్వేషణను చూచి బాధపడడం అర్థంలేని పని. దీనికి బాధ్యత వహించేది పరిశుద్ధ గ్రంథమేనని మరువకూడదు. ఇందలి అనేక అంశాలను విమర్శిస్తూ, విడమరచి వివరిస్తూ వున్న సందర్భాలందు అడుగడుగునా బైబిల్ ఆధారిత వాక్యాలను ఉటంకిస్తూ తగిన వివరణలతో సున్నితంగా వివరించినప్పటికి సున్నిత మనస్కులైన విశ్వాసుల దృష్టికి అవి కఠిన విమర్శలవలెనే గోచరించవచ్చును. అయినప్పటికి ఈ రచనల ద్వారా అనేకులను ఆలోచింపజేస్తూ శాస్త్రీయ అవగాహన కలిగించే రీతిలో జరిగిన ప్రయత్నాన్ని గుర్తించగలరు.

పవిత్ర పరిశుద్ధ గ్రంథంగా భావించే ఈ బైబిల్‌పై విమర్శలాయని భావోద్రేకాలకు గురికావలసిన అవసరం ఎంతమాత్రము లేదు. సావధానంగా చదివితే సత్యం బోధపడగలదు. అనాదిగా మన పూర్వీకులు అనేక సహజ విషయాలను సైతం అవి అతీత శక్తులని భ్రమించి నమ్ముతూవచ్చారు. మొన్నమొన్నటి వరకు మనలో అనేకులు యీ విధంగానే భావిస్తూ వచ్చినా కాలక్రమేణా మానవ మేధస్సు వికసిస్తూ, అందలి సత్యాసత్యాలను ఒకదాని వెంబడి మరొకటి తెలిసికొంటూ వైరుధ్యాన్ని విడనాడుతూ యున్నప్పటికి మరిన్ని సందేహాలు మనల్ని వెంటాడుతూనే యున్నాయి. ఈ రచనా పరంపర ద్వారా అనేక విషయాలను అవగాహన చేసికొనే అవకాశము లభిస్తుంది. "ఇది నిజమా" యనే ఈ పరిశోధనా గ్రంథం వేయిపేజీల పై చిలుకు గ్రంథమైన్నప్పటికి పాఠకుల సౌకర్యార్థం దీనిని నాలుగైదు భాగాలుగా విభజించడం జరిగింది. ఇవన్నీ కూడ "ఇది నిజమా" అనే టైటిల్‌తోనే ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతర్థ భాగాలుగా సీరియల్‌గా మీ ముందుకువస్తాయి. ఆరోగ్యం అనుమతిస్తే అయిదవ భాగంకూడ...

మత గ్రంథాలపై విమర్శలు చేసే సందర్భాలందు తీసికోవలసిన జాగ్రత్తలన్నీ తీసికొంటూ ఉన్నత న్యాయస్థానాల సూచనలను, మార్గ దర్మకాలను పాటిస్తూ ఈ రచనలను కొనసాగించడం జరుగుతుంది. ఇట్టి సందర్భాలలో కోర్టులు వివరించిన మార్గదర్శక సూత్రాలను, న్యాయస్థానం చేసిన వ్యాఖ్యలను ఇక్కడ సోదాహరణగా వివరించడం కూడా జరిగింది.





# మతాన్ని విమర్శించడం వాక్ స్వాతంత్ర్యంలోని భాగమే!

**(ముంబయి హైకోర్టు సంచలన వాఖ్య!)**

ఆర్.వి.భూషణ్ ముంబాయిలో ఒక న్యాయవాది. ఆయన 2003లో "Islam: A concept of Political World Invasion By MULIMS" (ఇస్లాం ప్రపంచంపై రాజకీయంగా దాడి జరిపే ముస్లింల భావన) అనే పుస్తకం రచించారు. అది 2004లో ప్రచురించబడి పాఠకుల్లోకి వెళ్లగా దానిపై కొందరు లేవదీసిన అభ్యంతరాలపై మహారాష్ట్ర ప్రభుత్వం దానిని 2007లో నిషేధించింది. అప్పటి నుండి దానిపై సుదీర్ఘవాదోపవాదాలు విన్న మీదట హైకోర్టు 2010 జనవరి 6వ తేదీన తన తీర్పును వెలువరించింది.

ఆ తీర్పులో భాగంగా, "హిందూ, క్రైస్తవ, ఇస్లాం వంటి ఏ మతాన్నయినా విమర్శించడం తప్పుకాదని అది మనకు మన రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కులోని వాక్ స్వాతంత్ర్యపు హక్కుల్లో భాగమని" వ్యాఖ్యానించింది. ఈ తీర్పును ప్రకటించిన త్రిసభ్య ధర్మాసనంలో జస్టిస్ రంజనాదేశాయ్, జస్టిస్ డి.వై.చంద్రచూడ్, జస్టిస్ మోహిత్‌లున్నారు. ఇది ఒక మైలురాయిగా నిలిచిపోయే ఈ న్యాయమూర్తుల వ్యాఖ్యలు పౌరహక్కులు, ప్రజాసంఘాలు, అభ్యుదయ రచయితలు, సంఘసంస్కర్తల్లో సంతోషాన్ని నింపాయి. మనదేశంలో దేన్నయినా విమర్శించవచ్చు. అందుకు మతం మినహాయింపు కాదు. మతాన్ని విమర్శించడం కూడ భావప్రకటనా స్వేచ్ఛలో భాగమేనని వ్యక్తిగతంగా ఏ ఒక్కరూ దానికి నొచ్చుకోవలసిన పనిలేదని న్యాయమూర్తులు స్పష్టంచేశారు. ప్రతివ్యక్తి తన భావాలను ప్రకటించుకొనే స్వేచ్ఛను భారతరాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు మనకు కల్పిస్తున్నాయి. అందు మొట్టమొదటిది వాక్ స్వాతంత్రియం, భావ ప్రకటనా స్వేచ్ఛ!

ఈ సందర్భంలో భావ ప్రకటనా స్వేచ్ఛకున్న పరిమితుల్ని కూడ న్యాయమూర్తులు గుర్తుచేశారు. ఒక మతంపై చేసే విమర్శ ఆరోగ్యకరమైనది గాను, ఆలోచనను రేకెత్తించేది గాను, చర్చకు ప్రోత్సహించేది గాను, ఆ తరువాత మారడానికి తోడ్పడేది గాను వుండాలని వారన్నారు. ఏ మతంపై విమర్శచేస్తున్నా, ఆవిమర్శ ఆయా మతస్తుల్లో జ్ఞానాన్ని ప్రేరేపించేది గాను, నమ్మదగినది గాను వుండాలని రెండు సముదాయాల మధ్య ద్వేషాన్ని కల్పించేదిగా వుండరాదని "త్రిసభ్య బెంచ్" వ్యాఖ్యానించింది. మత పెద్దలు చేస్తున్న దుర్మార్గపు ప్రచారాలను, చర్యలను ప్రశ్నించే విధంగా ఉద్యమాల కార్యకర్తలకు ఈ మాత్రపు ఊరట కలిగించే వ్యాఖ్యలు ఇంతవరకు ఏ తీర్పులోను రాలేదు. ఆ కారణంగా ఇది ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది.

1947 ఆగష్టు వరకు బ్రిటీష్ సామ్రాజ్యవాదుల పాలనలో మగ్గిపోయిన భారతీయులు అంతకుముందు తాము కోల్పోయిన హక్కులకోసం ఆరాటపడ్డారు. ఆంక్షలు లేని సంపూర్ణ స్వేచ్ఛ కావాలని కోరుకున్నారు. అయితే అటువంటి స్వేచ్ఛ దేశ స్థిరత్వానికి తోడ్పడదని భావించి యుక్తమైన నిర్బంధనలు (Reasonable Restrictions) తో ఈ ప్రాథమిక హక్కులను అలనాటి రాజ్యాంగ నిర్మాతలు రూపొందించారు. ఏ పౌరుడైనా తన నోటి ద్వారాను, వ్రాతల ద్వారాను, లేక బొమ్మల ద్వారా గాని ముద్రణ ద్వారా లేదా ఇతర పద్ధతుల ద్వారా తన మనోభావాలను స్వేచ్ఛగా వెల్లడించుకోవచ్చని విషధీకరించారు. ఈ వాక్ స్వాతంత్ర్య హక్కుల్లో పత్రికా స్వాతంత్ర్యం కూడ భాగమే. అంటే ఒక పత్రికా యాజమాన్యం తన భావ ప్రకటనలతో పాటు, ఇతరుల మనోభావాలను కూడ సేకరించి ప్రచారం చేయవచ్చు. అలాగే టి.వి., రేడియో., ఇంటర్ నెట్‌ల వంటి ప్రసార సాధనాల ద్వారా కూడ ప్రచారము చేయవచ్చు.

అయితే ఈ హక్కులను వినియెగించుకొనే వారు కొన్ని నిబంధనలను కూడ పాటించడం తప్పనిసరి, దేశభద్రత, విదేశీ స్నేహ సంబంధాలు, ప్రజాశాంతి, నైతికత, పరువు నష్టం, నేరాలకు పురికొల్పడం, న్యాయ స్థానాలను ధిక్కరించడం మొదలైన అంశాలను పరిగణనలోనికి తీసికోవలసి యుంటుంది.

ఈ తీర్పులో న్యాయమూర్తులు చేసిన వ్యాఖ్యలు మత, ఆధ్యాత్మిక రంగాలను సంస్కరించేవారికి, ముఖ్యంగా నాస్తికహేతువాద, మానవాద సంఘాల రచయితలకు, కళాకారులకు, వక్తలకు ముఖ్యసూచనలను అందిస్తున్నాయి. ఏ మతం పట్ల లేదా మతస్థుల పట్ల మత విద్వేషపూరిత విమర్శలకు పాల్పడరాదని ఆయా మతాలను, లేదా మతస్థుల వ్రాతలను, వ్యక్తీకరణలను సహేతుకంగా, చర్చకు ప్రోత్సహించే విధంగా మతానుయాయుల్లో ఆలోచనను రేకెత్తించేదిగా వుండి తమను తాము మార్చుకోవడానికి ఉత్సాహపరిచే విధంగా వుండాలని గుర్తుచేస్తున్నాయి.

"ఇంటర్ నేషనల్ హ్యూమనిస్ట్ న్యూస్" పత్రిక సౌజన్యంతో





# ఇందలి చిత్రాలను గూర్చిన వివరణ

"ఇది నిజమా" అనే ఈ రచనలందలి చిత్రాలను గూర్చిన వివరణ ఈ రచనలయందలి విషయాలను మరింత ప్రస్ఫుటంగా విషదీకరించుటకు, పాఠకులు మరింత తేలికగా గ్రహించుటకును, సత్వరావగాహనకై ఈ గ్రంథ రచయితనైన నేను స్వతహాగా చిత్రకారుడను కూడ అయినందున ఇందులో అడుగడుగునా అనేక చిత్రాలను కార్టూన్లను ఫోటోలను సందర్భాను సారంగా జతచేయడం జరిగింది. అయా మతాలందు ఆయా దేవుళ్ల సమగ్ర రూపాలుగా అనేక ఊహా చిత్రాలను ప్రదర్శించడము మనము చూస్తూనే ఉన్నాము. క్రైస్తవ వాఙ్మయంలో యేసు యొక్క శిల్పాలు మొదలైనవి 9వ శతాబ్దంలో లభించినట్టు చరిత్ర కారులు చెబుతున్నారు. మరి కొందరి వాదన యేసు ఈ చెంపమీద కొడితే మరో చెంప తిప్పమన్న సాత్వికుడని కరుణామయుడని ఇట్టి ప్రేమ తత్వం ఆధారంగా యేసు రూపురేఖలు రూపొందించబడ్డాయని మరో వాదన కూడా యుంది. ఆ ప్రకారంగా చిత్రించబడిన ఈ యేసు చిత్రం ప్రపంచ ప్రఖ్యాతిగాంచి ప్రజల మన్ననల నందు కొంటుంది.



*ఇదిలా గుండగా యేసుకు కరుణామయుడు అనే "బిరుదు" సమంజసంకాదేమో! ఆయన దేవాలయం దగ్గర చిరువ్యాపారులు గువ్వలు, పావురాయలు అమ్ముకొంటుండగా.... మరి కొందరు రూకలు మారకం చేయుచుండగా వారి బల్లలను ఫడద్రోసి అల్లకల్లోలంచేసి కొరడాతో విచక్షణా రహితంగా చితకబాదాడు. మొదటగా ఈ దయామయుడు కాస్త సామరస్యంగా చెప్పియుంటే ఎంతబాగుండేది? కాని అలా చేయలేదు. అంతేగాక ఆయన స్వయంగా మాట్లాడుతూ... నేను భూమి మీదికి సమాధానము పంపవచ్చితినని తలంచకండి! ఖడ్గమునే గాని సమాధానమును పంపుటకు నేను రాలేదు. ఒక మనుష్యునికిని వాని తండ్రికిని, కుమార్తెకును, ఆమె తల్లికిని, కోడలికిని అమె అత్తకును విరోధము పెట్ట వచ్చితిని. తల్లినైనను, తండ్రినైనను నాకంటే ఎక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడుకాడని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పిన యేసు ప్రేమా సముద్రుడా! చీటికి మాటికి శాస్త్రులను, పరిసయ్యులను సున్నంకొట్టిన సమాధుల్లారా! సర్పసంతానమా యంటూ చిరాకు పడేవాడు నిజంగా కరుణామయుడంటారా? కరుణామయునినోట ఇట్టి పనికిమాలిన మాటలు అవసరమా!*

యెహెూవా చిత్రం: యూద క్రైస్తవ మతాలందు ఎక్కడా యెహెూవాకు సంబంధించిన ఊహాచిత్రాలు సాధారణంగా కనమడవు. అయితే యెహెూవాను అనేకమంది ప్రవక్తలు చూచి నట్లుగాను ఆయనతో ముఖాముఖి సంభాషించినట్టు గాను చాలామంది ప్రవక్తలు రాజులు చెబుతూవచ్చారు. ఎందు చేతనో వారు ఆయన చిత్రాన్ని గాని కనీసం శిల్పాన్ని గాని రూపొందించ లేకపోయారు. ఆకారణంగా యెహెూవా చిత్రం ఎక్కడా లభ్యంకాలేదు.



చాలాకాలంగా నేను అన్వేషిస్తూ యుండగా యెహెూవాకు సంబంధించి ఒకటి రెండు చిత్రాలు లభ్యమైయ్యాయి. అందు "యెహెూవా సాక్షులు" అనే క్రైస్తవ మతశాఖకు సంబంధించిన తమిళనాడుకు చెందిన "మైకిల్" అనే మిత్రుడు "DRAW CLOSE TO JEHOVA" అనే ఒక పుస్తకాన్ని నాకివ్వగా అందు దాని కవర్‌పేజీలో (కీర్తనలు 1:23) లోని... యెహెూవా నాకాపరి నాకులేమి కలుదు అనే గొర్రెల కాపరి చిత్రం చూడడం జరిగింది. దీన్ని యెహెూవాకు సూచనగా చిత్రించారు.



ఇది ఇలాగుండగా హైద్రాబాద్‌కు చెందిన ఒక క్రైస్తవ గ్రంథకర్త శ్రీ అద్దంకి రంజిత్ ఓపిర్ అనే మహారచయిత రచించిన "దేవుని గండ్రగొడ్డలి" అనే టైటిల్ గల పుస్తకము నేను చూడడముతోనే హడలెత్తించే విధంగా యెహెూవా చిత్రాన్ని మల్టీ - కలర్‌లో ముఖచిత్రంగా చక్కగా ప్రచురించారు. అయితే యెహెూవా అనేకమంది ప్రవక్తలకు దర్శనమిస్తూ మరి ముఖ్యంగా "హనోకు" అనే వ్యక్తితో యెహెూవా మూడువందల ఏళ్లపాటు "వాకింగ్" చేసినట్టు అనంతరం ఆయనను బొందెతో పాటు తనకూడా తీసికొని పోయినట్లు బైబిల్ చెబుతుంది. అలాగే అప్పుడప్పుడు "నోవహు"తో కూడ శికార్లు చేసేవాడట. ఈ విధంగా యెహెూవా అనేకమంది ప్రవక్తతో ముఖాముఖి స్నేహితునితో మాట్లాడినట్టు మాట్లాడేవాడట. అయినా వీరెవరు యెహెూవా రూపాన్ని శిల్పంగానైనా మలిపించలేక పోయారు. క్రైస్తవ యూద మతాలు విగ్రహారాధనను వ్యతిరేకించినందుకు కావచ్చు యెహెూవా చిత్రాలు లభ్యంకాలేదు.

అయితే క్రైస్తవ మత సిద్ధాంత కర్తగా, సంస్కర్తగా గత 30 సం॥ అనుభవం గల ఓపిర్ గారి గండ్రగొడ్డలి చిత్రాన్ని చూచి నా "ఇది నిజమా" రచనా పరంపరల్లో సందర్భాను సారంగా వారంత తేటతెల్లంగా కాకున్నా ఏదో ఒక మానవాకృతిలో యెహెూవా చర్యలను విశదీకరించే సందర్భాల్లో కొన్ని చిత్రాలు గీయబడ్డాయి. అవైనా అట్టి హావభావాలను తెలియజేసే విధంగా వుంటాయే "తప్ప గండ్రగొడ్డలి" అంత విస్పష్టంగా యుండవు గాని నరుల పోలికలో దేవుడుంటాడనే చిన్న "క్లూ" ఆధారంగా అక్కడక్కడా కొన్ని చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. ఇవన్నీ యెహెూవా చిత్రాలుగా భావించనవసరము లేదని పాఠకులు గమనించగలరు. ఈ చిత్రాన్ని ఈ రచనలో పొందుపరచినందుకు శ్రీ రజిత్ ఓపిర్ గార్కి ధన్యవాదాలు.

**- రచయిత**





# గమనిక

ఈ "ఇది నిజమా" ప్రథమభాగము విడుదలకు ముందుగా "ఇది నిజమా" రచనా పరంపరల తీరు తెన్నులు ఎలాగుంటాయి? మున్నగు అంశాలను నా ఈ భావజాలాన్ని సమర్థించే... అభిమానించే అభ్యుదయ భావాలుగల మాకార్యకర్తల దృష్టికి తీసికొని వెళ్లుటకు గాను రాగల రచనలలోని కొన్ని శీర్షికలను నమూనాగా క్లుప్తమైన రీతిలో 72 పేజీల చిరుపుస్తకాన్ని మొదట ప్రచురించడం జరిగింది. అవయినా క్లుప్తంగా వివరించబడ్డాయి. మిగతా నాలుగు భాగాలు ఒక దాని తరువాత ఒకటి సీరియల్‌గా విడుదల కానున్నాయి. ఈ ప్రథమభాగము విస్తృతమైన రీతిలో రాష్ట్రమంతటా విడుదలకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

గతంలో విడుదలయైన "పైలెట్ ఎడిషన్" చదివిన వారెవరైనా యుంటే అందులో ప్రచురించబడిన కొన్ని శీర్షికలు, అక్కడక్కడ మరిన్ని వివరాలతో తిరిగి ప్రచురించబడతాయి. గాన అసౌకర్యానికి గురికావద్దని మనవి.

- రచయిత

# ఇది నిజమా? "టైటిల్" పుట్టు పూర్వోత్తరాలు



దైవం పేరున మనకు చెప్పబడిన ఎంతటి అసంభవ విషయమైనా సరే మనము నమ్మేస్తున్నామంటే దీనికి ముఖ్యకారణం మనకు "ఇంగితం" కొరవడడమే గాక, ఆలోచనా శక్తి నశిచడం మరో కారణం. ఎందుకు? ఏమిటి? ఎలా? ఎప్పుడు? ఎక్కడ? వంటి జ్ఞానాన్వేషణతో కూడిన నిజనిర్ధారణకు అవసరమైన ముఖ్య ప్రశ్నలు మతవాదుల నిఘంటువులో ఎక్కడా కనబడవు. దీనికి కారణం "దేవుడు" అనే మూడక్షరాల పేరు వినేసరికి మనస్సు మందగించిపోతాది.

ఆదియందు దేవుడు భూమ్యాకాశాలను, చెట్టు చేమలను, సూర్యచంద్ర నక్షత్రాదులను చేశాడని, అనంతరం నాల్గవది నాన జలచరాలను, ఆకాశపక్షులను సృజించే బాధ్యతను సముద్ర జలాలకు అప్పగించగా అది మహామత్స్యాలను, తాబేళ్ళు, మొసళ్లు మొదలగు జలచరాలతో పాటు ఆ జలాలు రెక్కలు గల ఎగిరే పక్షులను కూడ పుట్టించి ఆకాశానికి ఎగరేసిందట సముద్రం. అనంతరం సమస్త జంతుజాలాన్ని పశువులను, నేలను ప్రాకు పురుగులను సృష్టించే బాధ్యత భూమికి అప్పగించగా భూమి ఆ ప్రకారం గానే సర్వజంతు జాలాన్ని, నేలను ప్రాకే పురుగులను, (పాములను) చేసేసిందట. (అయితే అట్టి దేవుని ఆదేశాలను సముద్రము భూమి ఎలా విన్నాయో ఎవరికి తెలియదు.)



అనంతరము "ఆది మానవ" జంటను రూపొందించే పనిని మాత్రము యెహొవా - దేనికీ అప్పగించకుండా తన స్వహస్తాలతో తన స్వరూపమందు మంటితో అదామును చేసిన దేవుడు అతని నాసికా రంధ్రములలో తన జీవపు ఊపిరిని ఊదగా అదాము బ్రతికి ప్రథమ





మానవుడుగా భూమిమీద అడుగుపెట్టాడు. అనంతరం ఆ పురుషుని ప్రక్కటెముకతో స్త్రీని రూపొందించి వారిరువురిని ఏ దేను తోటలో వుంచి తోట మధ్యనున్న మేళ్లూ - కీళ్లు (మంచి చెడ్డలను) తెలిపే వృక్షఫలాలను తప్ప మిగిలిన సమస్తఫలాలను తిన వచ్చునని చెబుతూ ఆ నిశిద్ధ ఫలాలను మీరు తింటే చస్తారని యెహొవా చెప్పాడట.

అలనాడు భూమి మీదనున్న సమస్త జీవుల్లో సర్పము ఒక్కటే బహుతెలివైనదిగా, యుక్తి గలదిగావుందట. ఒకనాడు ఆ సర్పము ఏ దేను తోటలో స్త్రీ యొద్దకు వచ్చి "ఇది నిజమా?" అని యుక్తిగా ప్రశ్నించి, దేవుడు చెప్పింది అబద్ధమని, ఆ ఫలాలు మీరు తిన్నదినాన దేవతల వంటి వారౌతారని, మీరు ఎంత మాత్రము చావరని చెప్పి నాటి ఆది దంపతులతో ఆ నిషిద్ధ ఫలాలు తినిపించి యెహొవా సంకల్పాన్ని తారుమారు చేసిందట. ఈ సమయంలోనే ఆపాము యుక్తిగా పలికిన "ఇది నిజమా?" అనే మాటనే ఈ రచనా పరంపరల యందలి భాగాలకు "టైటిల్"గా పెట్టబడింది.



ఈ "సృష్టి" కార్యంలో భూమి సమస్త జంతుజాలాన్ని చేయగా, సముద్రం - సర్వజలచరాలతో పాటు ఆకాశపక్షులను పుట్టించినట్టును, యెహొవా స్వయంగా మానవులను రూపిందించినట్టు చెప్పబడింది. ఇక్కడ ముఖ్యమైన చర్చఏమనగా భూమిమీద సకల జీవ జాతుల్లోను భూమి సృష్టించిన సర్పము మహా తెలివైనది గాను యుక్తి గలదిగాను వుండగా యెహొవా యంతటి వాడు రూపొందించిన, అదీ తన రూపమందు చేసి, తన జీవపు ఊపిరితో బ్రతికించిన మానవుడు మాత్రం వట్టి తెలివి తక్కువ దద్దమ్మలా, ఇది మంచియని గాని అది చెడ్డయని గాని తెలియని పామరుడుగా వుండడము వింతగావుంది. దేవుడైన యెహొవా ఆకారంలో ఆయన "అంశ" నుండి చేయబడిన నరుడు అంతటి హీన స్థితిలో వుండుటకు కారణమేమిటి? రాళ్లురప్పలతో నిండియున్న మట్టిముద్దయైన భూమి చేసిన సర్పము అంత తెలివైనదిగా వుండడమేమిటి? ఈ సంగతులలాగుంచి దేవుడు సృష్టించి తన పోలిక ప్రకారం... గుండె, మెదడు, ఊపిరి తిత్తులు, ఎముకలు, ముక్కు నోరు, పలువరసలు, నాలుక చెవులు కళ్లు, మూత్ర పిండాలు, కాలేయము, లివర్, ప్రేవులు, రక్తనాళాలు, సంతానోత్పత్తి అవయవాలు, రక్తమాంసాలతో సహా ఈ కథానుసారంగా తనవలెనే నరుని రూపొందించాడను కుందాము. అయితే కళ్లుగాని,

చెవులుగాని చివరకు ఏ విధమైన జ్ఞానంగాని లేని భూమండలము, సముద్ర క్షారజలాలు సృష్టించాయని చెప్పబడుచున్న సమస్త జీవరాసులకు జీవిమనుగడకు అవసరమైన ఒకటే "థియరీ" ప్రకారం మనము ఇక్కడ చెప్పుకున్న సకల అవయవాలు అచ్చం యెహెూవాకు వున్నట్టుగానే ఎందుకున్నాయి? ఇవన్నీ ప్రాణులు భూమిమీద జీవించుటకు అవసరమని, ప్రాణ వాయువు, నీరు, ఆహారము లేకుండ ఇట్టి జీవరాశి జీవించజాలదని భూమికి, సముద్రానికి ఎలా తెలుసునంటారు? నిజం చెప్పాలంటే మానవాళితో పాటు ప్రాణి కోటిలోని వివిధ జంతువుల శరీర నిర్మాణంలో కొద్దిపాటి తేడాలను బట్టి మనము చూస్తే దేవుని పోలికలో చేయబడ్డాడని చెప్పిన మనిషికి మరీ గొప్ప ప్రత్యేకత ఏదీ లేదని చెప్పకతప్పదు.




మానవ అవయవ నిర్మాణము జంతువుల అవయవ నిర్మాణాలను గూర్చి ఇక్కడ మనము ప్రత్యక్షంగా చూచాము. సర్పానికి ప్రత్యేకంగా విశిష్టమైన మెదడు ఏమీ లేకపోగా చిన్న మెదడేవుంది. కథానుసారంగా సర్పాన్ని తెలివైన దాన్నిగా చూపారు తప్పదానికి ఏ విధమైన ప్రత్యేకతలు లేవు. ఇంతటి లోతులకు పోయి ఆలోచించే అవకాశము నాటి రచయితలకు లేకపోవచ్చు. కథలు వ్రాయగానే సరిపోదు. నిజనిర్ధారణ కొరకు ప్రతి విషయానికి కార్యకారణ సంబంధాలు శాస్త్రీయ దృక్పధం ఎంతో ముఖ్యము. మత వాదులంతా కళ్ళుమూసుకొని నమ్మే వారేకాని ఏమిటి? ఎందుకు? ఎలా? అని ప్రశ్నించరని వీరి ధీమా. అయినప్పటికి నాటి వీరోచిత మహోన్నత శాస్త్రవేత్తలు ధైర్యంగా ముందుకు వచ్చి ఈ మతాన్ని చీల్చిచెండాడారు. అయితే నాటి మతచాందసం - రాజ్యాధికారం కుమ్మక్కై అట్టి వారి మీద దైవద్రోహ నేరమారోపించి, సజీవ దహనాలు, కారాగార శిక్షలు అమలుచేసి సైన్స్ నోరునొక్క ప్రయత్నించింది. ఇవన్నీ తెలిసినప్పటికి నేటి విద్యావంతులు శాస్త్ర పరిజ్ఞానం గలవారు సైతం "నలుగురితో పాటు నారాయణ.... కులంతో పాటు గోవిందా" అన్న సామెతలా మతం ముందు మోకరిల్లి ముక్కునేలకు రాసుకుంటున్నారు. ఇట్టి కారణాల వల్ల మతాలకు ఎదురులేకుండా పోయింది.





ఇక రెండవదిగా మనము సర్పము యొక్క శక్తియుక్తులను పరికించి చూద్దాము. బైబిల్ నందు దానికున్న తెలివితేటలను ఆకాశనికెత్తి చూపించారు. ఇది నిజమేనంటారా? నిజానికి సర్పం అత్యంత పిరికిజీవి మనుష్యులను చూచిన పాములకు తప్పించుకొనిపోయే తెలివి తప్ప మరేమీలేదు. దానికి అసలు వినికిడి శక్తి లేనేలేదు. నేలమీద ప్రాకేపాముకు ఆయా శబ్దాలు భూప్రకంపనల ఆధారంగా వాటి చర్మాన్నుండి గ్రహిస్తాయి తప్ప వాటికి అసలు చెవులేలేవు. "పాము చెవుల వంటివని" చాలామంది అవగాహనా రహితంగా అంటూయుంటారు. అది సర్వాబద్ధం. అలాగే "పంచతంత్రం" కథలో తప్ప పాములు మాట్లాడే ప్రసక్తే లేదు. బైబిల్ చెప్పిన మాటలు నిజమే అయితే అట్టి సర్పాలు ఇప్పుడెందుకులేవు? నిజంగా నేడు మాట్లాడే పాములుంటే ఒకరిమీద ఒకరికి పితూరీలు చెప్పి ఎంతమంది కొంపలు ముంచేవో సుమా! నాటి సర్పం యూద భాషలో మాట్లాడిందా? లేక.... సంస్కృతంలోనా? లేక గ్రీకు, అరబ్బీ, హిందీ, మళయాళం, తమిళం వంటి తదితర భాషల్లో మాట్లాడిందంటారా? ఈ సంగతి మీకు తెలుసోలేదో అప్పుడప్పుడే తాజాగా భూమిమీద అడుగుపెట్టారని చెప్పే దిగంబర ఆది దంపతులకు అసలుభాషలు మాటాడే అవకాశము లేదు. కనీసం మంచిచెడ్డలైనా తెలియని వీరు మూగసైగలు చేసి కోవలసిందే! ఇదంతా చక్కని కల్పిత గాథగా మలచి పాముచే ఇది నిజమా? యని పలికిందని చెప్పే మాటలే సర్వాబద్ధం!!!

ఇక మూడవది ఆఖరిదైన యెహెూవా దేవుని పుట్టు పూర్వోత్తరాలు నరమానవులకెవ్వరికి తెలియవు. నాటి ప్రవక్తలకు అసలే తెలియదు. బైబిల్ మూలగ్రంథమైన (యూద మతగ్రంథం) "తౌహరా" రచయితలకే తెలియక వారు "ఆది" యందు దేవుడు భూమ్యాకాశాలను సృజించాడని ప్రారంభించారు. దైవా విర్భావం ఎలా జరిగిందో ఎవరికి తెలియదు. అయితే హిందూ మతంలో ముక్కోటి దేవతలున్నారని చెబుతారు. అందు కొంతమంది దేవుళ్ల జన్మ వృత్తాంతాలను గూర్చి పురాణ కథల్లో చక్కగా వ్రాసుకున్నారు. కాని బైబిల్ దేవుని పుట్టు పూర్వోత్తరాలు "ఏ ఆకాశరామన్న" కూ తెలియదు. నాటి శాస్త్రులు పరిసయ్యులు యేసయ్యను ఊపిరి సలపని విధంగా ప్రశ్నాపరంపరలతో వేదిస్తూ యుండేవారట! నిజంగా వాళ్లకు కాస్త బుర్రలు పనిచేసి యుంటే యేసయ్యతో అయ్యా! మీరు పరలోకపు తండ్రి ఏకైక కుమారుడనని చెబుతున్నారు.... అయితే మీ "పరలోకపు మమ్మీ" ఎవరని అడిగితే ఎంతబాగుండేది! కాని ఎవరూ అడగలేదు.

ఇంతటి అగమ్య గోచరమైన స్థితిలో ఈ "సర్పరాజం" తెలివి తక్కువ జీవియై వుండి కప్పలను, ఎలుకలను మ్రింగుతూ కాలం గడపక ఆది దంపతులను యెహెూవా

దేవుడు తినవద్దని ఆదేశించిన మంచిచెడ్డలను తెలిపే వృక్షఫలాల సంగతి, అవి తిన్నవెంటనే మీ కనులు తెరవబడతాయని... అమ్మతోడు మీరు చావనే చావరని, పైగా మీరు దేవుళ్లవంటి వారౌతారని యెహోవా సంకల్పాన్ని ఆయన సృష్టికార్యాన్ని బోల్తాకొట్టిస్తే ఈ సర్పానికి ఒరిగేదేమిటి? ఈ అగత్యం దాని కెందుకొచ్చింది? మాటలు రాని చెవిటి పాము యెహోవా మనసులోని మాటలు ఎలా గ్రహించింది? ఒకవేళ "ఏదేను" తోటలో ఆదాముతో మాట్లాడే సందర్భంలో దేవుని మాటలు దీనికి వినబడి చావవుగదా! చాలామంది బైబిల్ మేధావులు ఈ విషయాన్ని గూర్చి ముచ్చటిస్తూ "సర్పము, ఘటసర్పము" అనగా అపవాదికి సంకేతమని అందుచే యెహోవా ధ్యేయాన్ని తలక్రిందులు గావించుటకు ఈ సాతాను సర్పంలో దూరి ఇదంతా చేసియుండవచ్చునని కోడి గ్రుడ్డుకు ఈకలు పీకే ప్రయత్నం చేస్తూయుంటారు. గాని బైబిల్‌లో దీనిని సమర్థించే వాక్యము ఎక్కడాకనబడదు. సర్పము ఘటసర్పము వంటి పర్యాయపదాలు పై విషయాన్ని రుజువు చేయలేవు.

ఈ విధంగా మనము ప్రతి విషయాన్ని కూలంకుశంగా పరిశీలిస్తూ నిజానిజాలు వెలికి తీయ ప్రయత్నిస్తే ఇట్టి అనేక నగ్నసత్యాలు బయటపడతాయి. సృష్టికథకు ఏదో ఒక రూపం తేవడానికి నాటి రచయితలు ఇటువంటి సర్పపాత్రలను, దయ్యాలు భూతాల ప్రసక్తులను ప్రవేశపెట్టి, సర్పముచే "ఇది నిజమా" అనే మాటల గారడీతో ఆది మానవులను ఆజ్ఞాతిక్రమణ చేయించి వారిని పాపాత్ములుగా చిత్రించుటకు బైబిల్ రచయితలు మల్లగుల్లాలుపడి చివరకు "ఇది నిజమా" అనే మాటను పాముతో మాట్లాడించినట్టు కథలు వ్రాసిన ఒక పెద్ద అబద్ధం ద్వారా ఇదొక కల్పనాకథగా రుజువుచేయబడింది. పాము "ఇది నిజమా" యని మాట్లాడడమే. పెద్ద జోక్!





## పేరుకే ముందుమాట! చెప్పేదంతా వెనుకటిమాట!

అన్నిమతాలు వాటి తాలూకు దేవుళ్లు-దేవీ దేవతలు సర్వాబద్ధమని అవన్నీ కాకమ్మకథలని ఏమత గ్రంథాలందు లేనివిధంగా "సృష్టి కార్యం" తమ బైబిల్ గ్రంథమందే తేటతెల్లంగా వివరించబడిందని, తమ దేవుడైన యెహోవాయే సజీవుడైన దేవుడు! యేసే నిజరక్షకుడని క్రైస్తవులు గాఢంగా నమ్ముతూ ఉండడమే గాక ఇతరులను కూడ నమ్మించ ప్రయత్నిస్తూ విస్తృత ప్రచారం చేస్తూయుంటారు.

కనీసం ఎదుటివారేమి చెప్పినా సమ్మతించక వారి మాటలు వినుటకైనా అంగీకరించక బైబిల్ గ్రంథప్రాశస్త్యాన్ని అందలి "రక్షణసువార్తను" ప్రపంచ వ్యాప్తంగా మరేమతము చేయని విధంగా వ్యయ ప్రయాసాల కోర్చి ప్రచారం గావిస్తూ సంవత్సరం పొడవునా దేశం నలుమూలలోను, యావత్ ప్రపంచ వ్యాప్తంగా, మరిముఖ్యంగా స్వస్థతా సభలు జరుపుచూయుంటారు. ఈ స్వస్థతా ప్రార్థనల తతంగంలో పైకి కనిపించని లోలోన ఉన్న జబ్బులు వారికి తాత్కాలికముగా ఉపశమనం కగిగినట్టు అనిపిస్తాయి. ఇట్టి ప్రార్థనలకు ఒకరికి ఉద్యోగము దొరకుతాది.... మరొకరు పరీక్ష ప్యాస్ ఔతారు. మరో అమ్మాయికి పెళ్లౌతాది. అయితే మనము నిశితంగా పరిశీలిస్తే మనకు పైకి కనిపించే తెగిపోయిన చెవిని ప్రార్థనాల ద్వారా... విశ్వాసం ద్వారా తిరిగి అతుక్కుంటుందాయని భక్త జనులను ప్రశ్నిస్తే ఔను అతుక్కుంటుందని తడుము కోకుండా సమాధానము చెబుతారు. అదేలా సాధ్యమని అడిగితే అలనాడు రాణువ వారు యేసును బంధించుటకు రాగా పేతురు ఆవేశముతో ఒక రాణువ వాని చెవిని తెగనరకగా వెనువెంటనే యేసు ఆ చెవిని బాగుచేయలేదా! యని సమాధానమిస్తారు.

నేడు మనకు అటువంటి సాక్ష్యాధారాలు లేని, రుజువులు చూపలేని కథలు మనకు పనికి రావు. నాడు వార్తాపత్రికలు లేవు. టి.వి.లు అంతకన్నా లేవు. నాటి రచయితలు చెప్పిందేవేదం. నేడు మనం ప్రత్యక్ష సాక్ష్యాలు లేకుండ దేనిని నమ్మము. 8-5-2012 నాడు ఈనాడు ప్రచురించిన ఈ అభాగ్యుడు ఒంటి కాలితో నిలబడి నిరాశనువీడి, ఆత్మస్థైర్యంతో చంక కర్ర ఆధారంతో వ్యవసాయ పనులకు వెళ్తూ ఉపాధిహామీ పథకం క్రింత పనులకు వెళ్తూ కుటుంబాన్ని పోషిస్తున్నాడట. యేసు బోధించిన క్రైస్తవుల మూల సూత్రం "విశ్వాసం" ఎంతటి అసంభవాన్నైనా సరే విశ్వాసంతో సాధించవచ్చునని ప్రభోదించాడు.



నేడు తామరతంపరగా పెరిగిపోయిన టి.వి. ప్రోగ్రాములందు స్వస్థతా ప్రార్థనా తతంగాన్ని "లైవ్" ప్రోగ్రాముల ద్వారా ప్రసారము చేస్తూ, స్వస్థత పొందామని సాక్ష్యాలిప్పిస్తూ విరాళాలు దండుకొనే ఏ ఒక్కరైనా మన మిప్పుడు చూచిన అభాగ్యుని కాలు మొలిపించగలరా? వీరంతా ఏకమై ఆవగింజంత కాదు ఏకంగా తాటి గింజత విశ్వాసంతో ప్రార్థించినా ఇట్టి అద్భుతాన్ని సాధించడం అసంభవం.



మరో అద్భుత కథ ఇక్కడ చూడవచ్చు మీరు దేవుని యందు విశ్వాసముంచండి. ఎవడైనను ఈ కొండను చూచి నీవు ఎత్తబడి సముద్రములో పడవేయ బడుదువు గాకయని చెప్పి తనమనస్సులో సందేహించకుండ, తాను చెప్పినది జరుగునని నమ్మిన ఎడల వాడు చెప్పినది నిశ్చయముగా జరుగునని మీతో చెప్పుచున్నాను. (మార్కు 11:22-23) యేసు చెప్పిన మాటలివి.

ఎవరైనా ఇట్టి అద్భుతాల విషయంలో సంశయిస్తారేమోయని యేసు మరికొన్ని వివరణలిచ్చాడు... అందుచే మీరు ప్రార్థన చేయునపుడు మీరు అడుగుచున్న వాటి నెల్లను పొందియున్నామని నమ్ముడి! అప్పుడవి మీకు కలుగునని మీతో చెప్పుచున్నాననెను. (మార్కు 11:24) ఇక్కడ యేసు చెప్పిన సూక్తి యొక్క భావమేమిటి? అది ఎంతటి అసంభవమైన సంగతైనా సరే అది జరిగిపోయినట్టు "ఫీల్" అవ్వమన్నాడు. ఆవగింజంత విస్వాసముంటే చాలు అది జరిగితీరుతుందన్నాడు. కనీసం యేసు ఈ అద్భుతాన్ని చేసిచూపియుంటే బాగుండేది. (కాని ఆయన చేయలేదు గనుక చేయలేదు) సస్థతా ప్రార్థనా వరప్రసాదులమని చెప్పుకొనే ఏ ఒక్క నరమానవుడు దీనిని చేయసాహసించలేదు. ఇది యేసు చెప్పిన కొండంత అబద్ధం. నేను ఈ పేరాగ్రాఫ్ వ్రాయుచుండగా దీనిని నా (సోదరి-in Law) చదివి బావగారూ! మీరు మరీ శృతిమించిన విమర్శలు చేస్తున్నారు. దీని భావము మీకు తెలియదా? కొండను చూచి సముద్రములో పడవేయబడు గాకయని చెప్పడంలో మీరు బాహ్యార్థ తీసికొంటున్నారు. అది తప్పు, ఇక్కడ కొండ అనగా "కొండంత సమస్య" అయినా సరే తొలగిపోతాదని అర్థమని చిటికెలో చెప్పడం జరిగింది. భక్తజనుల భావావేశాలు, గూఢార్థాలు ఈ విధంగానే వుంటూ బైబిల్‌ను సమర్థిస్తూ వుంటాయి.

ఈ విధంగా క్రైస్తవ సమాజాల్లో అంధ విశ్వాసాలు గాఢంగా పెనవేసుకుపోయాయి. పైన మనము చూచిన నా "సోదరిల్లా" యొక్క కొండంత విశ్వాసం ఎంత "చక్కగా" వుందో మనము చూచాము.





ఇదిలా గుండగా నా భార్యామణి ఇటీవల తీవ్రమైన అనారోగ్యానికి గురియైయ్యింది. చాలాకాలంగా అనేక కార్పోరేట్ ఆసుపత్రుల చుట్టూతిరిగి మరెన్నో డైగ్నోస్టిక్ సెంటర్లలో అనేక విధాలైన టెస్టలతో పాటు యమ్.ఆర్.స్కానింగ్‌లు లెక్కలేనన్ని చేయించినా ఇంతవరకు ఒక దారికి రాలేదు. ఇటీవల అత్యంత అభిమానము, ప్రేమానురాగాలు చూపి ఆదరించే నా మరో సోదరిల్లా ఫోన్‌చేస్తూ అక్కా నీ ఆరోగ్యం జాగ్రత్త! మందులు క్రమంగా వాడుతూయుండు. మన ప్రభువు నిన్ను త్వరలో లేవనెత్తుతాడు. పట్టుదలతో ప్రార్థిస్తూ యుండమని ఆదరణ వాక్యాలు వల్లిస్తూ... అక్కా మొన్ననేను చర్చికి వెళ్లి నీ పేరున 200 రూ॥ ప్రభువువార్కి కానుకగా సమర్పించి పాస్టరు గారితో ప్రార్థన చేయించానని చెప్పేసరికి ఈమెకు వెయ్యేనుగుల బలము వచ్చి లేచి మంచం మీద కూర్చొని మహాదానందంతో అప్పటికప్పుడు వళ్లు నొప్పులు కాస్త తగ్గినట్టు ఫీల్ అయి ముఖము వెలిగి పోయింది. ఈ మరదలీమణి మొన్నమొన్నటి వరకు మెడికల్ లైన్‌లోనే సుదీర్ఘ సేవలందించి రిటైర్ అయ్యారు. ఎవరికైనా సరే వృద్ధాప్యం ఆవరించేసరికి భక్తిపాలు పెరిగిపోవడం సహజమే!

ఈ దేవుడైన యెహోవా పేర బైబిల్ నందు అనేకమైన ఆదరణ కరమైన వాక్యాలు కనబడుతూ వుంటాయి. (నేను) గాఢాంధకారపు లోయలలో సంచరించినను ఏ అపాయమునకు భయపడను. నీవు నాకు తోడైయుందువు. నీదుడ్డు కర్రయు నీదండమును నన్నాదరించును...



ముదిమివచ్చు వరకు నిన్ను ఎత్తుకొను వాడనునేనే! తల వెంట్రుకలు నెరయు వరకు నిన్ను ఎత్తుకొను వాడను నేనే! చంకబెట్టు కొను వాడను నేనే! నిన్ను ఎత్తుకొనుచూ రక్షించుకొను వాడను నేనే!

పై ఒక్క వాక్యములోను నేను నిన్ను ఎత్తుకొను వాడను, చంకనేసుకొనే వాడను నేనేనని నాలుగు పర్యాయాలు చెప్పబడింది. బహుషా బాత్‌రూమ్ సైడుకు యెహోవా అంతగా వెళ్లడనుకుంటాను. అందుకే అనేకమంది క్రైస్తవ వృద్ధులు, రోగగ్రస్తులు బాత్రూమ్‌లో కాళ్లుజారి విరగగొట్టుకొని "స్టీల్‌రాడ్"లు అమర్చుకొని, బాండేజ్‌లు వేసికొని కుంటి బ్రతుకులు వెళ్లదీస్తూ కూడ ప్రభువును పల్లెత్తుమాట అయినా అనరు. దేశదేశాల్లో, యావత్ ప్రపంచ వ్యాప్తంగా నా కాలు విరగకుండా యెహోవా దేవుడు నన్నెత్తుకొని రక్షించాడని ఒక్కడంటే ఒక్క భక్తజనుడైనా చెప్పగలడా?

మరో ముఖ్యవిషయం మనము గమనించగా చాలామంది భక్తజనులు తాము దేవుడికి చందా ఇచ్చామనుకుంటారు సరే బాగానేవుంది. ఆచర్చి గురువు గారు ఒకవేళ్ల

ప్రభువు అడుగుజాడల్లో నడచుకుంటూ యేసు చెప్పినా విధంగా తాను తిరిగి తన రెండవ రాకడలో వచ్చేవరకు తన జ్ఞాపకార్థం "ద్రాక్ష సారాయి" (దానినే బైబిల్‌లో ముద్దుగా ద్రాకారసమంటారు) త్రాగుచూవున్న పక్షంలో అట్టి కానుక 200 రూపాయలు బార్ ఖర్చులకే చాలవు. అటువంటి విషయాలు ఎవరి బుర్రకు తట్టవు.

ఇది చదివిన కొందరు విమర్శకులు "ఇంట గెలిచి రచ్చగెలువు" మన్నచందాన మొదటగా మీరు మీ కుటుంబాన్ని మార్చడానికి ప్రయత్నించండి! అనంతరం మాకు చెప్పవచ్చునంటారేమో! అయితే ఈ శాస్త్రయుక్తమైన ఆలోచనా పరంపరలు ఎవరిపైనా బలవంతంగా రుద్దబడవనే విషయం గ్రహించమనవి.

ఇట్టి అద్భుతాలను ఎవరూ ప్రశ్నించకూడదు. చూచి నమ్మినవారికన్నా చూడక నమ్మినవాడు ధన్యుడనే చిన్న "క్లాజు"ను ప్రభువువారు చెప్పడం జరిగింది. దీని భావం లేనిది ఉన్నట్టుగాను, ఉన్నది లేనట్టుగాను నమ్మమని చెప్పడమే. క్రైస్తవ సోదరులు ఈ కారణం గానే ఎంతటి అసంభవ విషయాన్నైనా సరే అవలీలగా నమ్మిపారేస్తూవుంటారు. క్రైస్తవంలో కొనసాగుటకు ఇది మొదటిమెట్టు.

యేసు రెండవరాకడకు గుర్తుగా అంత్య దినాలందు అనేక సూచనలు జరుగుతాయని వాటి ద్వారా విశ్వాసులు యేసు రెండవ రాకడను గుర్తించవచ్చునని బైబిల్ చెబుతుంది.

అనేకులు నా పేరిట వచ్చి నేనేక్రీస్తునని చెప్పిపలువురిని మోసపుచ్చెదరు. మరియు మీరు యుద్ధములను గూర్చియు, యుద్ధ సమాచారములను గూర్చియు వినబోదురు. మీరు కలవరపడకుండ చూచుకోనుడి. ....జనముల మీదికి జనములను, రాజ్యము మీదికి రాజ్యమును లేచును. అక్కడక్కడ కరువులును, భూకంపములను కలుగును... అనేకులైన అబద్ధ ప్రవక్తలు వచ్చి పలువురిని మోసపుచ్చెదరు. అక్రమము విస్తరించుట చేత ప్రేమచల్లారును. (మత్తయి 24:5-13)

అయితే ఇటీవలి కాలంలో జరుగుచున్న సంఘటనలు యేసు చెప్పిన విధంగానే కనబడుచున్నాయని భావిస్తూ నేడు ఎక్కడ చూచినా అశాంతి, అలజడి, "బందులు", బాంబుపేలుళ్లు, అనేక చోట్ల అశాంతి, తీవ్రవాదుల విజృంభణ, కరువులు, భూకంపాలు, సునామీలు, భయంకర తుఫానులు మరెన్నో వైపరీత్యాలు జరుగుచున్నాయని. కాశ్మీరులో వేర్పాటువాదం, అఫ్గనిస్తాన్‌లో అల్లకల్లోలం, తాలిబాన్ల అరాచకం, నేపాల్, ఒరిస్సా, చత్తీస్‌ఘడ్, పశ్చిమ బెంగల్ మావో ఇస్టుల విజృంభణ, మొన్న మొన్నటి వరకు ఎల్.టి.టి.ఇ (తమిళ పులుల) అలజడి, మహారాష్ట్రలో వెర్రితలలు వేస్తున్న భాషా దురభిమానం, ఆస్ట్రేలియాలో కత్తిపోట్ల సంఘటనలు, పాకిస్తాన్‌లో మానవబాంబులు అలజడి, అమెరికా నట్టనడుమ ట్రేడ్‌సెంటర్ పై టెర్రరిజం వగయరాలు చూస్తూయుంటే ఇవేనేమో యేసు చెప్పిన "జనాల మీదికి జనాలు" లేచుట అని తలస్తూ, ఇవన్నీ యేసు రెండవరాకడకు





తిరుగులేని సాక్ష్యాలని యేసు రాకడ నేడో రేపోయంటూ టి.వి.ప్రసంగికులు, తదితర బోధకులు నానాహంగామా చేయడం కనబడుతూ వుంది.

ఇట్టి బోధనలు వింటున్న అమాయక క్రైస్తవ సోదరులు ఈవేళ్లో రేపో క్రీస్తు రావడం తటస్థిస్తే తాము పరలోక రాజ్యం చేరుటకు సిద్ధంగా లేమేమో! యని తల్లడిల్లి పోతూ, తామెక్కడ నరకంలో పడిపోతామోనని గుండెలవిసిపోతూ జీవచ్చవాల్లా జీవిస్తూ భీతిలో అనారోగ్యాల పాలౌతూ వుంటారు. ఇట్టి ప్రసంగాలు నేను నా పన్నెండేళ్ల ప్రాయంనుండి వింటూనేయున్నాను. యుగాంతం గూర్చిపైన వివరించబడిన "గురుతులు" భూమి మీద మానవ సంచారం ఏర్పడిన నాటి నుండి కరువులు భూకంపాలు వస్తూనే వున్నాయి. జనాల మీదికి జనాలు, తెగలమీదికి తెగలులేస్తూ ఆధిపత్యపోరులు జరుగుతునే వున్నాయి. ప్రకృతి సహజంగా భూకంపాలు భూమిమీద మానవా విర్భావం కన్నా ముందు నుండే సంభవిస్తూనే వున్నాయి. ఇట్టి ప్రసంగాలు చేస్తూ హాయిగా జీవిస్తూ కాలగర్భంలో కలసిపోతూ యుంటారు. తిరిగి క్రొత్త ప్రసంగికులు, సరిక్రొత్త ప్రేక్షకులు పుట్టుకొస్తూనే వుంటారు. ఇలా లక్షలాది సంవత్సరాలు దొర్లిపోయినా ఏ ఒక్క క్రైస్తవ విశ్వాసి ఇన్నివేల సంవత్సరాలు గడిచిపోతున్నా క్రీస్తు రెండవరాకడ మరింకెప్పుడు వస్తాదని ప్రశ్నించనే ప్రశ్నించరు. ప్రజలను భయాభ్రాంతులకు గురిచేసి ఆయా ప్రసంగికులు దంచుకొంటూనే యుంటారు.

ఇట్టి భయాందోళనలు కేవలము పెద్దలకే కాదు ముక్కు పచ్చలారని పసిపిల్లలకు కూడ సండేస్కూళ్ల ద్వారా ఈమతం మత్తుఎక్కిస్తూ వారినికూడ భయాందోళనలకు గురిచేస్తారు.

ఒక సండే స్కూలు టీచర్ పిల్లలకు అద్భుత కథలు, యేసు సిలువమరణం, పునరుద్ధానం గూర్చి బోధించి మీరు చిన్నపిల్లలైనప్పటికి యేసయ్యను నమ్ముకోకుంటే మీరుకూడ నరకంలో పడికాలిపోతారు అని చెప్పి క్లాసుముగిస్తూ... "మేఘం మీద యేసూ స్వామి మళ్లీవస్తాడు." - మేఘం మీద యేసూ స్వామీ మళ్లీ వస్తాడూ'' అనే గీతం వారితో పాడించి క్లాసుముగించనుండగా, ఒక బాలుడు లేచి మీరు మరీ అబద్ధాలు చెప్పి మమ్మును భయపెట్టేస్తున్నారు టీచర్!



ఒకసారి మా కుటుంబంతో మేము విమాన ప్రయాణం చేశాము. ఆ విమానం మేఘాలను దూసుకొంటూ వెళ్తుండగా డాడీ!... మన విమానం మేఘాలకు గుద్దుకొంటూ వెళ్తుంది కదా! అయినా మన విమానం పడిపోవడం లేదెందుకని అడగగా... భయపడకు బాబూ! ఆ మేఘాలు కేవలం నీటి ఆవిరితో కూడిన పొగమంచులాంటి వేనని చెప్పారు. మరి యేసయ్య ఆ మేఘాపై ఎక్కితే దభీలుమని క్రిందపడి చచ్చిపోతాడుగా! ఇటువంటి ఉత్తుత్తి కథలు చెప్పి మమ్మును భయపెట్ట కండనగా... టీచరమ్మ బిత్తరపోయి అవాక్కై పోయింది.

## II

మనం మనపిల్లల ప్రశ్నలకు జవాబులు చెప్పడమే కాదు! ఆ జవాబులను కూడ ప్రశ్నించే అవకాశముకూడ మనము కల్పించాలి. అసలీ మతం తానుచెప్పిందే వేదమని - దానిని నమ్మితీరవలసిందేనని - స్వతంత్రాలోచనలకు తావీయదు. ఏమిటి? ఎందుకు? అనే ప్రశ్నలు బైబిల్ ముందు పనికిరావు. చెప్పింది వినడం - విన్నది విశ్వసించడం మాత్రమే క్రైస్తవ మతం యొక్క మూలసూత్రం.

నేటి నవనాగరిక సమాజం సాధించిన ప్రగతి ఎక్కడో ఆకాశాన్నుండి ఊడిపడలేదు. ఈ సకలాభివృద్ధి కేవలం మనంపైన చెప్పుకొన్న రెండంటే రెండు ప్రశ్నలనుండే ఆవిర్భావం చెందింది. సర్‌జేమ్స్‌వాట్ "WHAT" అన్నందుకే అలనాడు ఆవిరియంత్రం అవతరించింది. సర్‌థామస్ అల్వాఎడిసన్ "WHY" అన్నందుకే గ్రామఫోను పాటలు పాడింది. నేను లోకానికి వెలుగైయున్నానని యేసు చెప్పినంత మాత్రాన అంధకారం పోలేదు. సర్‌థామస్ అల్వాఎడిసన్ నిర్విరామ పరిశోధనల వల్లనే నేటి ప్రపంచం, కళు జిగేలుమనిపిస్తూ ప్రజ్వరిల్లిపోతుంది. ఇట్టి ప్రశ్నాపరంపరల నుండే టెలిఫోన్ల నుండి-సెల్‌ఫోన్ల వరకు... రేడియోల నుండి-టెలివిజన్ల వరకు, కంప్యూటర్‌ల నుండి "రోబో"లు... విమానాలు... అంతరిక్ష నౌకలు మొదలైనవన్నీ ఆవిష్కరిస్తూ మానవ మస్తిష్కం నిర్విరామంగా మరింత ముందుకు సాగిపోతూనే యుంది... దీనికి ముగింపులేదు...

సమస్త మతాలకు చెందిన మేధావి వర్గాలను కదలించి చూస్తే... సకలసైన్సు మా గ్రంథాలందే నిక్షిప్తమయివుంది అని చెబుతూవుండడం పరిపాటి. అయితే మనం పరిశోధించి చూడగా ఏ గ్రంథాలు గాని వాటి తాలూకు దేవుళ్లుగాని, దేవీదేవతలు గాని నేడు మానవుడు అనుభవిస్తున్న సాంకేతిక పరిజ్ఞానం అందించిన దాఖలాలు ఎక్కడా లేవు.

ఇలాంటి ప్రశ్నలు వేసికోనందుకే అలనాటి ఆదిమానవులు మృగప్రాయంగా కొండగుహల్లో క్రొవ్వుదీపాలతో కాలం గడిపారు. దిగంబరంగా సంచరించారు. కందమూలాదులు... ఆకులలములు... జంతు మాంసం తింటూ, వానకు తడుస్తూ... ఎండకు ఎండుతూ... చలికి బిగుసుకుపోతూ దుర్భర జీవనం సాగించారు. కాలక్రమేణా ఒకదాని వెంబడి మరొకటి తెలిసికొంటూ అభివృద్ధి పథంలో ముందుకు సాగారు. ఇట్టి కారణాల వల్ల ప్రశ్నించడం నేరం కాదు. ప్రశ్నలు అభివృద్ధికి సంకేతాలు. ఇట్టి భావనతోనే నా చిన్నతనం నుండి నాలో జీర్ణించుకుపోయిన ఈ బైబిల్ పరిజ్ఞానాన్ని మరింతగా ఆకళింపుచేసి కోవాలనే ప్రయత్నంలో నేను సాగించిన విస్తృత పరిశోధనలో, ప్రేరణతో మరింత పట్టుదలతో బైబిల్ గ్రంథాన్ని నిలువుటంగీలు ధరించి దయారసం... ప్రేమామృతాలు ఒలకబోసే గురువుల వ్యక్తిగత జీవితాలు మరొరకంగా వుండడానికి





కారణ మేమిటని తలంచేవాడిని.

వీటన్నిటి కన్నా ముఖ్యంగా నన్ను మరింతగా ఆలోచింపజేసిన ముఖ్యవిషయం ఏమంటే లోకకళ్యాణమే ధ్యేయంగా సకల మానవ శ్రేయస్సే పరమావధిగా ఎంచవలసిన ప్రేమామయుడు, దయాహృదయుడు, కరుణాకటాక్షాలుగల తండ్రిగా మన్ననలందుకొంటున్న యెహోవాకు కూడ తరతమ భేదాలా! యావత్ ప్రపంచంలో లక్షలాది జాతుల ప్రజలుండగా వారందరిని విస్మరించి. ఒక్క యూదజాతీయుల రక్షణార్థమే యెహోవా తన యేకైక కుమారుడుగా చెప్పబడిన యేసును నరావతార ధారిగా దివినుండి భూమికి పంపడమేమిటి? యేసును యూదజనులు తిరస్కరించినందుకు మాత్రమే ఈ "రక్షణమార్గాన్ని" అన్య జనాంగాలుగా అసహ్యించుకొన్న యూదేతర జాతులందరికి ఇచ్చినట్టు బైబిల్ చెబుతుంది. దీనిని అన్యజాతుల పట్ల యెహోవా అనుగ్రహించిన ప్రేమ అంటారా? లేక ఉక్రోషమంటారా!

ఈ తతంగ మెలా గుందంటే తనముద్దుల తనయునికి కొసరికొసరి గోరుముద్దలు తినిపించే మాతృమూర్తిని విసిగిస్తూ మారాము చేస్తున్న పసివాడిని బెదిరించి దారికి తేవడానికి "ఒరే! బుజ్జిగా!" దీనిని నీవు తినకుంటే ఇదంతా ఆ పిచ్చిదానికి పెట్టేస్తానన్నట్లుంది. ఒకవేళ ఆ తల్లి "ఆనెయ్యాబువ్వ"ను నిజంగా ఆ పిచ్చిదానికి పెట్టినా అది ఆమెపై ప్రేమగా ఎవరూ భావించరు. అది కేవలం తనబిడ్డను దారికి తేవడానికి చేసే ప్రయత్నమే! ఒకవేళ యూదులు నిజంగా యేసు అంగీకరించి యుంటే యెహోవా ఎల్లకాలము వారికే దేవుడైయుండేవాడు. అయితే కొద్దిమంది యూదులు తప్ప మిగతవారందరూ నేటికీ యేసును తిరస్కరిస్తూనే "యూద మతము"లోనే కొనసాగుతూనే వున్నారు. అయినా యెహోవా వారిని పల్లెత్తుమాట అయినా అనలేదు. ఎందుచేతనంటే యేసును పాతనిబంధనలో చెప్పబడిన మెస్సియాగా క్రైస్తవులు అన్వయించారని మెస్సియా అనేవాడు ఇట్టి దిక్కుమాలిన పశువుల పాకలో పుట్టిన దీనజనుడుగా అవతరించడని, "మెస్సియా" బలీయమైన రీతిలో రాజ్యాధికారంతో వచ్చి తమను పరిపాలిస్తాడని నేటికీ ఇశ్రాయేలీయులు మెస్సియా రాకకోసం ఎదురుచూస్తూనే యున్నారు. ఈ కారణం చేతనే యూదులు యేసును శిలువ వేసిచంపారు.

యూదులు యేసు పట్ల ఇంత కౄరంగా ప్రవర్తించి చంపారు. యేసును నిర్ద్వందంగా నిరాకరించారు. అయినప్పటికీ యెహోవాకు వారి మీద "BLOOD IS THICKER THAN WATER" అన్న సామెత ప్రకారంగా యూదుల నెవ్వరిని నరకంలో పడేయనని వారికి దొడ్డిదారిలో విముక్తిని ఎలా ప్రసాదించాడో ఇక్కడ మనము చూడగలము వద్దించే వాడు మన వాడైతే కడబంతిలో వున్నా పరవాలేదనే "నానుడి" ఇక్కడ తేటతెల్లంగా కనబడుతుంది.

యెహోవా పక్షాన అపోస్తలుడైన పౌలు ద్వారా చెప్పబడిన ఈ పలుకులు వినండి! వారు యెహోవా రక్త సంబంధులైనందున యూదులకు అడ్డదారిన కల్పించిన రక్షణ భాగ్య "రిజర్వేషన్ సౌకర్యం" ఎంతటి కుయుక్తిగా చెప్పబడిందో మనము చూడవచ్చును. దీనికి యూదులు చేసిన పాపపుణ్యాలతో నిమిత్తం లేదు.

భక్తిహీనులకు రిజర్వేషన్ : విమోచకుడు సియోనులో నుండి వచ్చి యాకోబులో నుండి భక్తిహీనతనం తొలగించును. నేను వారి పాపములను పరిహరించినపుడు నావలన వారికి కలుగునది ఇదియే!...

**అని వ్రాయబడి నట్లు ఇశ్రయేలు జనులందును రక్షింపబడుదురు.**

***....మీరు గతకాలమందు అవి ధేయులైయుండి, ఇప్పుడు మీ విధేయతను బట్టి కరుణింపబడితిరి. అటువలెనే మీ ఎడల చూపబడిన కరుణను బట్టి, వారును (యూదులు) ఇప్పుడు కరుణపొందు నిమిత్తము ఇప్పుడు వారు అవి ధేయులైయున్నారు. (రోమా 11:27-32)***

యూదులను ఎందుకు రక్షించవలసి వచ్చిందో వివరించుటకు వ్రాయబడిన డొంకతిరుగుడు సంజాయిషీ!ని చూచి క్రైస్తవ భక్తులు తరించగలరు. యెహోవాను గూర్చి దేవుడు ప్రేమయైయున్నాడని వ్రాయబడింది! ఈ ప్రేమామయుని కపట ప్రేమ ఎలాంటిదో చూడండి! కపట ప్రేమ అనేకన్నా "కుయుక్తి" అంటే బాగుంటాది.

***నాశన దినము కొరకు, భక్తిహీనులను కలుగ జేసిన యెహోవా!*** యెహోవా ప్రతివస్తువును దాని దాని పని నిమిత్తము కలుగ జేసెను. (సామెతలు 16:4)

***ఆ చరింప సాధముకాని పనికిమాలిన కట్టడలతో పీడించిన యెహోవా తనగొప్పతనమును చాటుకొనుటకట.***

నేను యెహోవానని వారు తెలిసికొనునట్లు వారిని విస్మయమొందించ వలెనని అనుకూలము కాని విధులను, తాము బ్రతుకుటకు ప్రయోజన కరముకాని కట్టడలను వారికిచ్చితిని (యెహెజ్కేలు 20:25)

సకల ప్రపంచం, విశాలవిశ్వాన్ని, సర్వమానవాళిని సృజించానని చెప్పే యెహోవాను ప్రేమాస్పదుడు గాను, కరుణా సముద్రుడు గాను శ్లాఘించబడుచున్న యెహోవా యంతటి వాడు ఇంతటి సంకుచిత మనస్తత్వంతో హేయమైన రీతిలో తరతమ భేదాలు చూపుతున్న ఈ మహానుభావుడు సకల మానవ జాతులను అన్యజనులుగా





ముద్రవేసి ఒక్క ఇశ్రయేలు జనాంగమైన యూదప్రజలే తన స్వకీయజనాంగమని చెప్పడము చూడగా నిజంగా ఈయనేనా సకల సృష్టికర్తయైన దేవుడేనా? యనే మీమాంసలో పడి ఎలా! ఎందుకు? ఏమిటి! అనే ప్రశ్నల పర్యవసానమే ఈ గ్రంథ రచనా పరంపరలకు శ్రీకారం చుట్టడం జరిగింది.

మనదేశంలో దళితులు అగ్రవర్ణాలుగా చెప్పుచెప్పుకొనే కామందుల పాదాల క్రింద అణగద్రొక్కబడి అడుగడుగునా అవమానాలు, చీత్కారాలు, అసభ్యపదజాలం. అంటరాని తనం, మురికి వాడల్లో ఊరుకు దూరంగా నివసిస్తూ వారి యొద్ద పాలేర్లుగా, వ్యవసాయ కూలీలుగా రోజుకు పదిహేను గంటలు పనిచేస్తూ, ఈ వెట్టిచాకిరీలో, చావుదెబ్బలు తింటూ, చేయనినేరాలకు హింసించబడుచూ దుర్భరదారిద్ర్యం అనుభవించారు. ఇట్టి హింసలు కేవలం మన దేశంలోనే కాదు ఆఫ్రికా దేశీయులు బానిసలుగా అమ్మబడి, నరక యాతనలనుభవించారు. నాటి యూరప్ దేశాల్లో కొన్నిచోట్ల హోటళ్లకు ఈ క్రింది విధంగా బోర్డులు కట్టేవారట. "కుక్కలు నల్లజాతీయులకు ప్రవేశం లేదు." అలనాటి అగ్రవర్ణ దురహంకారం-బెల్చి, కారంచేడు, పదిరికుప్పం లందు దళితులపై సాగించిన రక్తపాతం చాలామందికి గుర్తుండ వచ్చును. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 65 సం॥ గతించిపోతున్నా నేటికీ ఇట్టి ఊచకోత అక్కడక్కడా జరుగుతూనేయుంది.

బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో ఇట్టి దయనీయ స్థితి గతుల నుండి కొంతలోకొంత ఊరట లభిస్తుందని నాడు మూకుమ్మడిగా అనేకులు విదేశీమిషనరీల పంచన చేరి క్రైస్తవమతం స్వీకరించారు. ఏది ఏమయినా ఈ విధంగా మతం స్వీకరించిన వీరు కాలక్రమంలో గౌరవప్రధంగా జీవించే అవకాశాలు లభించినమాట కాదనలేము. ఇట్టి మిషనరీవారు తమ మత వ్యాప్తికొరకు చేసిన కృషిలో ఇట్టి అణగారిన వర్గాలకు వారందించిన సహాయ సహకారాలు అద్వితీయం. పనిలో పనిగా ఇట్టి వారంతా ఆంగ్లేయుల పాలనకు పరోక్షంగా వత్తాసు పలుకుతూ వచ్చారు.

## III

నాటి అవిభక్త మద్రాసు రాష్ట్రం (నేటి ఆంధ్రప్రదేశ్)లో మరిముఖ్యంగా పశ్చిమ గోదావరి జిల్లాలో... "గోదావరి డెల్టా మిషన్" పేర బ్రిటిష్ మిషనరీలు నా స్వగ్రామమైన చెట్టిపేట (నిడదవోలు), తణుకు, భీమవరం, పాలకొల్లు, నరసాపురం తూర్పుగోదావరి జిల్లాలో మరికొన్ని చోట్ల ప్రాథమిక పాఠశాలలు, బోర్డింగ్ స్కూళ్లు, ఆసుపత్రులు, వృత్తి విద్యాశిక్షణలతో ఏ విధంగా చేయూత నిచ్చారో ఇక్కడ మనము చూడగలము.



అనేకమంది విదేశీ మిషనరీలు త్యాగ ధనులై వైద్యాలయాలు, విద్యాలయాలు, బాలికల వసతి గృహాలు, అనాధ శరణాలయాలు, వృద్ధాశ్రమాలు, కుష్ఠురోగుల సేవాశ్రమాలు, ప్రారంభించి ఎనలేని సేవలందించారు.



ఇంతేగాక ధవిళేశ్వరంలో పురుషులకు "వడ్రంగం" వర్క్‌షాప్‌ను ప్రారంభించి అందు అనేకులకు శిక్షణ నిచ్చి కార్పెంటర్‌లుగా తీర్చిదిద్ది ఉపాధి కల్పిచారు.

మరిముఖ్యంగా క్రైస్తవ స్త్రీలకు కుటీర పరిశ్రమగా లేసుఅల్లిక కేంద్రాలు స్థాపించి అనేకమందికి శిక్షణ నిచ్చిదానిని మార్కెట్ చేసే బాధ్యతను కూడ వహించిన మిషనరీలు వీరికి ఉపాధి కల్పించారు.



ఈ లేసుఅల్లికలకు పాలకొల్లు, నరసాపురాలు ప్రసిద్ధి గాంచాయి. ఈ నేపథ్యంలో అనేకులకు ఉచిత విద్యనందించి ఎంతోమందిని ఉపాధ్యాయులుగాను, నర్సులుగాను తీర్చిదిద్ది గౌరవంగా జీవించే అవకాశం కల్పించిన మిషనరీవారి సేవలను మన





స్ఫూర్తిగా అభినందించ వలసిందే! ఇది దళిత క్రైస్తవుల్లో గణనీయమైన మార్పుకు సంకేతమయ్యింది.

> ఇట్టి మిషనరీ సేవలకు సంబంధించిన సమాచారం ఫోటోలు, తదితర విషయాల సేకరణ - గోదావరి డెల్టా మిషన్ క్రైస్తవ సంఘచరిత్ర గొప్ప సాక్షి సమూహం" అనే పుస్తక నుండి సేకరించబడ్డాయి. దీని రచయిత జోబ్ సుదర్శన్ గార్కి, మరి ముఖ్యంగా దీని ప్రకాశకులు జీవన్ జ్యోతి ప్రెస్ అధినేత నర్సాపూర్ గార్కి అభినందనలు తెలుపుచున్నాను.

## IV

సుమారు 200 సంవత్సరాల క్రితం ఈ మతంలో చేరిన వారి స్థితి గతులు ఎంతో దుర్భరంగా యుండేవి. అలనాటి బ్రిటీష్ ప్రభుత్వం నేటి ప్రభుత్వాల వలె సామాన్యప్రజలను ఆదుకొనేది కాదు. దరిద్రులు మరింత దరిద్రులుగాను, ధనవంతులు మరింత ధనికులు గాను బ్రతికిన రోజులవి. ఈ క్రైస్తవ మత సూక్తులు అట్టడుగు వర్గాల ప్రజలకు ఊరట మాత్రమే అందించి, ధనికులకు దౌర్జన్యకారులకు, పెట్టుబడి దారీ వర్గాల కొమ్ముకాయుటకు ఈ మతం ఎంతగానో తోడ్పడింది. ఈ మత వ్యాప్తి బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు "కల్పతరువు"లా పనిచేసింది. అది బాగా గ్రహించిన తెల్లదొరలు ఈ క్రైస్తవమత వ్యాప్తి ద్వారా తమకు అనుకూల సమాజాన్ని తయారు చేసుకొన్నారు. ఇది తిరుగులేని సత్యం. ఈ క్రైస్థవ బోధనలు ఏ విధంగా వుంటాయో కాస్త జాగ్రత్తగా పరిశీలించండి!



ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు... పరలోకరాజ్యం వారిది... దు:ఖపడువారు ధన్యులు! వారు ఓదార్చబడుదురు... సాత్వీకులు ధన్యులు! వారు భూలోకమును స్వతంత్రించుకొందురు. నీతి కొరకు ఆకలిదప్పులు గలవారు ధన్యులు... వారు తృప్తిపరచ

బడుదురు... కనికరము గలవారు ధన్యులు వారు కనికరము పొందుదురు... నీతి నిమిత్తము హింసించ బడువారు ధన్యులు పరలోక రాజ్యము వారిది... నానిమిత్తము జనులు మిమ్మును నిందించి, హింసించి, అన్యాయముగా చెడ్డమాటలెల్ల పలుకునపుడు మీరు ధన్యులు... పరలోక రాజ్యము వారిది... సంతోషించి ఆనందించుడి పరలోక మందు మీఫలమధిక మగును. (మత్తయి 5:3-12)

నేను మీతో చెప్పునది ఏమనగా దుష్టుని ఎదిరింపక నిన్ను కుడి చెంపమీద కొట్టువాని వైపు నీ ఎడమ చెంప కూడ త్రిప్పుము. ఎవడైనా నీ మీద వాజ్యెము వేసి నీ అంగీ తీసికొనిన ఎడల వానికి నీ పై వస్త్రము కూడ ఇచ్చివేయుము. (మత్తయి 5:39-40)



ఏమితిందుమో! ఏమిత్రాగుదుమో అని మీ ప్రాణమును గూర్చియైనను, ఏమి ధరించు కొందుమోయని మీ దేహమును గూర్చియైనను చింతిపకండి. ఆహారము కంటే ప్రాణమును, వస్త్రము కంటే దేహమును గొప్పవి కావా? ఆకాశ పక్షులను చూడండి - అవి విత్తవు - కోయవు - కొట్లలో కూర్చుకొనవు. అయినను మీ పరలోకపు తండ్రి వాటిని పోషించుట లేదా! మీరు వాటికంటే బహుశ్రేష్ఠులు కారా! (మత్తయి 6:27-28)

ఇవండీ బడువర్గాల ప్రజలకు దిక్కుమాలిన దీనజనులకు యేసు ప్రభువు వారి దివ్యమైన ఆదరణవాక్యాలు ఇంత తేటయైన భాషలో వుండగా వీటికి మరే విధమైన "కామెంట్రీ" అక్కరలేదు. ఇట్టి దీన దరిద్రులకు తక్షణమే కావలసింది ఆహారము, నీళ్లు, వస్త్రాలు, అత్యవసర వైద్య సదుపాయం, వసతి మాత్రమే పైన చెప్పబడిన దిక్కుమాలినవి దివ్యవాక్యాలు ఎంతమాత్రము కావు.

ఆయా ప్రాంతాల్లో మతప్రచారం చేయుటకు మిషనరీవారు కొందరు స్త్రీ పురుషులకు బైబిల్ ట్రెయినింగ్ ఇచ్చివారిని సువార్త సేవకులుగా వాడుకునేవారు. ఇందు స్త్రీలను "జనానాలేడీస్" గాను, పురుషులను "కోల్‌పోర్టర్స్" అనగా క్రైస్తవ మతప్రచార కరపత్రాలు పంచేవారుగా వాడుకొంటూ నామమాత్రపు జీత భత్యాలిస్తూ, ఆయా పల్లెప్రాంతాలందు మతప్రచారం చేయించేవారు.

అలనాటి క్రైస్తవులు క్రీస్తుబోధనలను వంట బట్టించుకొని శృతి మించిన సాత్వీకులుగాను, ఈ చెంప మీద కొడితే మరో చెంప త్రిప్పేటంతటి దీనత్వానికి దిగజారి జీవించేవారు. దీనికి ముఖ్యకారణం బైబిల్ బోధనలే! వీరి నిస్సహాయ స్థితికి మరో





కారణం పేదరికం. మనము చూడనున్న తల్లీకొడుకుల యెధార్థ గాథలు కళ్లకు కట్టినట్టు తెలుపగలవు.

అది పంథొమ్మిదో శతాబ్దం. ఆంగ్లేయుల పాలన ఏకఛత్రాధిపత్యంగా సాగిపోతుంది. కొంతమంది ఇంగ్లీషు మిషనరీలలో అధికారదర్పం, మరి కాస్త స్వేత జాత్యాహంకారం ప్రస్ఫుటంగా కనిపించేది. మా స్వగ్రామం పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు సమీపమందలి చెట్టిపేట. ఇది నరసాపురం తరువాత "గోదావరి డెల్టామిషన్" కేంద్రంగా కొనసాగేది. అక్కడే ప్రాథమిక పాఠశాల, బాలికల బోర్డింగ్ వుండేది. వీటికి బౌడన్ కుటుంబం ఆధ్వర్యం వహించేది. ఇక్కడే ఇంగ్లండుకు చెందిన బౌడన్ దొర, శ్రీమతి మేగీ బౌడన్ గార్లు మిషనరీలుగా పై బంగాళాలో వుండేవారు. ఈ బౌడన్ దంపతుల కుమార్తె మిస్ "హెన్రిటా బౌడన్" బాలికల హాస్టల్‌ను నిర్వహిస్తూ వుండేవారు. అది 19వ శతాబ్దారంభం. ఈ ఇ.యస్ బౌడన్ గారి వద్ద సువార్త సేవకురాలుగా బొల్లిపో మంగమ్మ అనే ఒక పేద విధవరాలు పనిచేస్తూవుండేది. ఆమెకు ఇరువురు కుమార్తెలు, ఒక కుమారుడు. ఆమెకు అప్పుడు నెలకు తొమ్మిది రూపాయల జీతంతో ఆముగ్గురు పిల్లలను సాకేది.

బౌడన్‌గారి బంగళా
(చెట్టిపేట)



ఒకసారి ఈమె తన నెలసరి జీతం తీసుకొనుటకు మిషన్ కాంపౌండ్‌కు వెళ్లింది. కాని బౌడన్ దొరగార్ని కలసే అవకాశం దొరకలేదు. నిరాశతో ఇంటికి తిరిగి వెళ్లిపోయింది. ఈ విధంగా మరో వారంరోజులు గడిచిపోయాయి. అనంతరం ధైర్యం తెచ్చుకొని వారిని కలసికొని జీతం అడిగింది. వెనువెంటనే ఆ మహానుభావుడు రెచ్చిపోయి అబద్ధికురాలా! పోయిన వారమేగా నీవురాగా నీకు జీతము ఇచ్చాను గదా! యంటూ ఆడదని కూడా చూడకుండా ఒక ఇంగ్లీషు లెంపకాయ కొట్టాడు. ఇంతటితోనైనా ఆగకుండా ఆమెను ఉద్యోగము నుండి తొలగించాడట. ఇంత జరిగినా ఆదీనురాలు ఏమీ బాధపడకుండా ఇంటి దారి పట్టి అయ్యో! నేనెంతటి అవిధేయురాలిని మనప్రభువు వారు ఈ చెంపమీద కొడితే మరో చెంప త్రిప్పమని చెప్పినమాట నాకు గుర్తురాలేదు. అయ్యో నారెండవ

చెంపకూడ త్రిప్పవలసింది ప్రభువా అంటూ కన్నీటితో రాత్రంతా ఉపవాస ప్రార్థనలో గడిపిందట. ప్రభువా! నీ మాటను వినని అవిధేయురాలినైనప్పటికి నాయందు దయయుంచి నా నిర్దోషత్వాన్ని రుజువు చేయమని పట్టువిడవని ప్రార్థనలో గడిపిందట. మరునాటి ఉదయమే దొరగారి నుండి కబురొచ్చింది. అమెవెళ్లగానే బొడన్ దొరగారు ఎదురొచ్చి అమ్మా పొరపాటైయ్యింది. నా డైరీ చూడగా నీకు జీతము ఇవ్వలేదని తెలిసిందని ఆయన "సారీ" చెప్పారట. అంతనామె అయ్యా అలాఅనకండి! మీవంటి నీతిమంతుల చేయి నావంటి పాపాత్మురాలి మీద పడడం గొప్ప ఆశీర్వాద కరమని అంటూ ఆనందభాషాలు రాల్చిందట. అంతనామె తన జీతము అందుకొని, తిరిగి తన పనిలో తనను నియమించినందుకు సంతోషిస్తూ ఇదంతా దేవుని యొక్క కృపాకార్యముగా భావించి మరింత భక్తి తత్పరతలతో నిండిపోయింది.

చదువులు అంతంతమాత్రంగా సాగే ఆరోజుల్లో ఆతల్లి తన ఏకైక గారాల తనయుడు థర్డ్‌ఫారం కాకినాడలో ప్యాస్ కాగా ఆమె ఆనందానికి అవధులు లేవు. ఆమె తన సంతోషం పట్టలేక కుమారునికి ఒకనిక్కరు, పొడవు చేతుల షర్టు కుట్టించిందట. కొడుకును పిలచి నాయనా నీవు మిషన్ కాంపౌండ్‌కు వెళ్లి మేగీ బౌడన్ దొరసానిని కలసికొని అదేదో అంటారు ఇంగిలీసులో "సలాం" చెప్పివారి ఆశీర్వచనాలు తీసికొని రమ్మని చెప్పింది. ఆమె ఉద్దేశం "గుడ్ మార్నింగ్" చెప్పుమని కావచ్చు. తల్లి మాటప్రకారం ఆ బాలుడు ఉత్సాహంగా క్రొత్త బట్టలుతొడుక్కొని, తన జీవితంలో మెట్టమొదటగా తొడిగిన



పొడవుచేతుల షర్టును చూచుకొని మురిసిపోతూ మిషన్ కాంపౌండ్ చేరాడు. దొరవారి బంగాళా యొద్ద అడుగుపెట్టి కనిపెడుతున్న ఆ బాలునికి ఏదో ఎదురుదెబ్బ తగిలినట్లుంది. వెనువెంటనే ఆ బాలుడు తన షర్టును చేతబట్టుకొని, బోడి ఒంటితో బిత్తరచూపులు చూస్తూ విలుకాని వింటి దెబ్బతిన్న లేడిపిల్లలా పరుగుపరుగున వచ్చి తన తల్లి గుండెలకు హత్తుకొని వెక్కివెక్కి ఏడ్వ సాగాడు. చివరకు విషయం తెలిసికొన్న ఆ మాతృమూర్తి గాబరాపడి పరుగులాంటి నడకతో వెళ్లి ఆ మిషనరీ దొరసాని మేగీ బౌడన్" పాదాలపై బడి తాను





తెలియక చేసిన అపరాధాన్ని మన్నించ వలసిందిగా వేడుకొని వ్యధాభరిత హృదయంతో ఇల్లు చేరిందా పేద విధవరాలు.

ఇంతకూ జరిగిన విషయమేమంటే ఆ బాలుడు భయంభయంగా బంగాళా ముందు తచ్చాడుతూ యుండగా "హై హీల్స్" చప్పుడు చేసికొంటూ మిసెస్ మేగీ బౌడన్ సాక్షాత్కరించగా ఆ అబ్బాయి "గుడ్ మార్నింగ్" చెప్పితాను వచ్చిన సంగతి చెప్పబోయాడు... అయితే ఆ తెల్లదొరసాని రుసరుసలాడుతూ కనీసం "నమస్కారం" కూడ అందుకోకుండా కోపంతో ముఖం కందగడ్డలా ఎర్రగా మారగా - సంగతేమిటో అర్థం కాక ఆ బాలుడు తడబడ్డాడు. దీన జనోద్ధారకురాలైన ఆ మిషనరీ దొరసాని ఒక్కసారిగా శ్వేత జాత్యాహంకారం పెల్లుబికి... ఓ అబ్బాయీ! మీ ఇండియన్స్‌కు గర్వం బాగా బలిసింది. నీ షర్టు తీసి ఇమ్మని ఆదేశించగా ఆ బాలుడు మారుమాట్లాడకుండ తన షర్టు తీసి ఆమె చేతికి అందించగా దానిని తీసికొని సరసరా లోనికి వెళ్లిపోయింది అనంతరం ఏమి జరగనున్నదో! ఒకవేళ బెత్తం తెచ్చికొడతాదేమో అనుకొని భయపడుతూ చేతులు కట్టుకొని యుండగా... సగము చేతులు కత్తిరించి కుట్టితెచ్చిన షర్టు చేతికి అందిస్తూ ఇంగ్లీషువారు మాత్రమే తొడిగే పొడవు చేతుల షర్ట్‌ను "యూడర్టీ ఇండియన్స్" ధరిస్తారా? అంటూ లోలోన గూడుగట్టుకొని యున్న శ్వేత జాత్యాహంకారం వెడలగ్రక్కి అసలు వచ్చిన సంగతేమిటో కూడా తెలిసి కోకుండానే నిష్క్రమించిందట మేడం మేగీ బౌడన్.

ఇంతకూ ఇంతటి దారుణమైన రీతిలో అవమానించబడ్డ ఆ గ్రేట్ ఇండియన్ ఎవరోకాదు తాను పెద్ద వాడయ్యాక చెట్టిపేట జి.డి.యం. ప్రాథమిక పాఠశాల (5వ తరగతి వరకు)కు ప్రధానోపాధ్యాయునిగా పనిచేసి అనేకమందికి క్రమశిక్షణా యుతమైన విద్యాబుద్ధులు గరపి గోదావరి డెల్టా మిషన్ అభ్యున్నతికై పాటుపడిన "సాధూ మాస్టారు"గా పిలవబడిన వీరే మా తండ్రిగారు, మంగమ్మగారు మానాయనమ్మ, ఇంతటి బాధాకరమైన ఇంగ్లండు - చెట్టిపేటల మధ్య జరిగిన విషాథ కథనాలు రేడియోలు గాని టి.వి.లు అంటే, దాని వార్తా ప్రసారాలంటే తెలియని అంధకార "యుగాల్లో" అనగా నూరేళ్ల క్రితమే... గుట్టుచప్పుడు గాకుండ కాలగర్భంలో కలసి పోయాయి. ఈ ఉదంతాలను మా తండ్రిగారు నా పండ్రెండవ ఏట పూసగృచ్చినట్టు చెప్పగా విని హతాషుడనయ్యాను. మా నాన్నగారికి విద్యాభ్యాసం, హైయ్యర్ గ్రేడ్ టీచర్ ట్రెయినింగ్ మొదలగువాటికి ఆ ఎడ్విన్ బౌడన్ దొరగారే తోడ్పడ్డారట. ఆనాటి చదువులు ఎంతపకడ్ బంధీగా యుండేవో గాని తెలుగు మీడియంలో ఎనిమిదవ తరగతి చదివినప్పటికి ఆయన ఇంగ్లీషులో థారాళంగా మాట్లాడేవారు. "బైబిల్ కామెంట్రీ - కాంకార్డియన్స్" మొదలైన విదేశీ

ఇంగ్లీషుపుస్తకాలతో కూడిన చిన్నపాటి లైబ్రరీ వలె మా ఇంటవుండేది. ఆ రోజుల్లో అయిదవ తరగతి చదివిన వారికి కూడ లోయర్ గ్రేడ్ టీచర్ ట్రెయినింగ్, ఎనిమిది చదివిన వారికి హైయ్యర్ గ్రేడ్ టీచర్ ట్రెయినింగ్‌లుండేవి. S.S.L.C. ఉత్తీర్ణులైన వారికి సెంకండరీ గ్రేడ్ టీచర్లుగా నియమించేవారు.

నాన్నగారు రిటైర్ అయ్యాక జనగామ దగ్గర "చేర్యాల" గ్రామంలోని (వరంగల్ జిల్లా) ఇండియా మిషన్ చర్చి పాస్టరుగా పనిచేస్తూ మరణానంతర మధుర జీవితాన్ని గూర్చి తలస్తూ, ఆకలిదప్పులు లేని మరో ప్రపంచం కోసం ఎదురుచూస్తూ-చూస్తూ 1972వ సంవత్సరంలో కాలగర్భంలో కలసిపోయారు. మా తల్లిగారు ఇదే చర్చికి చెందిన డేవిడ్ లివింగ్‌స్టన్ బైబిల్ ట్రెయినింగ్ స్కూల్‌లో టీచరుగా పనిచేశారు. ఇది నాటి ఆదిమ క్రైస్తవుల అగచాట్లకు మచ్చుతునకగా కాలగర్భంలో కలసిపోయిన దయనీయ చరిత్ర.

ఈ విధంగా మిషనరీల ప్రాభల్యం, పెత్నాల ధోరణులు విపరీతంగా సాగే రోజులవి. అయితే నేను బాల్యదశ నుండి క్రమంగా మారుతూ గతంలో జరిగిన అవమానకర సంఘటనలు నాకు తెలిసినప్పటి నుండి ఆయా పరిస్థితుల్లో ఎదురు తిరిగే ధోరణినాలో చోటు చేసికొంది.



అది సుమారు 1952-53 ప్రాంతం.ఆ సమయంలో నర్సాపురమందలి లెప్పర్సీ ఆసుపత్రిలో మా బంధువు కొడమంచిలి విల్సన్‌గారు పనిచేసేవారు. అదే ఆసుపత్రిలో నర్స్‌గా మిస్ హేంప్టన్ పనిచేసేవారు. ఈ విధంగా ఇంగ్లండు మిషనరీలు నడిపే ఆసుపత్రుల ద్వారా క్రైస్తవ మతప్రచారం కొనసాగేది. ఈ హేంప్టన్ గార్కి నర్సాపూర్‌లో పెద్దబంగాళా కేటాయించారు. ఇట్టి బంగాళా ప్రాంగణంలో చిన్నపాటి పౌల్ట్రీలు నడుపుతూ అందు లెగ్‌హారన్ అనే ఇంగ్లీషు జాతి కోళ్లను పెంచుతూవుండేవారు. వీరి యొద్ద కొందరు స్త్రీ పురుషులు సహాయకులుగా వుంటూ ఇట్టి పనులలో సాయపడుతూ వుండేవారు. వారు మిషనరీలతో పాటు సువార్త సేవల్లో పాల్గొనేవారు. ఈ హేంప్టన్ గారు ఇటువంటి విలాసవంతమైన బోటును ఉపయోగించేవారు. ఈ విధంగా కాలువల మీద వీరు పయనిస్తూ ఆయా పల్లె ప్రాంతాల్లో కుష్ఠురోగులను గుర్తించి వారికి మందులు ఇవ్వడం, ముట్టుకొని పరిచర్యలు చేయడం





ప్రశంసనీయం. ఇట్టి సేవల ద్వారా ఆయా పల్లె ప్రాంతాలందు మతప్రచారం విరివిగా సాగేది. అయితే ఈ హేంప్టన్‌గారు కాస్త ఫైర్ బ్రాండ్ అని అంటూవుండేవారు.

ఈమె ఆకుష్ఠురోగుల ఆసుపత్రిలో కేవలము నర్స్‌గా కాకుండ మరోప్రక్క మతప్రచార కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటున్నందున వీరు నర్స్‌కమ్-మిషనరీగా కొనసాగుతూ మిషనరీ పాత్రకూడ వహించేవారు. సాధారణంగా ఆమె నర్స్‌అని చాలామందికి తెలియదు. బయటి వారందరు ఆమెను డాక్టరుగా భావించేవారు.

ఒకసారి నేను నరసాపురం వెళ్లడము తటస్థించింది. అక్కడ నా సమీపబంధువు కొడమంచిలి విల్సన్‌గారు ఈ హేంప్టన్‌గారి కాంపౌండ్‌లోనే లెప్పర్సీ ఆసుపత్రికి సంబంధించిన ఉద్యోగిగా పనిచేసేవారు. వారిని చూచి వద్దామని నేను అక్కడికి వెళ్లాను. నిర్మానుష్యంగా వున్న ఆ కాంపౌండ్‌లో భయంభయంగా అడుగుపెట్టాను. వరండా మీదికి రెండు స్టెప్పులు పైకెక్కి ఆఫీసురూమ్ వైపు తొంగి చూచాను. ఎవరూ కనబడలేదు. అంత నేను వెనుదిరిగానోలేదో మేడం హేంప్టన్‌గారు అయిదారుగురు స్త్రీపురుషులను వెంటబెట్టుకొని హటాత్తుగా ప్రత్యక్షమై కోమలంగా అరుస్తూ... ఎవరీ అబ్బాయి? నా పర్మీషన్ లేకుండ నా కాంపౌండ్‌లో అడుగుపెట్టడమేకాక నా స్టెప్‌త్రొక్కాడు. పైగా నాకు "సలాం" చెప్పలేదు (అనగా నమస్కారం చేయలేదు) అని చిన్నగా చిందులు ద్రొక్కుచూ భద్రకాళీ అవతారమెత్తారు. అట్టి ఆకస్మిక పరిణామంతో నేను బిత్తరపోయి కోపంతో నిగ్రహాన్ని కోల్పోయి కాస్త అతిగా స్పందించాను. విల్సన్‌గారి కొరకు వచ్చానని చెప్పినా వినకుండ "గెట్ అవుట్" అన్నారు... అయితే వినండి మీ బిల్డింగ్ స్టెప్స్‌త్రొక్కానని నిందిస్తున్నారు... ఈ బిల్డింగులు, భవంతులు అశాశ్వతం - ఏదో ఒకనాడు వీటినన్నింటిని మనం విడవవలసిందే!... ఇదిగో మీకు నమస్కారం చేయలేదంటేన్నారు... "సలాం!...సలామ్...సలామ్" అని అంటూ నిష్క్రమించాను.

అంత నన్ను ఎవరూ ఆపేప్రయత్నం చేయకపోగా వారిలో ఒకామె నేను తెలిసిన బంధువునైనప్పటికి వారికి ఏమీ చెప్పలేదు. అమె మావాడే అంటే వెంటనే డిస్మిస్ అయిపోయేవారు. ఈ సంఘటన జరిగిపోయాక నేనలామాట్లాడి వుండవలసింది కాదేమో అనిపించింది.

## (ముందుమాటలో కొన్నిస్వగతాలు.....)



ఈ విల్సన్‌గారు ఎవరో కాదు. మా నానమ్మగారి మునిమనవడే? సరళస్వభావి. అనంతరం వీరు నరసాపురం జీవనజ్యోతి ప్రింటింగ్‌ప్రెస్ అధినేతగా గతంలో "రాయభారి" వంటి క్రైస్తవ మాసపత్రికలు నడిపించారు. క్రైస్తవ వాంఙ్మయానికి చెందిన అనేక పుస్తకాలను ప్రచురించారు. 1986లో "గొప్పసాక్షి సమూహం" అనే గోదావరి డెల్టామిషన్ సంఘచరిత్ర (రచయిత: శ్రీజోబ్ సుదర్శన్) అనే సమగ్ర గ్రంథాన్ని ప్రచురించారు.

నర్సాపూర్‌లోని పురాతన చర్చియైన గోదావరి డెల్టామిషన్‌కు చెందిన బేతనియ చర్చితో అభిప్రాయ బేధాలవల్ల విల్సన్‌గారు స్వంతంగా జీవనజ్యోతి అసెంబ్లీ చర్చిని స్థాపించి మూడుపువ్వులు ఆరుకాయల చందాన విజయపథంలో నడిపిస్తున్నారు. నేడీయన సుమారు 350 సంఘాలు గల గోదావరి డెల్టామిషన్ చర్చీలకు ప్రసిడెంట్‌గా కొనసాగుచున్నారు. ఇటీవల అనగా సెప్టెంబర్ నెల 2012లో ఆరాధనా టి.వి.ఛానల్ వారు విల్సన్ గారిని సన్మానించి పై టి.వి.లో ప్రసారంచేశారు. పై ఫోటో నేను విల్సన్ గాతితో తీసికొన్ని పాతచిత్రం.

అయితే ఈయన దారి వేరు - నా "రూటు" వేరు.

ఈ విధంగా చర్చీలు విడిపోవడమనే విషయం వచ్చేసరికి మరికొన్ని సంగతులు గుర్తుకొచ్చాయి. నరసాపురంలోని బేతనియ చర్చినుండి జీవనజ్యోతి చర్చివెలసిందని చూచాము. అయితే క్రైస్తవ సంఘాలు వేలాది శాఖలుగా చీలిపోతూవుండగా ఒకే మిషనుకు చెందిన అనేక సంఘాలు ఎలా వేరుకుంపట్లు పెడుతున్నాయో చిన్న ఉదాహరణగా నర్సాపూర్ సంఘచరిత్ర కాస్త పరిశీలింద్దాము.

పై విధంగా బేతనియ చర్చినుండి జీవనజ్యోతి అసెంబ్లీ వేరుపడగా, ప్రముఖ వైద్యుడు దివంగత డా॥ ప్రభాకర్‌గారు "ద.జి.డి.యం. చర్చి" పేర మరో సంఘాన్ని స్థాపించారు. అనంతరం దివంగత జాయిస్‌టిల్సీ మిసమ్మగారు హాలెండ్ వార్ఫ్ చర్చిని ప్రారంభించారు. ఇంతటితో ఆగకుండ నర్సాపురానికే చెందిన శ్రీసత్యానందంగారు మరో చర్చికి అంకురార్పణ చేశారు. ఒక్క నర్సాపూర్‌లోనే లూథరన్, పెంతుకోస్తు, బైబిల్ మిషన్ శాఖలను కూడ కలుపుకుంటే మొత్తము ఎనిమిది తొమ్మిది క్రైస్తవ మతశాఖలున్నాయి.





అయితే గలతీ 5:20-21లో మనము చూడగా "బేధములు... విమతములు"... అనగా వివిధ మతశాఖలు... "నాశనానికి" దారి తీస్తాయని వివరించబడింది. అయినప్పటికి ప్రపంచవ్యాప్తంగా అనేక చర్చీలు అభిప్రాయ బేధాలతో నేటికీ చీలిపోతూ వుండడం మనము గమనించవచ్చు. దీని పర్యవసానం ఎంతటి తీవ్రంగా వుంటుందో మనము రాగల పేజీల్లో చూడగలము.

### ఒకసారి క్రైస్తవ సంఘపెద్దలు...
### మిషనరీ వారిముందు నన్ను దోషిగా నిలిపారు.

మా సోదరికి వివాహమయ్యింది. అనంతరం పెద్దల సమక్షంలో ఆస్తిపంపకాలు జరిగాయి. మాచెల్లి భర్తపేర కొంతపొలం వచ్చింది. అనుకొనని విధంగా పెండ్లయి మూడు నెలలు తిరగకుండానే విజయవాడ క్రిష్ణాబ్యారేజ్ పనులలో సూపర్ వైజర్‌గా పనిచేస్తున్న చెల్లిభర్త అక్కడొక లాంచి ప్రమాదంలో మరణించారు. కనీసం మృతదేహం కూడ దొరకలేదు. అనంతరం వారు మా చెల్లికి గత ఒప్పందం వర్తించదని పొలం ఇవ్వనిరాకరించారు. అనంతరం మా చెల్లి నితీసికొని మా తల్లిదండ్రులు వరంగల్ జిల్లా "చెర్యాల" తరలి వెళ్లిపోయారు. అక్కడ మా తండ్రిగారు ఆ చర్చిపాస్టరుగా పనిచేశారు.

అనంతరం నేను చెట్టిపేటలో ఒంటరిగా వుండి చదువుకొంటూ, ఈ ఆస్తి వ్యవహారం గూర్చి మా చెల్లి మామగార్కి లాయర్ నోటీసు ఇప్పించాను. ఈ విషయం చెట్టిపేట ప్రాంతీయ మిషనరీ మిస్టర్ సి.జె.టిల్సిలీ గారి ముందు పిర్యాదు చేయబడింది. పెద్దలంతా ఒక పక్షమై టిల్స్‌లీ గారిముందు నన్ను దోషిగా నిలువబెట్టారు.

విషయమంతా ఏకపక్షంగా విన్న మిషనరీవారు మాట్లాడుతూ మన క్రైస్తవులు అన్యులమాదిరిగా గొడవలు పెట్టుకుంటూ కోర్టులకు వెళ్లకూడదు. వెంటనే నా పిర్యాదును ఉపసంహరించుకోవలసిందిగా సలహా ఇస్తూ, ఇది క్రైస్తవ మతానికి విరుద్ధమని చెబుతూ అసలు విషయానికి ఒక పరిష్కారమార్గాన్ని చూపే ప్రయత్నం వారేమీ చేయలేదు. మిషనరీ వారు మాట్లాడుతూ! ఒక సారితాను తనతుపాకి లైసన్స్ రిన్యూవల్ సందర్భంగా కోర్టుకు వెళ్లవలసిన అవసరముండగా నేను కోర్టుకు వెళ్లకుండ జిల్లా కలెక్టరుగార్ని కలసి వివాదం పరిష్కరించుకున్నానని తనవాదనను సమర్థించుకో ప్రయత్నించారు. నిజానికి తుపాకి లైసెన్సింగ్ అథారిటీ జిల్లా కలెక్టరే!

అంతట నేను నిలుచుండి ఇంతమంది పెద్దల ముందు నేనేమి మాట్లాడగలను? ఇటీవలి సంవత్సరాల్లో మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినా ఇంకా గవర్నర్ జనరల్ వంటి పదవుల్లో ఆంగ్లేయు.ి ఇటీవల వరకు కొనసాగారు. బ్రిటీష్ మిషనరీలుగా మీకు ఎంతో

కలెక్టర్స్‌ను కలసిమీరు మీ పనులు పలుకుబడివుంది. ఆ కారణంగా మీరు జిల్లా కలెక్టర్స్‌ను కలసిమీరు మీ పనులు చక్కబెట్టుకున్నారు. మాలాంటి వారిని కలెక్టరు కాదుకదా! కలెక్టర్ బంట్రోతు కూడ లెక్కచేయడని, అది మీవంటి వారికే చెల్లుతుందని, భారత రాజ్యాంగం మాకు ప్రసాదించిన హక్కుల కోసం పోరాడడం చట్టవ్యతిరేకం కాదు. మత వ్యతిరేకం అంతకన్నా కాదని చెప్పేసరికి టిల్సీగారు కోపంతో లేచి వెళ్లిపోయారు. అంతటితో అలనాటి చర్చ అసంపూర్తిగా ముగిసిపోగా ఎక్కడివారక్కడకు వెళ్లిపోయారు. వారు వెళ్తూవెళ్తూ అంతపెద్దాయన ముందు నీవు మాట్లాడవలసిన తీరేనా ఇది యంటూ నన్ను మందలించి మరివెళ్లారు.

## శిథిలమైన చెట్టిపేట మిషన్ కాంపౌండ్

మానానమ్మ, మా తండ్రిగారి కాలంనుండే మా కుటుంబం ఎదుర్కొన అణచివేత, అవమానాల నుండే నాకీ విధమైన ప్రశ్నించే మనస్తత్వం అలవడిందేమో అనిపిస్తుంది. ఈ విధంగా ప్రశ్నించే అలవాటే నేడునేనీ విమర్శనా గ్రంథం వ్రాసే అవకాశం కలిగించిందేమో ననిపిస్తుంది.

అయినప్పటికి నాకు మనము ఇంతవరకు చూచిన మిషనరీవారు అణగారిన వర్గాల అభ్యున్నతికై పాటుపడిన వీరిపై ఎటువంటి ద్వేషము లేదు నేను 2011 సంవత్సరాంతంలో మా స్వగ్రామమైన చెట్టిపేట వెళ్లడము జరిగింది. అక్కడ పాత మనుషులెవరూ లేరు. కనీసం నా వయస్సువారైనా కనబడలేదు. అక్కడికి సమీపంలోనున్న అలనాటి మిషన్ కాంపౌండ్ ప్రాంతాన్ని దర్శించాను. అక్కడ మా నానమ్మ, మా తండ్రిగార్ల ఆనవాళ్లు ఏమయినా లభిస్తాఏమోనని వెర్రిగా వెతుకులాడాను. ఏమీ దొరకలేదు. చివరకు వారు సంచరించిన ప్రాంతమందలి "చేరడు మంటిని" సేకరించి భద్రపరచాను. అలనాటి బౌడన్ బంగాళా వుండేదని చెప్పిన ప్రాంతంలో కాసేపు నిలుచున్నాను. మా నానమ్మ, మా నాన్న అవమానించబడ్డ ప్రదేశం ఇదేకదాయని కన్నీరుకార్చాను.



ఆ మిషన్ కాంపౌండ్ ప్రాంత పరిసరాల్లో నాటి పాతతరం మిషనరీల సమాధులున్న ప్రాంతాన్ని వేదనా భరిత హృదయంతో పరిశీలించాను. E.S. బౌడన్, మేగీ బౌడన్, తదితరుల సమాధులన్నీ చెద పుట్టలు కప్పివేశాయి. ఆఖరి తరం మిషనరీ E.S. బౌడన్ కుమార్తె హెన్రిట్టా బౌడన్ చిత్రమిది. అమె నాకు సుపరిచితురాలు.





17-7-2011 నాడు నేను పరిశీలిస్తున్న ఈ సమాధి హెన్రిట్టా బౌడన్ మిసమ్మ గారిది. ఈ చెదపుట్టలను త్రవ్వించి ఈ మిషనరీల సమాధులను బయటకు తీసి మరికొంత కాలము వీరిని జ్ఞప్తిలో వుంచుకోవాలనే ఉద్దేశంతో ఒకరికి కొంత మొత్తాన్నిచ్చాను. కాస్త ఆలస్యమయినా ఈ ఆలోచనను కార్యరూపంలోకి తేవాలని భావిస్తున్నాను. ఈ విధంగానే గతచరిత్ర అవశేషాలు కాలగర్భంలో కలసిపోతూవుంటాయి. చాలామంది మనపూర్వీకుల చరిత్రలకు ప్రాముఖ్యతనీయరు.

## V

ప్రేమ దయాగుణాలను ప్రబోధించే ఈ "మంచి మతం" పైకి ఎంతో ఉదారంగా కనిపిస్తుంది. హింసను చూడలేనంటుంది. దుర్మార్గాన్ని భరించలేనంటుంది. చెడును సహించలేనంటుంది. నీ శతృవులను సైతం మిత్రుల కన్నామిన్నగా చూడమంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే నిన్నువలె నీ పొరుగువారిని ప్రేమించమంటుంది. ఎవరైనా నీ కుడి చెంపమీద కొడితే నీ ఎడమ చెంపను కూడ త్రిప్పిచూపమంటుంది. ఈ విధంగా దయారసం ఒలకబోసే ఈ మతం గతం ఎలాంటిదో ఒకసారి సింహావలోకనం చేస్తే నేటి సభ్యసమాజం ఒడలు గగుర్పాటుతో కంపిస్తుంది. అదేమిటో కాస్త పరిశీలించి చూద్దాము.



ప్రకృతిలో మనకు గోచరించే భూమి, సూర్య చంద్రనక్షత్రాదులు, తత్సంబంధిత ఖగోళ వైజ్ఞానిక శాస్త్రవేత్తలను ఈమతం వేటకుక్కల వలె వెంటాడి తరిమితరిమి కొట్టి చీల్చిచెండాడి సజీవ దహనాలు గావించింది. మతంపేరున పవిత్రయుద్ధాలు చేయించి అమాయక ప్రజల రుధిరంతో పృథ్విని ప్రోక్షించి కలుషితం గావించింది.

ఈ మానవ కంకాళాలపై పాలరాతి కట్టడాలు బంగారు లతలతో సర్వాంగ సుందరంగా

నగిశీలు చెక్కబడి నింగినంటే గోపురాలు శిలువాలంకరణలతో నేడు శాంతి గంటలు మ్రోగిస్తూ స్వాగతం పలికే ఈ చర్చీలు... అలనాడు మతంమత్తు తలకెక్కించుకొని మతాంధకారంతో రంకెలువేసి బుసలుకొట్టి దానికరకు కోరలతో చీల్చబడిదాని ఇనుపపాదాల క్రింద నలిగి నెత్తురుచిమ్మి అసువులు బాసిన కోట్లాదిమంది అమాయక మానవుల, మహామేధావుల, మహోన్నత శాస్త్రవేత్తల స్మారక చిహ్నాలు. ఇవి చర్చీలు-ప్రార్ధనా మందిరాలు కనేకావు.

ఒకసారి వెనుదిరిగి చూస్తే క్రైస్తవమత పీఠాధిపతులు రాజరిక వ్యవస్థతో కుమ్మక్కై సత్యాన్ని సమాధి చేసి, వంచనకు వంత పాడుతూ దేవుని పేరిట పాపపరిహార పత్రాలను విచ్చలవిడిగా విక్రయించి కోట్లకు పడగలెత్తారు.

యుద్ధ ప్రారంభ దశలోనే పోపు అనేక జాయింట్ కంపెనీలయిన ఎలక్ట్రిక్ పవర్ మైన్స్, ట్రాన్స్‌ఫోర్టు, టెక్స్‌టైల్, ఇన్సూరెన్స్ రంగాలందు పెట్టుబడులు పెట్టగా వచ్చిన లాభమట అవి. ఈ క్రమంలో వడ్డీవ్యాపారం చేసే నలువది బ్యాంకులు పోప్‌పయస్ ఆధీనంలో వుండేవట. ఈ విధంగా పోపు మాత్రమేకాక, కేథలిక్ మత గురువులు, కార్డినల్స్ సైతం ఇదే బాటలో నడుస్తూ మొత్తం ఇంగ్లండు దేశమందలి మూడవవంతు భూమిని వీరి స్వాధీనంలోకి తెచ్చుకున్నారట. యేసు ప్రతి నిధులమని చెప్పుకొనే వీరే గుత్తపెట్టుబడి దారులుగా, అతిపెద్ద భూస్వాములుగా తమ దోపిడీని యధేచ్ఛగా కొనసాగించారు.

ఇట్టి మతాధిపతుల ఆధ్వర్యంలోనే "క్రూసేడులు" అనబడే పవిత్రయుద్ధాలు క్రైస్తవులకు-టర్కులకు మధ్య క్రీ॥శకం 1096-1291 వరకు సుమారు 200 సంవత్సరాలు సాగి 900 సార్లు జెరూసలేముపై దండయాత్రలు జరిపి, ఒరనుండి తీసినకత్తి రక్తంతో తడవకుండ తిరిగి ఒరలో పెట్టిన వాడు శాపగ్రస్తుడని సైనికులను రెచ్చగొట్టి-గెలిస్తే రాజ్యాధికారం-మరణిస్తే వీర స్వర్గం అంటూమతం మత్తెక్కించి పవిత్రయుద్ధాల పేరిట జెరూసలేమ్‌ను పీనుగుల వెంటగా మార్చి ధ్వంసం చేయించారు. **పైరెండు వందల సంవత్సరాల్లో పదికోట్లమంది ప్రజలు దారుణంగా చంపబడ్డారు.**


మతసంస్కరణకు మరోపేరు లూథర్

ఈ విధంగా మత యుద్ధాలందే కాక మత పీఠాధిపతుల దురాగతాలను దుయ్య బట్టిన మార్టీన్ లూథర్ నాయకత్వాన కేథలిక్ చర్చి రెండు ముక్కలై ప్రొటెస్టెంట్లు గావిడిపోయారు. ఈ భేదా భిప్రాయాల కారణంగా జర్మనీ, స్పెయిన్, ఫ్రాన్స్ మొదలైన దేశాల్లోని క్రైస్తవుల మధ్య భయంకర అంతర్ యుద్ధాలు ప్రజ్వరిల్లి అవి వీధిపోరాటాలుగా మారి లక్షలాది మంది





దుర్మరణం చెందారు. అనంతరం ప్రొటెస్టెంట్లలోనే తిరిగి చీలికలు వచ్చి, ప్యూరిటన్లు, జంగ్లియన్లు, కాల్వినిష్టులు, లూథరన్స్ అనే ఉపశాఖలుగా విడిపోయి వేరుకాపురాలు పెట్టారు.

కాలక్రమేణా ఈ క్రీస్తు అనుచరులు సిద్ధాంత పరమైన అభిప్రాయ భేదాలతో ఒక చర్చితో మరో చర్చి విబేధిస్తూ నేడు పుట్టగొడుగుల వలె వేలాది చిల్లర మల్లర శాఖలుగా విడిపోయాయి. మచ్చుకు కొన్ని... రోమన్ కేథలిక్కులు, లూథరన్స్, కెనేడియన్ బాప్టిస్టులు, సెవెన్త్-డే-ఎడ్వన్టిస్టులు, పెంతెకోస్తు, బైబిల్ మిషన్, రక్షణసైన్యం, యెహోవా సాక్షులు, బ్రదర్ భక్తసింగ్ ఫెలోషిఫ్, చర్చ్ ఆఫ్ సౌతిండియా, దినకరన్ గ్రూప్, "మారనాథ" సంఘం వంటి లెక్కలకు అందని అనేక శాఖలుగా ప్రపంచవ్యాప్తంగా నేడవి ఆరువేలపైగా క్రైస్తవ శాఖలుగా ఆయా ప్రముఖ ప్రసంగీకుల పేర గ్రూపులుగా చెలామణీ యోతున్నాయి. ఈ వేర్పాటు వాదానికి అంతంలేదు. నేటికీ క్రొత్తశాఖలు ఆవిర్భావం చెందుతునే వున్నాయి.

**కాలక్రమేణా యావత్ ప్రపంచం సంగతి అలావుంచి కేవలం మన ఇండియాలో మరిముఖ్యంగా మన రాష్ట్రంలో ఈ విధంగా పెరిగిపోయిన క్రైస్తవ మత శాఖలు యెహోవాను గూర్చి, యేసును గూర్చి, స్వర్గనరకాలను గూర్చి, యేసు రెండువ రాకడను గూర్చి, న్యాయపు తీర్పును గూర్చి, మరింకెన్నో బైబిల్ విషయాలను ఏకాభిప్రాయంతో ఎంతమాత్రము ఏకీభవించవు. "బైబిల్ మిషన్"-నరకంలో కూడ సువార్తయుంటుందంటుంది. కొన్ని చర్చీలు "స్వస్థతా ప్రార్థనలు" "స్వస్థతా వరాలు" అనేవి బూటకం-నాటకం అంటాయి. పెంతెకోస్తు వంటి కొన్ని సంఘాల్లో "కీకర బేకర" మంటూ ఎవరికీ అర్థంకాని "క్రొత్త భాషలు" మాట్లాడతారు. వీరు ఆభరణాలు గాని కనీసం చేతులకు గాజులు గాని వేసికోరు. తెల్లదుస్తులకు ప్రాధాన్యమిస్తారు. ఆదిమ క్రైస్తవ సంఘంగా చెప్పుకొనే రోమన్ కేథలిక్కులు యేసు అంతటి మహానీయుని కన్నతల్లి మరియమ్మను (మేరీ మాతగా) ఆమె విగ్రహానికి పూజలు చేస్తారు. ఆ విధంగానే యేసు శిష్యులు మొదలైన వారి విగ్రహాలను కూడ చర్చిల్లో ప్రతిష్ఠిస్తారు. ఇట్టి వారికీ "సెయింట్స్" పరిశుద్ధులు అనే బిరుదులతో అనేక విద్యాసంస్థలు, సేవాసంస్థలు, ఆసుపత్రులు ప్రపంచవ్యాప్తంగా నడిపిస్తున్నారు. వీరు హిందూ ఆచారమైన బొట్టును చక్కగా అలంకరించుకొంటారు.**

అలాగే క్రైస్తవ మతశాఖల్లోని బాప్టీస్టు మిషన్, మరికొన్ని శాఖలు క్రైస్తవులను నీళ్లల్లో ముంచి "బాప్తీస్మము" ఇస్తూ యుండగా, లూథరన్ మిషన్ వారు మాత్రం నాలుగు నీళ్లచుక్కలు నెత్తిమీద చిలకరించి బాప్తీస్మమిస్తారు. రక్షణ సైన్యం (సాల్వేషన్ ఆర్మీ) అనే మరొక శాఖ వారిచ్చే బాప్తీస్మము మరోతీరుగా వుంటాది. విశ్వాసులను ఎర్రజెండా క్రిందినుండి దూర్చి బాప్తీస్మతతంగం ముగిస్తారు. మరికొన్ని శాఖలవారు చర్చి

సమావేశాలందు వాయిద్యాలు వాయించరు. ఈ విధంగా ఎవరి మట్టుకువారు మాదే అసలైన క్రీస్తు సంఘమని మిగతా శాఖలవారంతా నరకానికిపోతారని తాముమాత్రమే స్వర్గానికి వారసులమని చెప్పుకుంటూ ఆయా శాఖలు అభిప్రాయ భేదాలతో ఒకరి పొడ మరొకరికి గిట్టదు. వేరే మిషన్‌కు చెందిన ఫాదర్లను మరొక చర్చివారు ఆహ్వానించరు. తమ చర్చీలందు ప్రసంగించనీయరు. వారివి తప్పుడు సిద్ధాంతాలంటారు.

ఒకే చర్చి సభ్యులు కూడ పెద్దరికం కోసం అభిప్రాయ భేదాలతో పోటీ సమావేశాలు జరపడం, బిషప్పులను డిస్మిస్ చేయడం. ఒకరినొకరు తిట్టుకుంటూ, తన్నుకుంటూ, చర్చిగేట్లకు తాళాలు వేస్తూ చివరకు పోలీసులు రంగప్రవేశం చేసి, ఆయా వివాదాలు కోర్టుల కెక్కిన సందర్భాలు అనేకం ఉన్నాయి. గతంలో కేరళకు చెందిన "యెహోవా సాక్షులు" అనే చర్చివారు మన జాతీయ జెండాకు వందనం చేయడాన్ని తిరస్కరించిన సందర్భాంలో కొంత అలజడి జరిగిన విషయం చాలామందికి తెలిసియుండవచ్చును. కేరళ ప్రాంతం దేశం మొత్తం మీదే అక్షరాస్యతలో ప్రథమస్థానం వున్నప్పటికి ఆంగ్లేయుల పాలనా కాలంలో ఇతర ప్రాంతాల వలెకాక అక్కడ అధికంగా అగ్రవర్ణాలుగా చెప్పబడినవారు క్రైస్తవ మతం నీడకువచ్చారు.




ఇదిలాగుండగా అవిభక్త మాద్రాసు రాష్ట్రంలో కొనసాగిన ఆంధ్ర ప్రాంతంలో కూడ బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియులేకాక, రెడ్డి, వెలమ, కమ్మ, కాపు, కంసాలి, పద్మశాలి తదితర వర్గాల నుండి కూడ అనేకమంది క్రైస్తవ మతం స్వీకరించారు. అయితే వీరిలో చాలామంది వట్టి చేతులతో రాకుండా వస్తూవస్తూ తమ కులాన్ని చేత బట్టుకొని వచ్చి చక్కగా క్రైస్తవ మతంలోకి జొప్పించి తమ ఆధిక్యతను చాటుకొనుటకు ఎంచక్కా థామస్ శాస్త్రీ, సాల్మన్ రాజు, స్టీవెన్ రెడ్డి, పాల్ చౌదరి, లూకాచారి వంటి కులపు "ఇండికేషన్లను" భద్రంగా జొప్పించి పదిలపరచుకున్నారు.

ఈ కులపు తోకల ప్రస్తావనలను గూర్చి ఎవరూ "ఫీల్" కావలసిన పనిలేదు. ఇవన్నీ నేటి టి.వి.ఛానళ్లలో ప్రత్యక్ష మౌచున్న యధార్ధ విషయాలే సుమా!

అయినప్పటికి ఎవరైనా సందేహవాదులున్నట్టయితే అట్టి వారి సౌకర్యార్థం ఈ చిన్న ప్రత్యక్షసాక్ష్యం! చూడవచ్చు.





అసలే వేలాది శాఖలుగా చీలిపోయిన క్రైస్తవ మతశాఖలకు మరింత వన్నెతెచ్చే విధంగా వీరు "మారనాత" అనే మరో క్రొత్త క్రైస్తవ శాఖకు అంకురార్పణచేసి దానికి వీరు వ్యవస్థాపకాధ్యక్షులుగా కొనసాగుచున్నారు. "మారనాత" అనగా క్రీస్తు త్వరగా రానున్నాడని అర్థమట. ఈ చిత్రంలో వీరి అందమైన పడికట్టును ఒకసారి చూడండి! వీరు పెట్టుకున్న పేరు "మోజేస్ చౌదరి"తో పాటుగా వీరిపడికట్టులో కూడ హిందూత్వ పరిమళాలు చక్కగా బహిర్గత మౌతున్నాయి. వీరు 2011 సంవత్సరాంతంలో టి.వి.లో ప్రసంగిస్తూ.... "ఏమిటీ క్రైస్తవ లోకంలో ఈ అభిప్రాయ బేధాలు అంటూ నీతులు వల్లించారు. వీరిది కూడ వేరుకుంపటేననే విషయం గుర్తురాలేదా?

ఇట్టి వారంతా కూడ క్రైస్తవ మత పరిభాషలో... "మారుమనస్సు పొంది, గొర్రెపిల్ల రక్తంలో తమ పాపాలను ప్రాయశ్చిత్తం చేసికొన్న ప్రభువు బిడ్డలు"గా చెలామణీ ఔతున్న వారే! వీరుకూడ పెంతుకోస్తు శాఖలాగ ఆభరణాలు ధరించరుకావచ్చు. అయితే చాలామందికి అనేక అనుమానాలు రావచ్చును. ఇంతకాలము తాము క్రైస్తవులంతా ఒకటేననుకున్నాము! వీరిలో కూడ ఇన్ని అభిప్రాయ బేధాలా! అని విస్తుపోవచ్చు. మరి వీరి ప్రభువు ఇట్టి విషయాలను గూర్చి ఏమీచెప్పలేదాయని భావించవచ్చు. ఈ క్రైస్తవ మతసిద్ధాంతాలను గూర్చి యేసుకు కూడ తెలియని అనేక విషయాలు నడిమంత్రంగా వచ్చిచేరిన క్రైస్తవ మతసిద్ధాంత కర్తగా అపోస్తలుడైన పౌలుగార్కి చాలాబాగా తెలిసినట్లు కనబడుతాది.

**గలతీ 5:20-21 చూడండి! : జారత్వము, అపవిత్రత కాముకత్వము, విగ్రహారాధన, అభిచారము, ద్వేషములు, కలహములు, మత్సరములు, క్రోధములు, కక్షలు, "భేదములు, విమతములు", అసూయలు, మత్తతలు, అల్లరితో కూడిన ఆటపాటలు... చేయువారు దేవుని రాజ్యంలో ప్రవేశించరు. అని సెలవిచ్చారు.**



ఇంతటి తేటయైన ఈ వాక్యాలు ఈ సంఘసంస్కర్తల మనసులకు తట్టలేదు లాగుంది. దీనిని బట్టి "క్రిస్టియానిటీ"ని తమతమ అభిప్రాయాలకు అనుగుణంగా బైబిల్‌కు పెడార్థాలు తీసి ఎందరో మహానుభావులు ఆదిమ క్రైస్తవ సంఘాన్ని ముక్కలు చెక్కలు చేసి దానిని వాటాలు వేసికొని, తలోముక్క పంచుకొని చివరకు వేలాది ఉపశాఖలుగా విభజించి పాలిస్తున్నట్టు మనము చూస్తున్నాము. పై వాక్యమును మరొక్క మారు చదివి గమనించండి! **భేదములు....విమతములు** భేదాభిప్రాయాలు, వివిధ మతశాఖలు అని తేటయైన అర్థం కాగా వీరంతా నరకంలోకి పోవలసిందేనన్న మాట,

దీనిప్రకారం మార్టిన్ లూధర్ మొదలుకొని వేలాది మతశాఖల విభజనకు కారకులైన వారంతా హోల్‌సేల్‌గా నరకానికి పోతారా!! ఇంతటి భయంకరసత్యాన్ని ఈ రచన ద్వారా బయటపెట్టేవరకు ఎవరికి తెలిసినట్టులేదు లాగుంది.

ఆయా సంస్కర్తలు ఎవరెవరో మనకు వివరాలు అంతగా తెలియదు. కొద్ది మంది తప్ప, వీరంతా నరకానికి పోతూ పోతూ ఆయా సంఘస్థులందర్ని కూడ వెంట తీసుకొని పోతారేమో! ఇంతకుముందే మనము చూచిన ఈ "మారనాథ" సంఘ వ్యవస్థాపకాధ్యక్షుల వారైన మోజెస్ చౌదరిగారు కూడ వారి మొత్తం సంఘాన్ని వెంటబెట్టుకొని నరకానికిపోతాడని తెలిసినప్పటి నుండి నా మనసంతా అదోలాగుంటుంది. ఇంతవరకు మనము చూచిన క్రైస్తవ సంఘాలను చీల్చిన వారుకూడ... నరకంలో పడిపోకతప్పదని ఇట్టి వారందరిని గూర్చి అయ్యో పాపం! అంటూ అడ్వాన్సుగానే విచారం వెలిబుచ్చడం జరిగింది. దీనిని గూర్చి ఏ ఒక్కరూ ఆందోళన చేదవలసిన పనిలేదు. మరణానంతరం తెలివైనా, ఉపాయమైనా, అపాయమైనా, ఆత్మయైనా, పరమాత్మయైనా, పరిశుద్ధాత్మయైనా చివరకు దురాత్మయైనా ఏమీ ఉండవు. మరణం మానవ జన్మకు చిట్టచివరి మెట్టు కావాలంటే అగ్రిమెంటు వ్రాసి ఇస్తాను. కడుపునిండా భోంచేసి నిశ్చితంగా నిద్రపోండి! ఇంతే సంగతులు చిత్తగించవలెను.

అపోస్తలుడైన పౌలు క్రొత్తనిబంధనలో ఆయన తన రచనల ద్వారా క్రైస్తవ మత సిద్ధాంత కర్తలా కనిపిస్తాడు. ఎందుచేతనంటే యేసుకు కూడా తెలియని అనేక విషయాలను నిబంధనలను తన రచనల్లో పొందుపరచాడు. నిత్యనరకాగ్ని గుండం, క్రీస్తు రెండవ రాకడ, న్యాయపుతీర్పు, భార్యాభర్తల ప్రవర్తనా నియమావళి, పిల్లల పెంపకం ఇత్యాధి విషయాలను కూలంకుషంగా చర్చించాడు. ప్రతి క్రైస్తవుడు యేసు తరువాత పౌలు బోధనలను గౌరవిస్తారు. ఆయనొకసారి తానెంత గొప్ప నీతిమంతుడో చెబుతూ, నేను యేసుని అడుగుజాడల్లో నడుస్తున్నాను. మీరు కూడ నన్ను పోలినడుస్తూ నన్నువెంబడించండని ఉద్బోధించాడు. అందుచేత అనేకులు పౌలును "ఫాలో" అవుతున్నారు.

ఈ పౌలుగారి "మాదిరి" ఎంత బాగుంటాదో కాస్త చూద్దాము. ఆయనొకసారి సంఘస్తుల యొద్ద సెలవుతీసికొని "సిరియా"కు పయనమై వెళ్తుండగా – హిందూ పుణ్యక్షేత్రమైన తిరుపతి, వేములవాడ వంటి పుణ్యక్షేత్రమొకటి కనబడగా ఆయన వెంటనే "కేంక్రియ" అనే పట్టణంలో దిగి తనపాత మ్రొక్కును తీర్చుకొనుటకు పరుగుపరుగున వెళ్లాడు. (అది ఏ గుడో! లేక పుణ్యక్షేత్రమో వివరాలు ఇవ్వలేదు.) వెనువెంటనే తన మ్రొక్కు ప్రకారం అక్కడాయన గుండుగొరిగించుకొని వచ్చాడట. (అపొ. 18:18) బైబిల్‌లో





ఇటువంటి గుండు గొరుగుడు క్షేత్రాలు బైబిల్ ఒకటో రెండో కనబడతాయి. (సంఖ్యా కాండము 6:18).



కాని పౌలును అనుకరిస్తూ ఏ క్రైస్తవ సంఘాలు గుండ్లు గొరిగించుకోవు. అయితే చాలాకాలంగా తిరుపతిలో భక్తజనులు తమ తల నీలాలు సమర్పించడము, దీనికున్న "డిమాండ్" గమనించిన రోమన్ కేథలిక్ చర్చ్‌వారు చాలాకాలం క్రితమే తిరుపతికి సమీపంలో వున్న నాగపట్నంలో మరియమ్మ జాతర ప్రారంభించారు. ఇది అనతి కాలంలోనే మంచి పుణ్యక్షేత్రంగా గుర్తింపుపొందింది. ఈ మేరీమాత జాతరకు ఒక్క రోమన్ కేథలిక్ క్రైస్తవులే కాకుండ హిందూ భక్తులు కూడ వచ్చి భక్తిశ్రద్ధలతో గుళ్లు గొరిగించుకోవడం ప్రారంభమై, లాభసాటి వ్యాపారంగా నడుస్తుంది.

క్రీస్తు తరువాత క్రీస్తు అంతటివానిగా చలామణీ అవుతున్న పౌలుగారి చరిత్రచూస్తే వారు మూడు నాలుగు సార్లు కులానికి సంబంధించిన పెద్దపెద్ద "లైస్" ఆడినట్టు కనబడతాది. అదేనండి లైస్ అంటే అబద్ధాలన్నమాట! ఒకసారి రోమన్ పాలకులు ఈ పౌలును, అతని సహచరుడైన "సీల"ను చితకబాది సంకెళ్లతోపాటు వారి కాళ్లకు బొండాలు బిగించి కారాగారంలో పడవేసి బయట తాళాలు బిగించారట అంత పౌలు అనుచరులు ప్రార్థనలు చేయగా దైవమహిమతో పెద్దభూకంపం వచ్చి ఎక్కడ సంకెళ్లు అక్కడే విడిపోయి, తాళం కప్పలు కూడా తెరచుకొని వీరు బంధ విముక్తులైయ్యారు. (ఇక్కడొక పెద్ద అనుమానం! ఎక్కడన్నా భూకంపాలకు తాళం కప్పలు తెరచుకుంటాయా?) తెరుచుకోవు కాని అద్భుత కథల్లో మాత్రం ఇవన్నీ జరిగిపోతూనే వుంటాయి. (నోరుమూసుకొని నమ్మేయాలంతే)

అనంతరం పౌలు-శీలలను రాణువవారు విడుదల చేయగా, పౌలు వారికి ఎదురుతిరిగి రోమీయుడనైన నన్ను మీరు ఏ "సెక్షన్" ప్రకారము అరెస్టుచేశారని నిలదీయగా భయాభ్రాంతులైన వారు కంగారుపడుచూ "అయ్యబాబోయ్" మీరు రోమన్ జాతీయులా సార్! అంటు తత్తరపడ్డారట. ఈ విధంగా చెప్పుకున్న మనరోమన్ పాల్‌గారు మరొకసారి దేవాలయములో ప్రసంగిస్తూ వుండగా... అది గమనించిన ఇశ్రయేలీయులు వీడెవడో వచ్చి మన ధర్మశాస్త్రానికి వ్యతిరేకంగా మాట్లాడడమేమిటని ఆవేశంతో అనేకులు ఆయన మీదికి రాగా అందుకు సెయింట్ పాల్‌గారు వారితో అయ్యలరా! నేనెవరిననుకుంటున్నారు? నేను "తార్సు"వాడనైన యూదుడను కానా! అని ప్లేటు పిరాయించాడు (చూడండి...

అపొ॥21:39) అనంతరం నేనైతే పుట్టుకతోనే రోమీయుడను కానా అని మళ్లీ చెప్పుకున్నాడు.(చూడండి అపొ॥22:28).

మరొకసారి పౌలు సద్దూకయులతోను, పరిసయ్యుల తోను మాట్లాడుతూ మీకు తెలియదా! నేను పరిసయ్యుల సంతతి వాడినని మరోసారి ప్లేటు పిరాయించాడు. మరొక్కసారి ఈ పెద్దమనిషి మాట్లాడుతూ నేను క్రీస్తును పోలి నడుచుకొంటున్నాను. మీరంతా నన్ను పోలి నడుచుకోండని, నా అడుగు జాడల్లో నడవమని క్రైస్తవ విశ్వాసులకు ఉచిత సలహాలిచ్చాడు. కాని మీరు మాత్రం ఈయనను పోలినడవకండి. ఇంతకు ముందు మనము చర్చించుకున్న అగ్రకుల క్రైస్తవులు నిజంగానే ఈ పౌలును అనుకరిస్తూ పౌలువలెనే అబద్ధాలాడుతున్నారో లేదో మనకు తెలియదుగాని క్రీస్తులోనికి వచ్చాక కూడ తమ కులమాధుర్యాన్ని పౌలువలె వీడలేక వెంటబెట్టుకుని తిరుగుచున్నారు. ఇంతకూ ఈ అపోస్తలుడైన క్రైస్తమత సిద్ధాంతకర్త సెయింట్ పాల్‌గారు రోమీయుడా?, తార్సువాడైన యూదుడా? లేక పరిసయ్యుల సంతతివాడా? లేక మరోకులానికి చెందిన వాడైయుండి రోమన్ పౌరసత్వాని కొనుక్కున్నవాడా? ఇదంతా వట్టిదే! నేను పుట్టుకతోనే రోమీయుడని చెప్పుకున్న మాటలు నిజమో! ఎవరికీ తెలియదు. నేను మాత్రం ఈ మహానుభావుని అపోస్తలుడైన పౌలుగా పిలవను. "అబద్ధిక్ పౌలు" అంటే బాగుంటాదేమో! ఈ క్రైస్తవ సంఘాల కంటికి ఈ విధమైన అబద్ధాల పుట్టలు కనబడకపోవడం విచారకరం. ఇది మతమనే "చత్వారమే!"

అగ్రవర్ణంగా తమంతటతాము ముద్రవేసికున్న హిందూమత మూలవిరాట్టైన "మనువు" విభజించి పాలించమన్న దుష్టసూక్తిని అమలు పరచుటకు ఈ దుర్మార్గపు కులవ్యవస్థను రూపొందించి సొదర మానవులను అంటరాని వారిగా, దరిద్రులుగా, అథమాధములుగా చిత్రించి వీరు బ్రహ్మపాదాల నుండి జన్మించిన నీచులని ఈ నీచకుల వ్యవస్థనుండి వీరు మున్ముందు ఈ ఆధునిక యుగాల్లోనైనా బయటపడకుండ నిచ్చనమెల్లు సంస్కృతిని అమలుజరిపి ఇది దైవనిర్ణయమని ఈ నికృష్ట కుల వ్యవస్థ కబంధహస్తాల్లో మానవాళిని బంధీలుగా చేయడం జరిగింది. కులం పేరుతో ఇంతగా అణచివేయబడినా మనలో అనేకమంది తమకులము మరోకులముకన్నా గొప్పదని వారికన్నాతాము అధికులమని భావిస్తూ అట్టడుగు కులాలుగా చెప్పబడే వీరే తమతమ కులాలపై మమకారం వీడలేక పోతుండడము మనము చూస్తున్నాము. అదంతా ఎందుకు ఈ నీచకుల వ్యవస్థలనుండి క్రైస్తవ దేవుళ్లయినా విముక్తి చేస్తారేమో అనుకుంటే ఈ యెహెూవా, యేసులే తమ కులాభిమానాన్ని వీడలేక పోయారు. ఈ కులవ్యవస్థ మానవుల్లోనే గాక ఈ దేవుళ్లలో కూడ ఎలా పెనవేసుకొని పోయిందో ఈ చిరుకవితను చదివాకైనా ఈకుల





## "కులమా - నాబలమా!"

కులమా! నా బలమా - మను తలమానిక ఫలమా!
పుట్టుకలో గిట్టుకలో - కులపు కర్మకాండ వుంది
విద్యాబుద్ధుల యందు - ఉద్యోగపు వేటలందు
వివాహాది విషయంలో - మనువులాడ నున్నగాని
మనుధర్మపు కులముంది - కులమా నాబలమా!...

ఎన్నికలొచ్చిన గాని - ఎంపీ లెమ్మెల్యేలయినా!
మెట్రోపాలిటాలందు - మేయర్లకు కులమంది
కార్పోరేటుగ్రామ - పంచాయతి సర్పంచుల
సమరస్యం గ్రామంలో - కులబలమేగా జీవం
కులమా నాబలమా - మను తలమానిక ఫలమా!

కడపకాదు సీమకాదు - కనకదుర్గ క్రీష్టకాదు!
యావదాంధ్ర తెలంగాణ - లెక్కడ వెదకినగాని
కత్తుల్లో, కొడవల్లో - తుపాకుల తూటాల్లో
నిను తలవక యుండలేను - కులమా నా బలమా
మను తలమానిక - ఫలమా!

కలలోన ఇలలోన - జన్మ జన్మ బంధమందు
కడకుకట్ట కడకుకూడ - స్వర్గ సీమలందు గూడ
యేసయ్యకు కులముంది - యూద జనులవారసుడని
యెహెూవాకు గోత్రముంది - స్వజనులన్న మోజువుంది!
కులమా నాబలమా - "మను" తలమానిక ఫలమా!

\- నెల్సన్ రఫ్జీ

రక్కసి కరకుకోరల నుండి బయటపడే ప్రయత్నం చేయవలసిందిగా మనవి చేయుచున్నాను.

## VI

మనం మరియొకసారి మధ్యయుగాల చరిత్రను మననం చేసికొందాము. క్రీ॥శ॥ 325లో యెహోవా-యేసు ఒకటే కాదన్నందుకు "ఏరియస్"ను కాన్ స్టంటైన్ దేశం నుండి బహిష్కరించి ఆయన రచనలను తగులబెట్టించారు.

క్రీ॥శ॥ 415లో అలేగ్జాండ్రియాలో గ్రీకుతత్వ శాస్త్రాన్ని బోధించే "హై పాటియా" అనే వృద్ధ వనిత క్రైస్తవ్యాన్ని విశ్వసించనందుకు - ఆమె పాఠశాల నుండి ఇంటికి వెళ్తుండగా కొందరు క్రైస్తవ సన్యాసులు ఆమె వెంటపడి తరిమి పట్టుకొని నడిబజారులో హత్యగావించారు. అయినా వారి కసితీరక ఆమెను ఖండఖండాలుగా చీల్చి చెండాడి ఆమె ఎముకల మీది మాంసాన్ని కత్తులతో గోకి ఇనుప చువ్వలకు గ్రుచ్చి మంటల్లో కాల్చి, పేల్చి, మాడ్చి మసిచేసి మరి ఆనందించారట. ఈ విధంగా వారు యెహోవాకు ఇంపైన "సువాసన" ఆఘ్రాణింప జేశారు కావచ్చు.


Bruno

ఇటాలియన్ ఖగోళ శాస్త్రజ్ఞుడైన "గ్రియార్డినో బ్రూనో"-విశ్వాంతరాళము అనంతమైనదని అది అంతూపంతూ లేని కాంతిగోళాలను, అనంతకోటి నక్షత్ర సముదాయాలతో నిండి యున్నదని... ఒకో నక్షత్రం ఒక్కొక సూర్యుడేనని నిరూపించిన "నేరానికి" ఆయనను ఇటలీతో పాటు అనేక క్రైస్తవ దేశాలు కూడ, తమతమ దేశాలనుండి బహిష్కరించాయి. అంతేగాక ఆయనకు ఎనిమిది సంవత్సరాలు కారాగార శిక్షను విధించాయి.


Bruno Burning

ఆ మహామహుడైన బ్రూనోను శ్వేతవర్ణపు నిలువుటంగీలు, మెడలో బంగారు శిలువలు ధరించిన ఆ నరరూపరాక్షసులు క్రీ॥శకం 1600వ. సంవత్సరం ఫిబ్రవరి 16వ తేదీన ఈ సత్యాన్వేషకుని ఆర్తనాదాలు నలుదిక్కులా మార్మ్రోగుచుండగా సజీవదహనం గావించి మతపరమైన మౌఢ్యాని పరిరక్షించుకోవడానికి, వారి అజ్ఞానాన్ని కొనసాగించుటకు బ్రూనో రూపంలోనున్న యధార్థాన్ని క్రూరాతి క్రూరంగా బూడిద చేసి తమ ఇళ్లకు వెళ్లి యెహోవాను స్తుతించారు కావచ్చు. అయితే





అలనాటి అబద్ధం, అజ్ఞానం అభాసుపాలయ్యింది. సత్యం సర్వత్రా వ్యాపించి సజీవంగా నిలచిపోయింది.

క్లైఫర్ అనే గణిత శాస్త్రవేత్త గణిత శాస్త్రరీత్యా కోపర్నికస్ సిద్ధాంతాన్ని సమర్ధించినందుకు గాను బహుషా క్లైపర్‌ను కన్నతల్లి కర్ణపిశాచియై యుండవచ్చుననే అనుమానంతో ఆమెను బంధికానాలో వేయించారు. **అలనాటి కేథలిక్ చర్చి చాలా శక్తివంతమైనది. దానికి ప్రభుత్వపరమైన రాజ్యాంగపరమైన సర్వశక్తులు మతాధిపతుల చేతిలోనే వుండేవి. మంత్రగత్తెలు మతానికి శతృవులని భావించేవారు. నాడు అనేకమంది అన్యస్త్రీలు ప్రకృతిని ఆరాధించేవారు. ఇట్టి అనేకమంది స్త్రీలను బంధించి అనేకదినాలు తిండిపెట్టకుండ, నిద్రపోకుండ చిత్రహింసలకు గురిచేసేవారు. దానితో వారాబాధలను భరించలేక చేయని తప్పును చేసినట్టు, తాము మంతగత్తెలమేనని విధిలేక అంగీకరించగా వారిపై సోదెగాంఢ్రు, కర్ణపిశాచులు, చేతబడి, బ్లేక్ మ్యాజిక్ తదితర నేరాలు ఆరోపించి మధ్యయుగాల్లో కేథలిక్ చర్చి సుమారు కోటిమంది స్త్రీలను నిర్ధాక్షిణ్యంగా మరణ శిక్షలు, సజీవ దహనాలు అమలుజరిపిందట. నిజానికి మంత్రవిద్యలు, చేతబడులు బ్లేక్ మ్యాజిక్‌లు మొదలైనవన్నీ అబద్ధం.** అసలు అటువంటి విద్యలే లేవు. అలాగే దయ్యాలు భూతాలు లేనేలేవు. అయినా నేటికీ క్రైస్తవ ప్రపంచం వీటినన్నింటిని నమ్ముతూనేవుంది. నేడు మన కళ్లముందు కొందరు టి.వి. ప్రసంగికులు క్రైస్తవమత ప్రచారఛానళ్లలో ఈ దయ్యాలను వెళ్లగొట్టే ప్రహసనాలను లైవ్‌ప్రోగ్రాములుగా చూపుతూ అమాయక ప్రజల జోబులు కొదుతూ విలాసవంతంగా జీవిస్తున్నారు. "ఇది నిజమా" మూడవ భాగంలో ఇట్టి ప్రసంగికుల బండారం చూడగలరు.


Rojer Bacon

మధ్యయుగాల నాటి మత విశ్వాసాలు పునాదులను రోజర్ బేకన్ కదిలించాడు. నభోమండల మందలి నక్షత్ర సముదాయాలను తేరిపార చూచుటకు ఉపయోగపడే దూరదర్శినిని రోజర్ బేకన్ నిర్మించాడు. ఉదయాస్తమయాలందు సూర్యచంద్రుల బింబాభివృద్ధికి కారణం వాటివాటి కాంతి పుంజాలు వక్రీభవనం చెందడం వల్లనేనని సహేతుకంగా వివరించి విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి కారకుడుకాగా ఇవన్నీ బైబిల్‌కు వ్యతిరేకమని మతాధిపతులు బేకన్ మహాశయుని క్రీస్తుశకం 1258 నుండి 68 వరకు అనగా పది సంవత్సరాల పాటు ప్యారిస్ జైలులో బంధించారు. విడుదల అనంతరము తిరిగి అదుపులోకి తీసికొని మరో పదునాలుగేండ్లు కారాగారంలో వుంచారు. అనగా మొత్తం

24 సంవత్సరాలు కడగండ్ల పాల్జేశారు. ఇది హత్యానేరానికి విధించే శిక్షకన్నా ఎక్కువే!

గెలీలియో ప్రముఖ గణిత శాస్త్రవేత్త, ఖగోళశాస్త్ర కోవిదుడు. తాను కూడ "టెలిస్కోప్"ను కనుగొని అనంతాకాశమందలి గ్రహ సముదాయాలను విస్తృతంగా పరిశీలించి, పరిశోధించి, సూర్యకాంతి చంద్రుని పైపడి ప్రతిఫలిస్తుందే గాని, మతగ్రంథం చెప్పిన విధంగా చంద్రుడు స్వయంప్రకాశం గల జ్యోతి ఎంతమాత్రము కాదని



మతవాదుల నెత్తిన పిడుగులాంటి నిజాన్ని బట్టబయలు చేయడమేగాక చంద్రునిపై కనబడే మచ్చలు అక్కడి పర్వతాల నీడలేనని రుజువులు చూపాడు. అంతేగాక భూమి సూర్యుని చుట్టూ ప్రదక్షిణాలు చేస్తుందని కోపర్నికస్ ప్రతిపాదించిన సిద్ధాంతం యధార్థమని చెప్పడంతో మతవాదులకు మతిపోయింది. సూర్యుడే పరిగెడుతున్నాడని... చంద్రుడు జ్యోతిగా వెలిగిపోతున్నాడని యెహోవా చెప్పిన మాటలు ఎందుకూకొరగాకుండా పోతున్నాయని మతాధికారులకు వెర్రెత్తి పోయిచిందులు ద్రొకారు.

వెనువెంటనే యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా పనిచూస్తున్న గెలీలియో ఉద్యోగం ఊడగొట్టారు. కనీసం ఆ టెలిస్కోపులో కనిపించే నిజాలేమిటో చూచి తెలిసికోవాలనే సవాలును ఏ ఒక్కరు ఆమోదించలేదు. అది సర్వశక్తిమంతుడైన సృష్టికర్త దివ్యవాణికి వ్యతిరేకమన్నారు. అయినప్పటికి గెలీలియో అనేకమంది ప్రజానీకానికి తన మాతృభాషయైన ఇటలీలో విడమరచి చెప్పి తనవైపు త్రిప్పుకొన్నాడు. చివరకు "THE DIALOGUE ON THE WORLD SYSTEM" అనే 800 పేజీల వృద్ధంధాన్ని రచించుటకు పది సంవత్సరాలు శ్రమిచి ప్రచురించాడు. దీనితో బైబిల్ సృష్టికార్యం ఎందుకూకొరగాకుండా పోయింది. ఈ దెబ్బతో మతాధికారులు బెంచేలెతిపోయారు. గంగవెర్రు లెత్తిన "బోలోనా" ఆర్చిబిషప్ 1914లో చర్చి సమావేశంలో ప్రసంగిస్తూ... ఓ గెలీలియో మనుషుల్లారా! గణిత శాస్త్రం దయ్యం నేర్పిన విద్య. అందుచే క్రైస్తవ దేశాలన్నీ గణితాన్ని నిషేధించాలి. భూమి సూర్యుని చుట్టూ తిరగడమనేది మతద్రోహంగా ప్రకటించాడట. అనంతరం మత గురువులు మరింతగా రెచ్చిపోయి మరింత మతోన్మాదంతో విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి అసలు పుస్తకాలనేవి కూడా సాతానే సృష్టించాడు. ఆ కారణంగా ప్రియబిడ్డలారా! ఆ గెలీలియో మతవ్యతిరేక పుస్తకాలను చదవవద్దని హితోపదేశం చేశారట. వెనువెంటనే





గెలీలియో రచనయైన "డైలాగ్" గ్రంథాన్ని నిషేధించి దాని ప్రతులను తగలబెట్టాలని ఆదేశించారట. అయితే అప్పటికే ఆప్రతులన్నీ ఆయాదేశాల్లో అమ్ముడుపోవడం జరిగింది. అనేకదేశాలు గెలీలియోను సమర్ధించాయి.

చివరకు ఫోప్ గెలీలియోపై మతద్రోహ నేరమారోపించి "ఇంక్విజిషన్" పేర వాటికన్-సిటీలో విచారణ జరిపి దైవద్రోహిగా నిర్ధారించి ఆయనపై భయంకరమైన ఒత్తిడి తెచ్చిభయపెట్టి ఈ క్రింది విధంగా నేరాంగీకార ప్రతం రాయించారట.

> **"తాను అజ్ఞానంతో, మతి భ్రమించడం వల్ల సూర్యుని చుట్టూ భూమితిరుగుతుందనీ... సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని... సూర్యునిలో మచ్చలున్నాయని... సముద్రపు అలలవిషయంలో క్రొత్తక్రొత్త సిద్ధాంతాలను తన "డయలాగ్"లో వ్రాశానని ఇది చాలాపొరబాటని, ఈ విధంగా తాను వ్రాసినందుకు తనను క్షమించాలని వేడుకుంటున్నాను" - ఇట్లు గెలీలియో.**

పై విధంగా గెలీలియో "అసత్య-సత్యాన్ని" చెప్పిన కారణంగా ఆయనకు మరణ శిక్షవిధించకుండ ఆడెబ్బది సంవత్సరాల విశాలవిశ్వ పరిశోధకుడ్ని గాడుదలశాలకన్నా ఘోరమయిన, కనీసం నిటారుగా నిలుచొనుటకు సైతం వీలులేని అలనాటి కారాగారంలో మతరక్కసులు బంధించారు. అక్కడ గెలీలియో కృంగికృశించి చెవుడుతో పాటు అంధత్వం ప్రాప్తించినా ఆయనకు కనీస వైద్యసౌకర్యం కూడ అందించలేదు. ఈ విధంగా మానసిక-శారీరక హింసలకు లోనౌతూ దయనీయమైన దుర్భరస్థితిలో తన డెబ్బది ఎనిమిదవ ఏట గెలీలియోను ఈమత చాందసం తన పొట్టనపెట్టుకుంది. అయినా వారి కక్షతీరలేదు. ఆ జ్ఞాన నేత్రానికి ఖనన సంస్కారానికి ఆరడుగుల నేలకూడ ఇవ్వబడదని మతపెద్దలు నిరాకరించారు. ఆయనను అనామకంగా వేరేచోట ఖననం చేశారట. ఈ విషయాలన్నీ తెలుసుకొన్న ఆయన అనుచరుల సంతానం 140 సంవత్సరాల తరువాత ఆయన సమాధిని కనుగొని శల్యాలను బయటకు తీసి "సాంతాక్రీస్"కు తీసికొని వచ్చి గెలీలియో కుటుంబ సభ్యులు సమాధుల ప్రక్కన పాతిపెట్టారట.

> గెలీలియో మరణానంతరం... పోప్ పాలనలోనున్న వాటికన్ సిటీలోను, ఆయన అదుపాజ్ఞలకు లోబడియున్న తదితర ప్రాంతాలందు, సూర్యుడే భూమిచుట్టూ తిరుగుతున్నాడని... పరుగులు తీస్తున్నాడని... మిగిలిన సమస్తప్రపంచ దేశాలందు సైన్సుప్రకారం భూమే పరిభ్రమిస్తుందని గెలీలియో అభిమానులు మతాధిపతులను గేలీచేయడం ప్రారంభించారు. దానిని భరించలేక బైబిల్ చెప్పినట్టుగాక సూర్యుని చుట్టూ భూమే తిరుగుతుందని వ్రాయడానికి కార్డినల్స్ అంతా సుముఖత తెలిపారట. అయినా పదమూడు సంవత్సరాల అనంతరం **1895**లో పోప్ దానిపై అంగీకారము తెలిపి అధికార ముద్రవేయడం జరిగిందట. అంటే క్రైస్తవ మతం భూమిని సూర్యుని చుట్టూ తిరగడానికి **1895**లో పర్మిషన్ మంజూరు చేసిందన్నమాట.




**సర్.థామస్ అల్వాఎడిసన్** : నేటి నాగరిక ప్రపంచానికి ఫ్లోరసెంట్ ట్యూబులైట్లు నియాన్‌లైట్ల వెలుగు జిలుగులను ప్రపంచానికి ప్రసాదించడమే గాక ఆ వెలుగు నిచ్చే బల్బును కూడ కనుగొన్నది ఈ ఎడిసన్ మహాశయుడే!

"ఫోనో గ్రాఫ్", గ్రామఫోను మొదలగు ఎన్నెన్నో సరిక్రొత్త పరికరాలను కనుగొని వాటికి 2,500 "పేటెంట్లు" పొందిన మహోన్నత జ్ఞాని ఈ అల్వాఎడిసన్. మానవ పురోగతికి, మానవ మనుగడకు, సుఖజీవరనానికి, ఆనందానికి ఇంతటి అవిరళ కృషి సల్పిన మరో వ్యక్తి ప్రపంచంలో లేడంటే అతిశయోక్తి కాదు.

ఆయన కార్యదక్షత సహనశీలత ఎంతపటిష్టమైనదో చూడిలంటే ఈ ఒక్క సంగతి చాలు. ఆయన తన యాబదిమంది సహచరులతో కరెంటు బల్బును కనుగొనుటకుగాను 1600 టెస్టులు చేశాడు. ఈ ఎలక్ట్రిక్ బల్బు ఎలా వెలిగేటట్టు చేయాలో అనే విషయసాధన కోసం ఎడిసన్ మూడువేల సిద్ధాంతాలను రూపొందించాడట. చివరకు 1879 అక్టోబరు 21వ తేదీన ఆయన అనితర కృషి ఫలించి కరెంటు బల్బు వెలిగింది. ఆ దెబ్బతో నిలువనీడలేక చీకటి మాయమయ్యింది.

సిమెంటు పరిశ్రమలో కొండలను పిండికొట్టే యంత్రానికి అంకురార్పణ చేశాడు. ఈ విధంగా చెప్పుకుంటూపోతే ఆయన ఆవిష్కరణల జాబితాల వర్ణనకు ఈ గ్రంథమేచాలదు. ఇట్టి తేజస్వరూపియైన ఎడిసన్‌పై కూడ "మత వ్యతిరేకి" అనే ముద్రవేశారు. ఆ మహనీయుని పేరును న్యూయార్కు నగరమందలి ఒక హైస్కూలుకు కూడ పెట్టనీయకుండ మతగురువులు అడ్డుతగిలారు. ఎందుకంటే ఆయన పేరున్న స్కూలులో చదివిన విద్యార్థులు కూడ ఆయనవలె నాస్తికులై పోతారని భయపడ్డారట. **నేను లోకానికి వెలుగై యున్నానని డచ్చాలు కొట్టుకొనే క్రైస్తవ మతం ప్రపంచానికి వెలుగును ప్రసాదించిన తేజోమూర్తిని ఈ విధంగా అవమానించింది.**



సర్ జేమ్స్‌యంగ్ సింప్సన్ (1811-1870) శస్త్రచికిత్స సమయాలందు మానవాళికి నొప్పి తెలియకుండ, బాధకలగకుండ నేడు మనం ఉపయోగిస్తున్న "క్లోరోఫారం" సృష్టికర్త.

ఇంతటి మహామేధావిపై కూడ క్రైస్తవ మతం దైవద్రోహ నేరమారోపించి... **యెహోవా స్త్రీతో నీ గర్భవేదనను నేను హెచ్చిస్తున్నాను. వేదనతో నీవు పిల్లలను**





**కందువుగాక! యని శపించాడని, అసలు స్త్రీయే పాపకారకురాలని బైబిల్ చెబుతూవుండగా అట్టి స్త్రీలకు పురిటి బాధలు లేకుండ మత్తుమందులిచ్చి దయ్యాలను ఆవరింపజేస్తున్నాడని మత పెద్దలతో పాటు కొందరు మితవాద వైద్యులు కూడ గగ్గోలుపెట్టారు.**

ఆ రోజుల్లో రోగులకు ఆపరేషన్ చేయుటకు వారి కాళ్లూ చేతులు బంధించి అయిదారుగురు బలిష్టులు వారిని అదిమి పట్టుకోగా మేకను కోసినట్టుగా పరపరా వారిని కోయుచుండగా ఆ రోగి పెట్టే ఆక్రందనలు, పెడబొబ్బలతో రోగి భయంకరవేదనను అనుభవిస్తుండగా చూచిన జేమ్స్‌యంగ్ సింప్సన్ కంపించిపోయాడట. దానిపై అతడు అనేక పరిశోధనలు ప్రారంభించి తన నిర్విరామ కృషి ఫలితంగా 1847 నవంబర్ 4వ తేదీన ఆయన "క్లోరోఫారం"ను కనుగొని కోటాను కోట్లమందికి "బాధా నివారణను" ఆవిష్కరించిన మహోన్నతుడు ఈ సింప్సన్.



వైద్యశాస్త్రమందు శస్త్ర చికిత్సకు అంకుర్పాణ గావించిన మహామహుడు "వెసాలియన్" మానవ మృత దేహాన్ని కోసి పరిశీలించి, స్త్రీపురుషుల ప్రక్క టెముకలు సమంగానే వుంటాయని తెలుపగా... స్త్రీకన్నా పురుషునికి ఒక ప్రక్కటెముక తక్కువగా వుంటుందని నమ్మే బైబిల్ సృష్టివాదులు వెసాలియన్‌కు వ్యతిరేకంగా అభ్యంతరాలను లేవనెత్తారు. "ఆది మానవుడుగా" చెప్పబడే ఆదాము ప్రక్కటెముకను తీసి దేవుడు స్త్రీని నిర్మించాడని బైబిల్‌లో వున్నందున పురుషులందరికి ఒక ప్రక్కటెముక తక్కువగా వుండాలని వారి వాదన.

రాజుతలస్తే దెబ్బలకు కొదవా? అన్నట్టు క్రైస్తవమత పీఠం వెసాలియన్‌కు "డిటో" నేరమారోపించి దైవద్రోహిగా నిర్ధారించి ఆయన చేసిన "పాప" విముక్తి కొరకు క్రైస్తవుల పుణ్యక్షేత్రమైన జెరుసలేం వెళ్లి పాపపరిహారం పొంది రావాలని బలవంతంగా అతనిని

పంపగా తిరుగు ప్రయాణంలో ఆ ఓడమునిగి ఆకాల మరణం చెందారు.

మానవ శరీర శాస్త్రవేత్తయైన "మైకేల్ సర్వేటర్"ను క్రైస్తవ ఛాందస వర్గాలు క్రీ॥శ॥ 1553లో సజీవదహనం చేశారు.

అంతూపొంతూలేని ఘోరమయిన రీతిలో మధ్యయుగాలనాటి రాజులు, మతాధిపతులు ఏకమై కాకమ్మకథల వంటి అశాస్త్రీయమైన, అభూత కల్పనలైన సృష్టివాదాన్ని పరమసత్యాలుగా నమ్మిసైన్సు సత్యాన్ని సమాధిచేశారు. మానవతను మంటగలిపారు. ప్రగతికి పగ్గాలు వేసి వెనక్కు నెట్టివేశారు.

**ఇంతకన్నా సిగ్గుచేటయిన చిత్రహింసలు, క్రూరత్వాలు, నరకయాతనలు... నోటితో చెప్పదానికి కూడ వెనుకాడే జుగుస్సాకర కళంకిత రాక్షసత్వాలను ఈ మతచరిత్ర తిరగవేస్తే విదితమౌతాది. ప్రత్యర్థులను సజీవంగానే కాళ్లూ చేతులు నరకడం, ముక్కు చెవులు, నాలుకలు కోసివేయడమేగాక మరింత కర్కశంగా వృషణాలు పీకివేయడం... మర్మావయాలు కోసివేయడంమే గాక మతేతరుల కన్యలను పట్టుకొని వివస్త్రలను గావించి సైనికులు వారి కాళ్లూ చేతులు పట్టుకొని ఖణఖణాకాలుతున్న ఇత్తడి పెనాలపై వారిస్తనాలను కాలుస్తూ పై శాచికానందంతో కేరింతాలు కొడుతూ మానవతకే మాయని మచ్చలు తేవడం అత్యంత లజ్జాకర విషయం ఇంతకన్నా భయంకరమైన ఉదంతాలు, దుష్కృత్యాలు ఇటలీ, ప్రాన్స్, స్పెయిన్ తదితర దేశాల్లో 19వ శతాబ్దాంతం వరకు యధేచ్ఛగా కొనసాగాయి. ఇంతటి భయంకరమైన దుష్కళంక చరిత్రను గూర్చి ప్రొటస్టెంట్ చరిత్రకారులు కళ్లకుకట్టినట్టు వివరించారు.**

**ఈ మత హింసలను గూర్చిన వివరములకు ఆధారిత గ్రంథాలు:**

I. "THE GOD OF WAR" - (Joseph Cabe)

II. HISTORY OF CONFLICT Between RELIGION AND SCIENCE - (J.W.DRAPER)

III. THE RIDDLE OF THE UNIVERSE - (ERNEST HACKEL)

## VII

ఈ విధంగా అలనాడు శాస్త్రపరిజ్ఞానం అణచివేయబడింది. సాంకేతికవిద్యలని ప్రచారంచేసి నిందించి, నిషేధించిన ఆయా మతాధిపతుల వారసులేగాక యావత్ప్రపంచ క్రైస్తవ సమాజాలు నేడు సకల శాస్త్రపరిజ్ఞానాలందు ముందడుగు వేయడం ముదావహం.





ఏదిఏమయినా ఇంతటి అమానుషంగా మతోన్మాదం – సైన్సు నోరు నొక్కేసినా... దాని గొంతుకలను నులిమి వేసినా... దాని అమూల్య గ్రంథాలను తగులబెట్టినా... సైంటిస్టులను కారాగారాల్లో బంధించినా, చివరకు సజీవదహనాలు గావించినా, సైన్సు చేతిలో క్రైస్తవం చావుదెబ్బతిని, చావుతప్పి కన్నులొట్ట పోయినా, చింతచచ్చినా పులుపు చావలేదన్న చందాన అదింకా బ్రతికేయుంది. నేటికి దాని జూలు విదిలిస్తూనే యుంది. మరింతగా విజృంభిస్తూనేయుంది. ప్రసంగికులు రెచ్చిపోతూనే యున్నారు. ఇవేమి తెలియని ప్రజలు తలతూపుచున్నారు.

**ఇంతటి కళంక చరిత్రలో మలినమయిన క్రైస్తవ మతపీఠం గత 20వ శతాబ్దాంతంలో పోప్ జాన్‌పాల్ అధ్యక్షతన ఒక అత్యున్నత కమిటీ సమావేశం ఏర్పాటుచేసి అలనాడు మధ్యయుగాల్లో మతంపేరిట జరిపించిన "దురదృష్టకర" సంఘటనలను గూర్చి సంతాపం వెలిబుచ్చి "సారీ" చెప్పేతీర్మానాన్ని ఆమోదించి చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందాన "మొసలికన్నీరు" కార్చిన విషయం చాలామందికి తెలియక పోవచ్చు ఇందండి! యీ క్రైస్తవమతం సాగించిన నిర్వాకం!**

మధ్యయుగాల్లో మానవమేధస్సు అంతగా వికసించనప్పుడు అనాగరికమయిన విషాదసంఘటనలు జరిగాయికావచ్చని సమర్థించుకొనుటకు ఎంతమాత్రము ఆస్కారములేకుండ నేటి ఆధునిక యుగాల్లో కూడ 20వ శతాబ్దాంతంలో నాగరికులైన కేథలిక్కులు తోటి సెర్బియన్ క్రైస్తవులైన 8లక్షల 50 వేలమందిని మూకుమ్మడిగా చంపారు. ఈ హత్యాకాండకు సంబంధించిన కొన్ని సజీవ ఛాయాచిత్రాలు, మరిన్ని వివరాలు "ఇది నిజమా" మూడవ భాగంలో "ఆధునిక ప్రపంచంలో దైవంపేరున జరిగిన మారణహోమం" అనే శీర్షికలో చూడవచ్చును.

ఇంతటి భయానక అత్యాచారాలన్నీ సగటుక్రైస్తవ సోదరులకు తెలియకుండా మరుగుపరచి అనునిత్యం అద్భుత కథలతో ఆశ్చర్యచకితులను గావిస్తూ యెహోవా ప్రేమామృతం ఎంత మాధుర్యమయానదో... కథలుకథలుగా వివరిస్తూ దాని వెనుక దాగియున్న కాలకూట విషంలాంటి భయంకర చరిత్రను దాటవేస్తున్నది. అభూత కల్పనలైన "యుగసమాప్తి" "నిత్యనరకాగ్ని గుండం" మొదలైన భయానక విషయాలను ప్రచారం చేస్తూ, పసిడి మనస్సులను గాయపరస్తూ సాగే ఈ బైబిల్ బోధనలను... సృష్టిని గూర్చి చెప్పబడే అశాస్త్రీయ అంశాలను శాస్త్రయుక్తంగా ఢీకొంటూ సచిత్ర–చాయచిత్ర వివరణలతో సహా మీముందంచబడుతున్న ఈ అపూర్వ పరిశోధనా గ్రంథాన్ని తరతరాలుగా వస్తున్న మీ పవిత్ర మతనమ్మకాలను కొద్ది సమయం పదిలంగా ప్రక్కనబెట్టి నిజనిర్ధారణ కోసం, మానవజాతి పురోగమనం కోసం సాహసం, సదాశయం వుంటేనే చదవండి! పిరికివారు

దీనిని చదవరు. అయితే “పిరికి వారు” దేవుని రాజ్యంలో ఎలాగూ ప్రశించరని బైబిల్ చెబుతున్నందున అట్టి పిరికి వారు కూడ దీన్ని చదివితే ధైర్యవంతులౌతారు.

## VIII

బైబిల్ విమర్శ అనేది ఎంతో కష్టతరమైన “యజ్ఞం” మతానికెదురు. దారి కడ్డం అన్నట్టు దీనికి పూనుకున్న వారికి ప్రశంసలకన్నా అభిశంసనలే ఎక్కువ. ఈ నా ప్రయత్నాన్ని అడ్డుకొనుటకు చాపక్రింద నీరులా మా ఇంటినుండే వ్యతిరేకత అంకురించింది. ఈ రచన కొరకై నా స్వహస్తాలతో చిత్రించిన ముప్పది అమూల్యచిత్రాలు గల ఆల్బమ్ నా సహధర్మచారిణి, నా దివంగత వృద్ధమాతలు కలసి 1995లో ఒక పాస్టరు సమక్షంలో “ప్రభువు సన్నిధిలో” పరచి ప్రార్థించి వాటిని దహనం చేసిన విషయం నాకు చాలా ఆలస్యంగా తెలిసింది. “మతం ప్రజల పాలిట మత్తుమందు” అనే సూక్తిని నిజం చేశారు. దానికి నేను ఎవరినీ తప్పుబట్టలేదు. నా ఆశయం నాది. నా ప్రయత్నానికెవరూ అడ్డుకట్టవేయలేదు.

చాలామంది పురుషులు తమ అభ్యున్నతికి తమతమ శ్రీమతులే కారణమంటారు. అదేమోగాని వాటిని నాశనం చేయుటద్వారా మరింత సమగ్రమైన ఉత్తమ చిత్రాలు గీయుటకు పరోక్షంగా నాకు “సహకరించిన” సతీమణి కూడ అభినందనీయురాలే!

ఈ నా ప్రచురణను గూర్చి ఎంతోమంది మాతానుసారులైన భక్తాగ్రేసరులు... మతవ్యతిరేకులతో కూడ ముచ్చటించాను. వారివారి అభిప్రాయాలు రకరకాలుగా వ్యక్తపరచారు. ఖమ్మంకు చెందిన ఒక బైబిల్ మేధావి మాట్లాడుతూ – బైబిల్ గ్రంథం వివరంగా వ్రాయబడలేదని యెహోవా తన ప్రవక్తలకు అనేక భవిష్యత్ విషయాలను బయలుపరచాడని, అలాగే యేసు అద్భుతగాథలు అనేకం ఉన్నప్పటికి బైబిల్‌నందు అవి పరిమితంగానే చోటుచేసి కొన్నాయని, అంతేగాకుండా బైబిల్ గ్రంథం మానవమేధస్సుకు అందనంతటి విధంగా గూఢార్థాలతో నర్మగర్భితంగా వ్రాయబడిందని ఈ వేదసారాన్ని అకళింపు చేసికోవడానికి మానవుడెంతటి వాడని, వాని జ్ఞానమెంతని! ఇట్టి “నాన్ డిటైల్డ్” గ్రంథాన్ని పట్టుకొని విమర్శనాస్త్రాలు గుప్పించడంలో అర్థంలేదని వాపోయారు. ఈయనెవరో అనామక చక్రవర్తి కాదు. మా నానమ్మగారి మరో “కొండమంచలి” మనవడే!

అంటే దీన్ని విమర్శించడానికి అవకాశంలేదని ఆ మేధావివుద్దేశం. ఈ ధోరణి గమనిస్తే సర్వశక్తివంతుడైన యెహోవా ఆధ్వర్యంలో తాను మానవాళికి అందజేసిన





అపురూప అమూల్య గ్రంథమైన బైబిల్ ఇంతటి అసమగ్రంగాను, సామాన్యమానవుని బుర్రకు ఎక్కనంతటి జటిలంగాను నర్మగర్భితంగాను ఎందుకు అందజేయవలసి వచ్చింది? మానవులకు అర్థంకాని ఈ దేవభాష వలన నరులకు ఒరిగేదేమిటి? మానవుని జ్ఞానం యెహోవా ఎదుట మురికి గుడ్డ పీలికల వంటివని యెషయా ప్రవక్త చెబుతుండగా – తన పోలిక చొప్పున, తన రూపమందు ఇంతటి వెర్రిబాగుల మానవుని ఎందుకు చేయవలసి వచ్చింది?



ఈ తెలివి తక్కువ మానవుడుగా చెప్పబడిన నేటి నవనాగరిక మానవుడు తాను చెప్పదలచుకొన్న సమాచారాన్ని తేటతెల్లంగాను. సమగ్రంగాను అదెంతటి విస్తృతమైనదైనప్పటికి, అది వేయి బైబిళ్లంత పెద్దదయినప్పటికి దానిని అతి సూక్ష్మమైన మైక్రోఫిలిమ్ మీదను, సి.డి.లందు, ఇటీవలి కాలంలో కేవలం వ్రేలెడంత పరికరమైన “పెన్‌డ్రైవ్”లో భద్రపరచి భావితరాల వారికి అందజేస్తూ వుండగా కనీసం బాల్ పాయెంట్ పెన్ సంగతయినా తెలియని యెహోవా బండమీద తన చూపుడు వ్రేలితో గాలిరాతలు వ్రాసి మోషేకు అందజేశాడట! పది ఆజ్ఞలు!

# మతవాదుల అభిప్రాయాలు - నా సమాధానాలు

ఈ రచనను గూర్చి దీని ప్రచురణను గూర్చి మతవాదులు... బంధుమిత్రుల అభిప్రాయాలతో పాటు వారివారి వ్యతిరేకతలను కూడ ఎదుర్కోవడం జరిగింది. కొందరికి నేనిచ్చిన సమాధానాలు కూడ ఇక్కడ పొందుపరుస్తున్నాను.


బి. థియోడోర్

ఇందు ప్రప్రథమంగా చెప్పుకోవలసింది నా రక్తసంబంధి, వరసకు కుమారుడైన బొల్లిపో థియోడోర్, కవి, రచయిత, మేధావి, నరసాపూర్ మిషన్ హై స్కూల్ విశ్రాంత అధ్యాపకుడు ప్రేమానురాగాలతో పాటు మందలింపు ధోరణిలో మాట్లాడుతూ...

మన మీ క్రైస్తవ మతంలో మన తాత ముత్తాతలు, నానమ్మల కాలం నుండి కొనసాగుచున్నాము. ఇది మన జీవిత గమనాన్ని సన్మార్గంలో నడిపిస్తూ మన అభ్యున్నతికి కారణమైన విషయం కాదనలేము. ఒకసారి బాగా ఆలోచించి చూడు. మహామేధావులైన పాశ్చాత్య దేశాల వారు కూడ ఈ మతాన్నే స్వీకరించారు. వారే మనకన్నా అనేక విధాల అభివృద్ధి పథంలో పయనిస్తూ అనేక నూతనావిష్కరణలను మానవాళికి అందిస్తున్నారు. ఇదంతా దేవుడిచ్చిన జ్ఞానం కాదా! మన తాతముత్తాతలు, నానమ్మలు త్యాగధనులై వారివారి జీవితాలను దీనికి సమర్పించుకోలేదా? నీవెందుకిలా తయారైయ్యావు! ఇప్పుడయినా సమయము మించిపోయిందేమీలేదు. మన ప్రభువు తప్పక క్షమిస్తాడు. నీకున్న బైబిల్ పరిజ్ఞానంతో క్రైస్తవ మాసపత్రికలందు కథలు, వ్యాసాలు రచిస్తూ ప్రచురిస్తూయుంటే నీ జన్మసార్థకమౌతుంది. ఈ నీ జీవిత చరమాంకంలోనైనా ప్రభుని బిడ్డగా జీవించమని ప్రేమసలహాలనిస్తూ... నేను మౌనంగా వుండడం చూచి ఒక్కసారిగా ఆవేశానికి గురియైయ్యాడు.

నీవు మన తల్లిదండ్రులు పెట్టిన పేరును మార్చుకొని, ఒక దైవవ్యతిరేకి పేరును తోకలా తగిలించుకొన్నావు. నీ చిత్రకళా ప్రదర్శనల ద్వారా నీకెంతోమంది "సెలబ్రెటీ"లతో సత్సంబంధాలుండ వచ్చును. పెద్దపెద్ద సినిమా యాక్టర్లతో తిరుగుతున్నానను కుంటున్నావేమో! మేమంతా అజ్ఞానులమని నీవు తలంచవచ్చు. నిన్ను సైతాను పూర్తిగా ఆవరించింది. చివరకు నీగతి నిత్యనరకాగ్ని గుండమేనని కటువుగా విమర్శించాడు. ఈనా కుమార రత్నం ఈ సెప్టెంబర్ 2012వ సంవత్సరాంలో ప్రకృతి సహజంగా కన్నుమూశారు. ఇదంతా నామీదున్న ప్రేమానురాగాలే. మతాభిమానం ఈ విధంగా పలికించడం సహజమే. దీనికి ఎవరినీ తప్పుబట్టలేము.





# "బ్రదర్! మీరు చెప్పేది సైన్సు కాదు - హేతువాదం"

ఒక సోదర తుల్యుడు మెకానికల్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నారు. వారి యావత్తు కుటుంబం విద్యాధికులు. దీర్ఘకాలానంతరం వారు మమ్ముని కలుసుకున్నారు. ప్రేమానురాగాలు బంధుప్రీతిగల కుటుంబం వీరిది. ఆ దినంలో కొన్ని గంటలు సరదాగా కాలక్షేపం చేశాము. అనంతరం నేనువారికి నా ఇదినిజమా? పైలెట్-ఎడిషన్ పుస్తకం బహూకరించాను. అనుకొనని విధంగా మేము పదిరోజులైనా గడవక ముందే ఒక ఫంక్షన్‌లో తిరిగి కలుసుకున్నాము. ఆ సందర్భంలో బ్రదర్! నేను మీకిచ్చిన పుస్తకం చదివారా? అని అడిగాను. అందుకాయన చదివానుగాని ఈ విషయంలో నేను మీతో ఏకీభవించలేను. మీరు ఏమీ అనుకోనంటే నా అభిప్రాయం చెబుతానని ఈ క్రింది విధంగా చెప్పసాగారు. బ్రదర్! మీ ఆలోచనల ప్రకారం అందుచాలా విషయాలు చర్చించారు. అయితే ఇందు మీరు చర్చించిన ఈ "సబ్జెక్ట్" మానవ మాత్రులకు సంబంధించిన విషయం ఎంతమాత్రము కాదు. సర్వోన్నతుడు, మహోన్నతుడైన యెహోవా దేవుని గూర్చి మనము చర్చించుటకు ఏ పాటివారము? నర్మగర్భితమైన దేవుని కార్యాలు మానవుని సామాన్యజ్ఞానానికి అందనంతటి మర్మమైనవి. ఉన్నతమైనవి. ఆకారణంగా నేను మీ వాదనలతో ఏకీభవించలేను. ఆద్యంతరహితుడు, సృష్టికర్తయైన దేవుని శక్తియుక్తులను, ఆయన పరిశుద్ధతను ప్రశ్నించే అవకాశములేదని చెప్పడం జరిగింది.

అందుకు నేనువారికి సమాధానమిస్తూ బైబిల్ ప్రకారం యెహోవా సకల జగత్తును, విశాలవిశ్వాన్ని, జంతుజాలాన్ని, ఆదిదంపతులను కేవలము ఆరుదినాల్లో ఆరువేల సంవత్సరాల క్రితమే సృష్టించాడని బైబిల్ చెబుతుంది. ఈ ఆరువేల సంవత్సరాలనే మాటకు "ఆదిలోనే హంసపాదు" అన్న చందాన ఇది శాస్త్రవిరుద్ధమైన విషయంగా వీగిపోక తప్పదు. సైన్సు ప్రకారంగా యావత్ ప్రపంచం, విశాలవిశ్వం బైబిల్ చెబుతున్న విధంగా "నిన్నమొన్న" అనగా ఆరువేల సంవత్సరాలకు పూర్వమే సృష్టించబడిందని చెప్పడం సైన్సుకు విరుద్ధమైన విషయమని, ఇది ఆవిర్భావం చెంది కోటానుకోట్ల సంవత్సరాలైయ్యిందని శాస్త్రవిజ్ఞానం మనకు సాక్ష్యాధారాలతో సహా రుజువులు చూపుతుంది. మిత్రమా! మీరు సామాన్యులు కాదు. విద్యాధికులైన మెకానికల్ ఇంజనీరుగా కొనసాగుచున్నారు. అధ్యతనభావిలో మీవంటివారు మరింత శాస్త్రపరిజ్ఞానం సంతరించుకొని మరిన్ని ప్రయోగాలు సల్పి నూతనావిష్కరణలను ఆవిష్కరించే అవకాశాలు వుండవచ్చు. ఒక యంత్రం దైవశక్తితో పనిచేస్తుందంటే మీరు ఎంతమాత్రము నమ్మరు.

అలాగే కొన్ని విషయాలు నిజమని బైబిలు చెప్పినంత మాత్రాన వాటిని కూడ నమ్మరు. ఉదాహరణగా శూరుడు పరుగెత్త నుల్లసించునట్లు (సూర్యుడు) తన పథమందు పరుగెత్త నుల్లసించుచున్నాడు. అతడు ఆకాశము ఈ దిక్కునుండి బయలుదేరి ఆదిక్కు వరకు దాని చుట్టూ తిరుగుచున్నాడు. అన్నవాక్యం పరిశుద్ధ గ్రంథం చెబుతున్నప్పటికి ఈ కాలంలో మీరు నమ్మరుగాకనమ్మరు. తిరిగేది సూర్యుడుకాదని భూమే సూర్యుని చుట్టూ తిరుగుతుందని పై విషయాన్ని నిర్ద్వందంగా ఖండిస్తారు. కాని ఈ నిజమే మధ్యయుగాల్లో బ్రూనోవంటి మహోన్నత శాస్త్రవేత్తలను దైవదూషకులుగా చిత్రించి కౄరంగా హింసించి చంపింది.

అయితే పాతనిబంధనలో చెప్పబడిన విశ్వసృష్టి 6వేల సంవత్సరాలు క్రితమే సృజించబడిందని మీవంటి బుద్ధి జీవులతో పాటు అనేకమంది క్రైస్తవ వైజ్ఞానికులు నేటికీ విశ్వసించడం మనము చూస్తాము. అయితే శాస్త్రవిజ్ఞానం ఏమంటుంది? భూమ్యాకాశాలు కోట్ల సంవత్సరాలకు పూర్వమే ఆవిర్భావం చెందాయని, భూమిమీద మానవ మనుగడ లేనప్పుడే సంభవించిన భూకంపాల్లో అరణ్యాలకు అరణ్యాలే భూగర్భంలోకి దిగిపోయి అనేక రసాయనిక మార్పులు చెంది నేడుమనము ఉపయోగించే రాక్షసిబొగ్గుగా లభ్యమౌతుందనేది పరమసత్యం. అదే విధంగా అలనాటి భూగర్భంలో సంభవించిన అనేక "కెమికల్-చేంజెస్" కారణంగా నేడు మనకు వెండి, బుగారము, రాగి, ఇత్తడి తదితరలోహసంపద, భారతైలాలు, సహజవాయువులు మొదలైన అపారభూగర్భ వనరులు మనము వినియోగించుకుంటున్నాము. మనము చదివే ఉన్నత చదువుల్లో ఇట్టి విషయాలన్నీ మనకు బోధించబడుచున్నాయి. ఇట్టి సాంకేతిక శాస్త్రవిజ్ఞానం ఆధారంగా నేడు మనం సుఖమయ జీవనం గడుపుచున్నాము. అయితే మనము ఇట్టి శాస్త్రపరిజ్ఞానాన్ని ధిక్కరించి బైబిల్ చెప్పిందే నిజమని భూమి బల్లపరుపుగా వుందని... సూర్యుడే భూమిచుట్టూ తిరుగుచున్నాడని, సైన్సును ధిక్కరించి మొండిపట్టుపడితే మానవ జీవనం ఎంతటి దయనీయంగా సాగేదో వేరేచెప్పనవసరం లేదు.

ఈ బైబిల్ మనకు అనేక అశాస్త్రీయ విషయాలను బోధిస్తుంది. భూమ్మీద పట్టుమని పదిమందియైనా లేనప్పుడే కయీను వ్యవసాయం చేసినట్టు, హెబెలు గొర్రెలపెంపకం సాగించినట్టు... వీరి కుటుంబాలు అనతి కాలంలోనే గనులు త్రవ్విలోహాలను వెలికి తీయడము, పనిముట్లు చేయడము, బంగారు వెండి ఆభరణాలు ధరించడము మొదలైన అభూతకల్పనలను నాటి ఆటవిక రచయితలు గ్రంథస్తం చేశారు. రాగల పేజీల్లో పై విషయాలను గూర్చిన శాస్త్రీయ వివరణలను మనము చూడవచ్చును. బైబిల్లో చెప్పబడిన





సృష్టికార్యం జరిగిందని చెప్పబడిన నాటికే మన అఖండ భారతదేశంలోని "హరప్పా, మొహంజోదారో"లందు మహోన్నతమైన మానవ నాగరికత విలసిల్లినట్టుగా పురావస్తుశాఖ త్రవ్వకాలందు సాక్ష్యాధారాలతో సహా బయల్పడ్డాయని నేను వారికి వివరించ ప్రయత్నించినా వారు నమ్మకుండ మీరు చెప్పేదంతా హేతువాదమని అది సైన్సుకాదన్న విధంగా వారి వాదనను సమర్ధించుకో ప్రయత్నిస్తూ యెహోవా దేవుని యొక్క సామర్థ్యం ఎంతటి ఉన్నతమైనదో వివరించుటకు మరో విషయాన్ని చెప్పారు.

మీరు - భూమ్యాకాశాలు సమస్తము సృష్టించబడి కోట్లాది సంవత్సరాలైయ్యిందంటున్నారు కదా! అయితే కావచ్చునేమో! సర్వాంతర్యామియైన యెహోవా దేవుని దృష్టికి ఒకదినము వేయి సంవత్సరములగాను, వేయి సంవత్సరాలు ఒక దినముగాను సమానమని బైబిల్ చెబుతుందని, ఆ కారణంగా సృష్టికార్యం సుమారు ఆరువేల సంవత్సరాల క్రితమే జరిగినట్టు బైబిల్ వివరించినందున యెహోవా దృష్టిలో ఒక దినము వేయి సంవత్సరాలు కాబట్టి ఆరువేల సంవత్సరాలకు లెక్కకడితే 6000×360×1000 ప్రకారము లెక్కకడితే లక్షలాది సంవత్సరాలు అవ్వవచ్చుననే భావనతో వారీ "ఒక దినము - వేయి సంవత్సరాల" కథనం చెప్పారేమో అనుకోవలసివస్తుంది. బైబిల్లో వ్రాసినంత మాత్రాన ఇవన్నీ యథార్థాలు కావుకదా! ఇంతకు ముందుమనము చూచిన సూర్యగమన వృత్తాంతము సర్వాబద్ధమని తేలిపోయింది. ఆ విధంగానే ఒక దినము ఆయనకు వేయి సంవత్సరాలతో సమానమనేది కూడ అక్షర సత్యంగా మనము ఎలా భావిస్తాము? అయినప్పటికి విద్యాధికులైన క్రైస్తవ విశ్వాసులు కూడ ఇట్టి కల్పితగాథలను నమ్మడమేగాక వీటిని ప్రచారము చేయడం సమంజసం కాదు. అయినప్పటికి క్రైస్తవ సోదరుల హృదయాలు ఇట్టి అశాస్త్రీయ వాగ్దానాలతో నిండిపొర్లి పారుతూవుంటాయి.

ఇప్పటి వరకు మనము చూచిన "ఒక దినము - వేయి సంవత్సరాల" అద్భుత కథనం గూర్చి ఆలోచించగా బైబిల్ అంతా తిరగేసినా యెహోవా ఒక్కదినం - వేయి సంవత్సరాలుగా సాగదీసిన సందర్భం ఎక్కడా కనబడదు. ఇట్టి ప్రయోగం అటు యెహోవాకు గాని, ఇటు ప్రజలకు గాని చిన్నమెత్తు ప్రయోజనం చేకూర్చలేదు. ఇది ఒక్క పిచ్చి ఆలోచన మాత్రమే! ఒకవేళ యెహోవా ఈ విధంగా ఎప్పుడయినా ప్రయోగం చేసి చూచాడనుకుందాము. అప్పుడు 500 సంవత్సరాలు పగలు 500 సంవత్సరాలు రాత్రిగా జరగడం అసంభవం. అదిగాకున్నా యెహోవాకు ఉదయాస్తమయాలు అసలు ఎలా జరుగుతున్నాయో ఎంతమాత్రము తెలియదు. సూర్యుడే వగర్చుకొంటూ పరుగులు

పెడుతూ భూమండలం చుట్టూ తిరుగుతూ ఉదయాస్తమయాలు కలిగిస్తున్నాడనుకుంటాడు. ఒకసారి ఈ యెహోవా యొక్క ఒక వెర్రిబాగుల ప్రవక్తయైన యెహోషువా ఒకదినమెల్లా చీకటి పడకుండ సూర్యగమనాన్ని ఆపి వేయవలసిందిగా యెహోవాకు మొరపెట్టగా వెనువెంటనే యెహోవా సూర్యుడ్ని గిబియోనులోను, చంద్రుడిని అయ్యాను లోయలోను నిలిపివేసి చీకటి పడకుండా చేశాడట. పాపమీ "సృష్టికర్త" భూమండలమే సూర్యుని చుట్టూ తిరుగుతుందన్న విషయమే తెలియని అమాయకుడా? ఇంతటి అమాయక దేవుడు సృష్టికర్తగా క్రైస్తవ మేధావులు ఎలా నమ్మగలగుతున్నారు? తిరగని సూర్యుడ్ని యెహోవా నిలిపివేయడమనేది ఎంతటి హాస్యాస్పదమైన విషయం? సూర్యుడు సర్వకాల సర్వావస్థల్లోను నిలిచేవుంటాడు. ప్రదక్షణాలు చేసేది మన "భూమయ్య" గారు మాత్రమే కదా! ఇదంతా విన్న సోదరుడు. ఈ విధంగా అనేక విషయాలు విడమరచి చెప్పినా నరనరాన క్రైస్తవ్యం జీర్ణించుకుపోయిన సోదరుడు అంతగా స్పందించలేదు.

మా ఇంజనీర్ బ్రదర్ పై చర్చను లేవనెత్తి అనవసరంగా యెహోవా పరువుతీయించారు. ఏది ఏమైతేనేమి వీరి ద్వారానే ఒక ఆసక్తికరమైన చర్చ "ఇది నిజమా" పాఠకులకు అందించినందుకు కృతజ్ఞతలు. దీనిని గూర్చి మనము ఎవరిని తప్పుబట్టవలసిన పని ఎంతమాత్రములేదు. క్రైస్తవ కుటుంబాల్లో ముక్కుపచ్చలారని పసివయస్సు నుండి సండేస్కూళ్ల ద్వారాను, ఆదివార ప్రసంగాలందు, తదితర టి.వి.ఛానళ్ల ద్వారాను ఇట్టి అద్భుత కథనాలను ఊదర గొడుతూ మన మస్తిష్కాలను పనికి మాలిన చెత్త ప్రసంగాలతో నింపి మనల్ని క్రైస్తవ అంధవిశ్వాసులుగా తీర్చి దిద్దడమే కారణం. ఈ కథనాన్ని నేను ఈ 21వ శతాబ్దంలో వ్రాశాను గనుక బ్రతికి పోయాను. ఇదే మధ్యయుగాల్లో వ్రాసియుంటే నాటి మతచాందసం నన్నుదైవ ద్రోహి గాముద్రలేసి సజీవ దహనం గావించి వుండేది! బ్రదర్ ఎప్పుడైనా కాస్తతీరిక చిక్కితే ఈ విషయాలను మరొక్కసారి చదవండి.





# మరో విద్యాధికురాలి శాస్త్రీయ సందేహం



మరో విద్యాధికురాలైన క్రైస్తవ సోదరి, నా సమీప బంధువురాలు నాతో ప్రేమ పూర్వకముగా తర్జన భర్జనలు చేస్తూ అన్నా మీరు సృష్టికార్యము అబద్ధమంటున్నారు. దేవుడు అబద్ధమంటున్నారు. ఒక్కసారి ఈ విషయం గమనించండి. యావత్ ప్రపంచ మానవుల హస్త ముద్రలు, మరి ముఖ్యంగా వ్రేలి ముద్రలు ఒకరితో మరొకరికి సంబంధముండదు. అవి నిజంగా దేవుని సృష్టి కాకుంటే వివిధ రకాలుగా ఎందుకుంటాయని దీనికి సమాధాన మీయాలని సవాలు విసిరారు. అందుకు దీనికి ఉదాహరణగా తల్లి గర్భంలోనున్న శిశువు తన కాళ్లూ చేతులు ముడుచుకొని గుపెళ్లను బిగించుకొని నెలల తరబడివుంటాడు. ఈ క్రమంలో చేతులు మడతలు పడి ఆమడతల్లో రేఖలు ఏర్పడడం సహజం. అవే వ్రేలిముద్రలుగా రూపొందుతాయి. అదంతా ఎందుకు? మనమొక్క చింతచెట్టు ఆకులను పరికించిచూస్తే దానికున్న కోట్లాది ఆకుల యొక్క రేఖల అమరిక ఒక ఆకుతో మరో ఆకుకు సంబంధముండదట. ఆ విధంగానే అనేక వృక్షాల ఆకులు కూడ ఒక ఆకును పోలిన విధంగా మరో ఆకురేఖలు వుండవట. ఇది ప్రకృతి సహజం. అంతేగాని ఏ దేవుడు అరణ్యాలలో ప్రవేశించి, లేక తల్లి గర్భంలో దూరి వ్రేలిముద్రలను, ఆకులరేఖలను దిద్దుతూ కూర్చోడనే విషయం మనము గమనించాలి. అసలు ఈ వ్రేలిముద్రలు ఆధారంగా చెప్పబడే హస్తసాముద్రికం అశాస్త్రీయమైన అర్ధరహితం. ఇది స్వార్ధపరుల దుష్టపన్నాగం.



అనంతరం ఈ సోదరే మరోజఠిలమైన ప్రశ్న సంధించారు. అదేమంటే మీవంటివారు చెప్పే మానవ పరిణామ క్రమంలో మానవుడు కోతినుండి ఆవిర్భావం చెందాడని చెబుతారు. అయితే నేడు మనముందు అనేక కోతి జాతులున్నాయి. అట్టి కోతులకు కోతిపిల్లలే పుడుతున్నాయి గాని మనిషిపిల్లలు ఎందుకు పుట్టడంలేదో వివరించాలని కోరారు. నిజానికిది జ్ఞానయుక్తమైన ప్రశ్నే!



అయితే పరిణామ క్రమం అనేది నేడు మనము చూస్తున్న పండుకోతి, కొండముచ్చి, చింపంజీ, గోరిల్లాల నుండి కాదని చాలామందికి తెలియదు. అలనాడెప్పుడో "హెూమోఎరక్టస్" అనే వానరజాతి నుండి పరిణామ క్రమంలో మానవజాతి అవతరించినట్లుగా పరిణామ వాద సిద్ధాంత కర్తలు వివరిస్తున్నారు. హెూమోఎరక్టస్ అనే పేరులోని మొదటి రెండక్షరాలనుండే "హ్యూమన్" అనే పదం వచ్చినట్టు చెబుతున్నారు. ఈ విధంగా పరిణామం చెందుటకు కోట్లాది సంవత్సరాలు పట్టిందని కాలక్రమంలో రాక్షసబల్లులు అంతరించిన విధంగా ఆ హెూమోఎరక్టస్ జాతి వానరాలు కూడ అంతరించిపోయాయని ఆ కారణంగానే నాటి ఆది మానవుల రూపురేఖలు మృగప్రాయంగా ఉన్నాయని కాలక్రమంలో లక్షలాది సంవత్సరాల అనంతరం నేటి నాగరిక మానవుడుగా రూపుదిద్దుకొన్నట్టు చెప్పబడుతుంది. సోదరి ప్రశ్నించినట్టుగా హెూమోఎరక్టస్ జాతి అంతరించిపోయి కనుమరుగైన కారణంగా ఆ వానర జాతి నుండి ఆది మానవాకృతులు క్రొత్తగా జనించుటలేదని గ్రహించవలసిందిగా మనవి చేయుచున్నాను.



జీవపరిణామం జరిగిందనడానికి మనకళ్లెదుట అనేక విషయాలు నేటికీ కనిపిస్తున్న రుజువులను గూర్చి ఒకసారి పరిశీలించండి. మానవ పిండం మొదటి దశలో చేపపిండంలాగను, అనంతరం ఉభయచర జీవులపిండంలా, ఆపైన సరీసృపాల పిండంలాగుండి, చివరకు పాలిచ్చే జంతువుల పిండలక్షణాలను సంతరించుకొంటుంది.





మానవుల పూర్వీకులకు ఒకప్పుడు తోకలున్న కారణంగా మానవపిండానికి అయిదవ వారంలో తోకవుంటుంది. 8వ వారంలో తోక మాయమైపోయినా దానికి సంబంధించిన ఎముకలు కండరాలు నేటి మానవునిలో కూడ దర్శనమిస్తూనే వుంటాయి.

మానవుని పూర్వీకులకు ఒకప్పుడు ఒంటినిండా వెంట్రుకలుండేవి. ఫలితంగా మానవపిండానికి ఏడోమాసంలో శరీరమంతా దట్టంగా మృదులైన వెంట్రుకలు కనిపిస్తాయి. జననానికి ముందుగాని, అనంతరంగాని ఈ వెంట్రుకలు రాలిపోతాయి.

మానవుల పూర్వీకులైన జంతువులు తమ చెవులను ఆడించగలిగేవి. నేడు మనము మన చెవులను ఆడించలేకపోయినా అందుకు అవసరమైన కండరాలన్నీ మనకున్నాయి.



వానరజాతి సంతానం వాటి చేతి వ్రేళ్లతో తల్లిపొట్టను, చెట్లకొమ్మలను పట్టుకొని వ్రేళ్లాడే గుణం కలిగివుంటాయి. ఈ వారసత్వం మనిషిలో కూడ కనిపిస్తుంది. పసిపాపలకు మనం ఒక వ్రేలు అందిస్తే దాన్ని పట్టుకొని వేళ్లాడగలగడానికి కారణం ఇదే! కోతులకు మనుష్యులకు "పొంగు" వ్యాధివస్తుంది. అలాగే ఇరువురికి పేలుపట్టడం కూడ మామూలే!

జీవప్రపంచంలో మనిషి కొక్కడికే "ఆత్మ" వుంటుందని భావించిన "డేకార్ట్" మనిషిలో మాత్రమే "పీనియల్ గ్రంధి" వుంటుందని విశధీకరించారు. అయితే ఆ పీనియల్ గ్రంధి మనుషులలోనే కాక వెన్నెముక గల జీవులన్నింటిలోను వుందని, ఇట్టి ఫీనియల్ గ్రంథిని తొలగించినా మనిషికి ఏ రకమైన హాని జరగదని తెలిసింది. ఇది పరిణామ వాదంతో సంక్రమించిన అవయవమే అయివుండాలి. మనుషులు, కోతులు, ఆవులు, గుర్రాలు, పందుల వంటి జంతువు రక్తం కొద్దిపాటి తేడాలతో ఒకేరకమైన ఇన్సులిన్ తయారు చేసేవారు. గతంలో మధుమేహ వ్యాధి పీడితులకు పై జంతువుల రక్తం నుండే "ఇన్సులిన్"ను తయారు చేసేవారు.

మనుష్యులకు "సి" విటమిన్ అత్యంత ఆవశ్యకం. పండ్లుతిని జీవించే జంతువుల నుండే మనిషి రావడము వల్లనే మనిషికి 'సి' విటమిన్ అవసరం కానవస్తుంది. అందువల్లనే విటమిన్-సి జంతువులకు అవసరం అంతగా లేదు.

మరో ముఖ్యమయిన విషయం మనిషికి కోపం వచ్చినపుడు జంతువుల వలెనే పళ్లికిలించి ముఖాన్ని, పళ్లను, నోటిని వికారంగా పెడతాడు.

ఒక శాస్త్రీయ అవసరానికి జంతువులకు "క్రిమిక" అనే అపెండింక్స్ పెద్దప్రేవులకు అల్లం ముక్కలా అతుక్కొని వుంటాది. అది మనిషికి అపెండిక్స్ వ్యాధికి కారణమౌతాది తప్ప దానివల్ల వేరే ఉపయోగాము లేదు. అపెండిక్సును తొలగించినా మనిషికి ఏ విధమైన ఇబ్బంది కలగదు. అయితే ఆకులలమలు, గడ్డి తినే జంతువులకు నేరుగా వాటిని జీర్ణంచేసికొనే శక్తి లేనందున ఆ వాయు బ్యాక్టీరియా ముందుగా సెల్యూలోజ్‌ను "గ్లూకోజ్"గా మార్చిన అనంతరం ఆ గ్లూకోజును జంతువులు ఆహారంగా ఉపయోగించుకుంటాయి. వాటి వారసత్వంగా పరిణామం చెందిన మనిషికి నేడు ఆకులలమలు గడ్డి ఆహారకోశపు సంచి అవశేషమే అపెండెక్సుగా నేడు మనకు మిగిలివుంది. జంతువుల ముందు కాళ్లు మనుషులకు చేతులు గాను, పక్షులలో రెక్కలుగాను ఆయా జీవుల అవసరాలకు అనుగుణంగా మార్పులు చెందాయి. మరికొన్ని కోట్ల సంవత్సరాల అనంతరం నరరూపం ఎలామారిపోతుందో చెప్పలేము.

మంటితో చేయబడిన ఆది మానవులు, ఏదేను తోటలో ఆజ్ఞాతిక్రమణ, అపవాది పాత్ర, రక్షణమార్గం, యుగసమాప్తి, స్వర్గం, నరకం లాంటి కాల్పనిక జగత్తులో తమతమ మస్తిష్కాలను నింపుకున్న ఇట్టి వారికి పై సందేహాలు రావడము సహజమే! ఈ నేపథ్యంలో ఈ భావితరాలు మోకరించి వేడుకుంటూ ఎదురుచూచిన ప్రభువు రాకడరాదనేది పరమ సత్యం. మన తాత ముత్తాతలైన "హొమోఎరక్టస్" లకు హేట్యాఫ్! పై ప్రశ్నకు సమగ్రమైన జవాబు "ఇది నిజమా!" రెండవ భాగంలో మరిన్ని వివరాలు ఇవ్వబడుతాయి.

*** *** ***

**ఒక సందర్భంలో మరో క్రైస్తవ భక్తురాలు చిరుకోపంతో చిన్నగా చిందులు ద్రొక్కుచూ క్రైస్తవ దేవుళ్లనే విమర్శిస్తున్నారెందుకు? ఇతర మతాల దేవుళ్లను ఎందుకు విమర్శించరిని నాపై అక్కసువెడల గ్రక్కారు.**

అందుకు నేను సమాధానమిస్తూ మీకు క్రిస్టియానిటీ మీదనున్న భక్తిశ్రద్ధలతో అలా మాట్లాడుచున్నారు. మీకు బైబిల్ తప్పమరే ఇతర సాహిత్యము చదివే అలవాటు లేదనుకుంటాను. పాశ్చాత్య భాషల్లోను, మన తెలుగు, తదితర భాషల్లోను అనేక విమర్శనా గ్రంథాలు వచ్చాయి. ప్రముఖ రచయిత్రి ముప్పాళ్ల రంగనాయకమ్మ "రామాయణ విషవృక్షం"అనే గ్రంథాన్ని రచించారు. మన కాలంలోనే కాక చార్వాకుల కాలం నుండి హిందూ మతగ్రంథాలపై అనేక విమర్శలు వచ్చిన విషయం మీకు ఎంతమాత్రము తెలియదులాగుంది. అదిగాకున్నా మీరు అనునిత్యం బైబిల్‌ను పారాయణం చేస్తున్నా కీర్తన గ్రంథంలో దావీదు మహారాజు ఇతర మతాలపై చేసిన ఘాటు విమర్శలనైనా చూడలేదనుకుంటున్నాను. నన్నుమీరు చేయమని చెప్పుచున్న విమర్శలు బైబిల్ నందే ఎలాగున్నాయో కాస్త చూచి ఆనందించండి!





అన్యదేవతలను గూర్చి (కీర్తనల గ్రంథం 115:4-8) వరకుచూస్తే... (అన్యదేవతా విగ్రహాలకు) కనులుండి చూడలేవు, నోరుండి మాట్లాడలేవు!, చెవులుండి వినలేవు, చేతులుండి ముట్టుకొనవు, కాళ్లుండి నడవలేవని... అవి బంగారు, వెండి, లోహ విగ్రహాని రాతి ప్రతిమలని ఎద్దేవా చేస్తూ వ్రాసిన వాక్యాలు బైబిల్‌నందు చాలాచోట్ల కనబడతాయి. ఇకనైనా బైబిల్‌ను ఆసాంతం చదివి ఆనందించండి. నాకున్న బైబిల్ అనుభవము ప్రకారం నేను ఈ గ్రంథాన్ని వ్రాయుచుండగా ఇతర దేవుళ్లను ఎందుకు విమర్శించరని అక్కసుతో ఉచిత సలహాలీయడం సబబుకాదు. "గురివిందకు" తనక్రిందనున్న నలుపు రంగును గుర్తించదనే సామెత గుర్తుకొస్తుంది. మీరు పెద్దవారు మీ మాటకాదంటే అంత బాగుండదని మీ తృప్తి కోసం "యమగోల" వంటి వినోదాత్మక కథనాల కోసం నేను చిత్రించిన చిత్రాన్ని, దానికొరకై వ్రాసియుంచిన "స్క్రిప్టను" మీ వంటి వారికొరకై ఇక్కడ పొందుపరుస్తున్నాను. చూడండి! చూచి ఆనందించండి! (ఇది కేవలము హాస్య భరిత రచన మాత్రమే!) అయితే ఈ కథవిని మీరు చాలా ఆనందించవచ్చు. కాని దీని ముగింపు క్రైస్తవ దేవుళ్ల పరువు తీసే అవకాశాలు చాలా ఎక్కువగా వున్నాయి. జాగ్రత్త!



ఇది హిందూ పురాణాల్లో చెప్పబడిన మానససరోవరం. నేడిది చైనా ఆధీనంలోని "టీబెట్"లో వుంది. అర్ధరాత్రి దాటిన తరువాత ఇంద్ర లోకంనుండి అప్సరసలు వచ్చి ఈ సరోవరంలో జలకాలాడతారని హిందూ పురాణాలు వివరిస్తాయి. అట్టి సమయాలందు ఆకాశంలో రంగురంగుల కాంతులు విరజిమ్ముతాయని చెప్పబడింది. చైనా ప్రభుత్వం ఇప్పుడు దీనినొక పుణ్యక్షేత్రంగా చేయుటకు రోడ్లు, తదితర సౌకర్యాలు కలిగించి పర్యాటకులను ఆకర్శిస్తుంది.

ఒకసారి ఇంద్ర లోకమందలి అప్సరసల్లో ముఖ్యులు దేవేంద్రుని యొద్దకు వెళ్లి తామొకసారి భూలోకం సందర్శించి రావాలని తలస్తున్నాము. మాకు కొద్దిరోజుల పాటు వెళ్లి వచ్చుటకు అనుమతి కావాలని విన్నవించారట. అందుకు ఇంద్రుడు వారి అభ్యర్థనను తిరస్కరిస్తూ – మన ఇంద్రలోకానికి ప్రముఖులైన భక్తాగ్రేసరులు చాలమంది రానున్నారని వారిని మీరు వేయిహంసల విమాన మెక్కించుకొని ఆనందడోలికల్లో ముంచి తేల్చాలని, ఇంతలో కుదరదని సమాధానమిచ్చాడు. అయినా మిమ్ములను గతంలో చాలాసార్లు విశ్వామిత్ర తపోభంగం మొదలైన కార్యాలకు పంపుతూ వచ్చాను కదా! ఇంకా క్రొత్తగా భూలోకాన్ని చూచేదేముందని వివరించాడు.

అందుకా అప్సరసలు బదులిస్తూ నాడుమీరు మమ్మును కాకులుదూరని కారడవి... చీమలు దూరని చిట్టటవీ ప్రాంతాలకు పంపారు. పనిముగించికోని నేరుగా మేము ఇక్కడికి వచ్చేశాము. అయితే నేడు భూలోకం అంతా "హైటెక్" అయిపోయిందని ఎంతోమంది భక్తజనాలు మాతో చెబుతున్నారు. అని విన్నవించినా అదేమి కుదరదని ఇంద్రుడు వారి అభ్యర్ధనను మన్నించలేదట.

అంత తిలోత్తమ అనే సీనియర్ మోస్ట్ అప్సర ముందుకు వచ్చి దేవరా! మాపై మీరంతగా కోపించకండి! యుగయుగాలుగా, మన్వంతరాలుగా, కోటానుకోట్ల సంవత్సరాలుగా మీ ఆదేశాలను మేము తిరస్కరించి ఎరుగము కదా! మీరు మరీకాదంటే విధిలేని పరిస్థితిలో మేమంతా "టూల్-డౌన్ స్రైక్" చేయవలసి వస్తాదని బెదిరించిందట. ఆ దెబ్బతో దేవేంద్రుడు ఖంగుతిని అమ్మో సమ్మెలంటే మామూలు కాదు. ఇటీవల తెలంగాణా ప్రాంతంలో జరిగిన "సకలజనుల సమ్మె" మనసులో మెదిలింది. రాష్ట్రమంతా చిమ్మచీకట్లు అలుముకున్నాయి... ప్రయాణసౌకర్యాలు లేకుండాపోయాయి... కార్యాలయాలు మూతపడ్డాయని మనసులో అనుకొని... అసలు యీసమ్మెలు – బందుల సంగతి మీకెవరు చెప్పారని అడిగాడు. మాకు చాలాకాలంగా వీటిని గూర్చి తెలుసు. మన యొద్దకు వామపక్ష నాయకులైన ఎస్.కె. డాంగే, పుచ్చలపల్లి సుందరయ్య, నక్సల్ నాయకులు కనూసన్యాల్... "సురేష్"గా పిలవబడిన మేకల రాజలింగు, "కిషన్‌జీ" అనబడిన – మల్లోజుల కోటేశ్వరరావు మొదలైనవారు సమ్మెలతో ఎటువంటి కార్యాన్నైనా సాధించవచ్చునని చెప్పడం జరిగింది కాని మాకు ఇంతవరకు అట్టి అవసరముపడలేదని చెప్పగా విన్న స్వర్గాధిపతి కాస్త మెత్తబడ్డాడు. ఈ జాడ్యం స్వర్గలోకానికి కూడ ప్రాకకూడదని నిర్ణయించుకొని, "టాప్ లీడర్స్" అయిన 20 మంది అప్సరసలకు 15 రోజులు శలవు మంజూరు చేయగా వారంతా మహదానందంతో వేయిహంసల విమాన మెక్కి భూలోకం పయనమయ్యారు. మెరుపువేగంతో ప్రపంచాన్ని చుట్టి వచ్చి మన పుణ్యభూమియైన





భారతదేశం చేరారు. వారంతా మానస సరోవర ప్రాంతానికి వచ్చి ఆ ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులై మానస సరోవరంలో జలకాలాడారు. తీరాచూస్తే దేవేంద్రుడిచ్చిన 15 రోజుల గడువు అయిపోయింది. వారంతా కంగారు పడుచూ మూటాముల్లె సర్దుకొని విమానమెక్కగా ఒక అప్సరాభామ అదే "శ్రీదేవి చెల్లెలు భూదేవి" మాత్రం విమానమెక్కలేదు. వారంతా ఆమెను పిలవగా తాను రానని చెప్పడమేగాక నాకు ఈ భూలోకమే స్వర్గంలాగుంది. ఆ ఇంద్రలోకమే నరకంలాగుందని కటువుగా చెప్పి అక్కడేవుండి పోయింది.

వారంతా ఇంద్రలోకం చేరారు. చిత్రగుప్తుడు "అటిండెన్స్ రిజిష్టరు"లో పేర్లుపిలచి భూదేవి ఎక్కడ అని అడిగాడు. వారు విషయం చెప్పారు. ఈ సంగతి దేవేంద్రుడికి పిర్యాదు చేయబడింది. ఇది విన్న దేవేంద్రుడు అగ్గిమీద గుగ్గిలమయ్యాడు. మనముపై చిత్రంలో చూస్తున్న విధంగా దేవేంద్రుడు భూదేవితో సంభాషణ మొదలుపెట్టాడు. భూదేవీ నీవెందుకు రాలేదు? ఇక్కడ నీకేమి తక్కువైయ్యింది? అని గద్దించాడు. అందుకా అప్సర "కేర్ లెస్"గా తలపైకెత్తి ఔనండీ! నేను రాదలచుకోలేదు అంది. అందుకు దేవేంద్రుడు అనునయంగా అమ్మా! నీకొచ్చిన కష్టమేమిటో చెప్పు దానికి తగినచర్యలు తీసికొంటానని హామీ ఇచ్చాడు.

అందుకామె బదులిస్తూ... దేవరా! నాపై ఆగ్రహించకండి! అక్కడ మేమంతా ఎన్నోకష్టాలెదుర్కొంటున్నాము. నిరంకుశమైన నీ రాజ్యంలో మా గోడువినే దెవ్వరు? అని నిష్టూరంగా మాట్లాడుచుండగా దేవేంద్రుడు వివరణ కోరాడు.

అయితే చెబుతాను కాస్త జాగ్రత్తగా వినండి... ఇక్కడమేము సర్వలోకము సందర్శించాము. అద్భుత ప్రపంచాన్ని తిలకించాము యీ ప్రపంచం ముందు స్వర్గమెందుకూ పనికిరాదు. మేము రాత్రింబవళ్లూ వింజామరలతో మీకు గాలికొడుతూ వుండాలి. మా చేతులు లాక్కొస్తున్నా మారుమాట్లాడకూడదు. ఇక్కడ స్విచ్ ఆన్ చేస్తేచాలు గాలిపంకాలు నిర్విరామంగా తిరుగుతాయి. రిమోట్ నొక్కితేచాలు ఎయిర్ కండిషన్‌తో వాతావరణం చల్లబడిపోతాది ఈ వాతావరణంలో మేమంతా ఫైవ్‌స్టార్ హొటళ్లలో... "స్విమ్మింగ్ పూల్"లలో జలకాలాడుకొంటూ ఏమిహాయిలే హలా! యంటూ యుగళ గీతాలు పాడుకున్నాము. స్నానాధికాకు షాంపూలు, సుగంధ పరిమళాలు వెదజల్లే రకరకాల మోయిశ్చరైజర్లు, సబ్బులు...స్నోలు...పౌడర్లు...షాపింగ్ మాల్స్‌లో కనులు చెదరిపోయే దేవతావస్త్రాలను మించిన వినూత్నవస్త్రాలు ధరించి తాజాపూల పరిమళాల మధ్య పరవశించి పోయాము. ఇంతటి హాయి ఇక్కడ దొరకుచుండగా అక్కడ నిద్రాహారాలు మాని ఆచుట్టకంపు భక్తాగ్రేసరులను వేయిహంసల విమానాలెక్కించుకొని పల్టీలు కొట్టిస్తూ ఉగ్రూతలూగిస్తూ సర్వస్వం వారికి సమర్పించుకోవాలా! స్వామి! మీరేచెప్పండి!



ఇదేమి చోద్యమోకాని అక్కడ ఎటుచూచినా పురుషభక్తులే కాని మాకులానికి చెందిన ఆడస్త్రీ లెవరూ కానరాదు. ఇదేమి అన్యాయం అసలు భక్తిశ్రద్ధలకు పూజాపునస్కారాలకు ముందుంటూ శనివారాలు, పర్వదినాలు వచ్చేసరికి కొబ్బరికాయలు, అంబికాదర్బార్ అగర్‌బత్తీలు వగయరాలు సిద్ధంచేసేది స్త్రీలే! మరి ముఖ్యంగా ఉపవాసదీక్షలు చేయడము, నోములు నోస్తూ రాత్రింబవళ్లూ హరికథా కాలక్షేపాల్లో ముందుండడమే గాక పుణ్యక్షేత్రాలు దర్శించుట లోను, ముడుపులు చెల్లించడం లోను ముందు వరుసలో వుండేది స్త్రీలే అయినా వీరికి నీ స్వర్గంలో ఎందుకుచోటులేదు? ఇది స్త్రీల అణచివేత కాదా! పురుష పక్షపాతంకాదా అనేసరికి పురుషుడైన దేవేంద్రుడు ఖంగుతిన్నాడు. సరే ఆ సంగతులలాగుంచండి...

**నిజమే! ఈ మత గ్రంథాలందు పురుష పక్షపాతం, పురుషాధిక్యత కొట్టవచ్చినట్టు కనబడతాది. అటు బైబిల్ గ్రంథంగాని, ఇస్లాముగాని స్త్రీని పాపాత్మురాలినిగా చిత్రించాయి. స్త్రీ పాపకారకురాలని, స్త్రీ నరకానికి ద్వారమని చెప్పాయి.పాత నిబంధన కాలంలో స్త్రీలకు గుర్తింపుచాలా తక్కువ. యేసు తన క్యాబినెట్‌లో అదే శిష్యబృందంలో ఒక్క స్త్రీకయినా చోటు కల్పించలేదు. పైగా క్రొత్తనిబంధనలో స్త్రీలారా మీ భర్తలకు లోబడియుండుడి. పురుషుడు మీకు సిరస్సైయున్నాడని చెప్పబడింది. మతగ్రంథాలు స్త్రీని ఇంతగా కించపరుస్తూ తీసిపారేస్తున్నప్పటికి భక్తి ప్రభంజనంలో ముందుండేది స్త్రీలేకావడము విశేషము. భారతదేశంలో పార్లమెంటు, తదితర చట్టసభలందు స్త్రీల ప్రాతినిధ్యం మరింత పెరగనున్నదట మతంలో మాత్రం పెరగవు. తల్లి సంఘంగా చెప్పబడే రోమన్ కేథలిక్ చర్చ్‌లందు కూడ నేటివరకు మచ్చుకైనా ఒక్కలేడీ "పోప్"నైనా నియమించలేదు. కనీసం ఏ చర్చులోను లేడీపాస్టర్లు కానరారు. ఇతర మతాల్లో కూడ స్త్రీపూజారులు మంత్రాలు చదవరు! స్త్రీ జాతి ఈ విషయాల గూర్చి ఎప్పుడైనా ఆలోచించిందా? అసలు మీకుకాదు మాకే బుద్ధిలేదు.**

మేము యావత్ ప్రపంచం తిరుగుతూ యూరోపియన్ కంట్రీస్ అన్నీ తిరిగాము. లాటిన్ అమెరికా దేశాలు తిరిగి ఆశ్చర్యపోయాము. కొన్ని దేశాల్లో రోజుకు కేవలము అయిదుగంటలే పని దినము. వారాంతపు శలవలు రెండు రోజులు. ఇండియా వంటి దేశాల్లో రోజుకు ఎనిమిది గంటలు పనిదినం కాగా వారాంతపు శలవు ఒకరోజు. ఇంతేననుకుంటున్నారా? ఇంకా చాలావున్నాయి. ఓవర్ టైము పనిచేస్తే రెట్టింపు వేతనం. క్యాజువల్ లీవులు, సిక్‌లీవులు, ఎరెండర్ లీవులు, మెటర్నిటీ లీవులే కాక మధ్యమధ్యలో పండుగలు, పర్వదినాలు, "బందు"లు కూడ వస్తూవుంటాయి. ఈ భూలోకంలో మరో





వెసులు బాటుందట. జీవితాంతం పనిచేయనవసరం లేదు. 50-55 సంవత్సరాలు పని చేస్తేచాలు ఉద్యోగ విరమణ. జీవితాంతం ఫెన్షన్ సౌకర్యం వుండగా...

మీ స్వర్గంలో ఒకరోజుకాదు ఒకలోకం కాదు యుగయుగాల పర్యంతం... దివ్యయుగాలు, మన్వంతరాలు (మన్వంతరాలనగా కోట్ల సంవత్సరాలు) పైసా జీతం లేకుండ వెట్టి చాకిరీ చేయించుకొంటున్నారు. రాత్రనక పగలనక మేము చేసే "ఓవర్ టైమ్" లెక్కగడితే మీ స్వర్గాన్ని అమ్మినా చాలదు. ఇక్కడి వారంతా మమ్మును చూచి వెట్టిచాకిరీ గాళ్లని ఎద్దేవా చేస్తున్నారని నాన్‌స్టాప్‌గా మాట్లాడేసరికి ఇంద్రుడు బిత్తర పోయాడు. ఈ మాటలన్నీ నిజమేననిపించాయి.

అంత ఇంద్రలోకాధిపతి సింహాసనం నుండి మూడు మెట్లు క్రిందికిదిగి అమ్మా అప్సరా!... భూదేవీ ఆవేశం కాస్త అణచుకో. మా దేవుళ్లంతా బోర్డ్‌ఆఫ్ డైరెక్టర్స్ సమావేశం జరిపి ప్రథమ వేజ్‌బోర్డ్ ప్రకటించి మీజీత భత్యాలు, బోనస్‌లు, ఓవర్ టైమ్‌లు, శలవులు రిటైర్‌మెంట్ల సంగతి నిర్ణయిస్తాము. నీవన్న దాంట్లో తప్పేమీ లేదు. ముక్కు సూటిగా మాట్లాడావు. ఇందుకు నిన్నేమీ తప్పుబట్టము అంటూ రాజీ ధోరణిలో మాట్లాడుతూ నీవు అర్జంటుగా బయలుదేరి వచ్చేయమన్నాడు. అందుకు అప్సర స్వామీ! అప్పుడే అయిపోలేదు. నేను చెప్పవలసిన విషయాలు ఇంకా చాలావున్నాయని తిరిగి ప్రారంభించింది.

దేవరా! మరో విషయము మీ దృష్టికి నేను తేవాలనుకుంటున్నాను. పనిలో పనిగా మీరుమాకు పెట్టేతిండిని గూర్చి కూడ నాలుగుముక్కలు మీతో చెప్పాలనియుంది. అనీ అనడముతోనే దేవేంద్రుడు కలుగజేసికొని అదేమిటి? భూలోకంలో జైలుకూడు తింటున్నట్టు మాట్లాతావెందుకు క్షీరమహా సముద్రాన్నీ (అదెక్కడుందో ఎవరికీ తెలియదు) తరచగా తరచగా అమూల్యమైన అమృతం వచ్చింది. దాన్ని త్రాగిన వారికి జరా మరణాలుండవు కదా! అనగానే అప్సర అందుకొని చాల్‌చాల్ లే స్వామీ మాకు రోజూ అదేపనిగా బర్రెలకు కుడుతు పోసినట్టు పోస్తున్నారు. కోటాను కోట్ల సంవత్సరాల నుండి ఆ అమృతం త్రాగిత్రాగి మా నోళ్లు పిడసగట్టుకు పోయాయి... ఇంద్రజా! మన్నించండి!...

ఇటీవల మేము సందర్శించిన భూప్రపంచంలో ఫైవ్‌స్టార్ హొటళ్లు, పబ్‌లు, పామ్‌హౌస్‌లు పిజ్జాహట్సు తదితర హొటళ్లలో అనేక రకాల ఫాస్ట్‌ఫుడ్సు పుడ్డింగులు, నూడిల్సు, మేగీలు, రోస్టులు వగయరాలు తిని తరించి పోయాము. ఎంతటి మాధుర్యం ఏమి రుచులు! ఆఖరుగా మేము భారతదేశం వచ్చాము. బొంబాయిలో తాజ్‌హొటల్‌లో దిగితే "కసబ్" లాంటి వాళ్లుంటారని నేరుగా హైద్రాబాద్‌లో దిగాము. "మదీనా హొటల్"లో చికన్-బిర్యానీ తిన్నాము. అబ్బుబ్బుదానిని మాటలతో వర్ణించలేము.

అనంతరం ఐస్ పార్లర్‌కు వెళ్లాము ఐస్‌క్రీమ్ ఆరగించి తమ్స్‌అప్ త్రాగాము మా జన్మతరించి పోయింది. ఈ మాటలు వింటుంటే బ్రహ్మకు కూడనోట్లో నీళ్లూరాయి. చార్మినార్ చూచి అక్కడ రకరకాల గాజులు దొడుకున్నాము. ఆర్.ఎస్. బ్రదర్స్‌కు వెళ్లి సరదాగా ఒక జీన్స్‌ప్యాంటు, టీశర్టు ధరించాను తెలుసా! అంది.

అంతలోనే ఆయన తేరుకొని సరేనమ్మా! ఇంత మాత్రానికే బాధపడటమెందుకు? మన యొద్ద కావలసినంతమంది వంట బ్రహ్మణులున్నారు. మన "మినూ" మార్చేద్దాము అనగానే-ఆమె అందుకొని ఇక చాల్లెండి! ఆసాంబారు వంకాయపులుసు ఎవరికి కావాలని అనగానే దేవేంద్రుడు మన యొద్ద ఫైవ్‌స్టార్ మాస్టర్లు కూడ అనేకమంది వున్నారు. నీవు కావాలంటే పుల్లారెడ్డి స్వీట్స్ అధినేతకూడ మన యొదేవున్నాడు. నిన్ను క్షమించేస్తున్నాను. ఇకవచ్చేయ్! అన్నాడు.

ఈ మాటలకు అప్సర కాస్త మెత్తబడి సరే అలాగే వచ్చేస్తాను కాని, ఈనా ఒకేఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పండి అని ఈ విధంగా అడిగింది. ఇంద్రా! ఈ వరసంతా చూస్తూయుంటే నాకొక పెద్ద అనుమానమొచ్చి పడింది. అసలు ఈ మనుష్యులను మనమే సృష్టించామా? లేక ఈ మనుష్యులే దేవుళ్లను సృష్టించారా అని అడిగింది. వెనువెంటనే ఆగ్రహో దగ్ధుడై ఆవేశాన్ని అణచుకొంటూ, ఆఖరుగా చెబుతున్నాను విను నీవుఎంత సేపూ ఆ మానవాధములను వెనకేసుకొనివస్తూ మాట్లాడుతున్నావు. వాళ్లువట్టి మట్టి మానవులు. అజ్ఞానులు. ఈ మానవాధములను సృష్టించింది మనమే కదా! స్వర్గలోకంలో నీకేమితక్కువయ్యింది? మన యొద్ద కల్పతరువుంది. కామధేనువుంది. మనము ఏది కోరితే అది క్షణలో మన ముందుంటాది. ఆ తెలివి తక్కువ మానవులు మూర్ఖులు అజ్ఞానులు అంటూ తూలనాడాడు ఆ స్వర్గాధిపతి.

ఈ మాటలకు అప్సరభూదేవి ఆవేశంతో రెచ్చిపోయి ఆఖరుగా చెబుతున్నాను. నా మాటలను ఈ ఒక్కసారికి కాస్త జాగ్రత్తగా వినండి. సరేవారు అనాగరికులైన అజ్ఞానమానవులే అనుకుందాము. అట్టి అనాగరిక దశలో దిగంబరంగా కొండలమ్మట కోనలమ్మట సంచరించారు. ఆకులలములు, పచ్చిమాంసం తిన్నారు. కాలక్రమంలో జంతువులపై స్వారిచేశారు. తరువాత ఎడ్లబళ్లు, సైకిల్, మోటారు వాహనాలు, విమానాలుఎక్కి పయనించారు. అనంతరం అంతరిక్షనౌకల్లో ఇతర గ్రహాలు కూడ చేరుకొంటున్నారు. నేడోరేపో మన కొంపలు కూడ ముంచుతారేమో! ఈ విధంగా ఈ అజ్ఞాన మానవుడు, మట్టి మానవుడు అని చెప్పబడ్డ వాడు ఇంత పైపైకి ఎదిగిపోతూ వుండగా దేవుళ్లైన మనము ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నచందాన కోటానుకోట్ల సంవత్సరాలుగా ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోయామెందుకు?





మన యమధర్మరాజులుంగారు ఇంకాదున్నపోతు మీదే ఎందుకు సంచరిస్తున్నాడు? ఓ చేతిలో "గద" రెండో చేతిలో యమపాశంగా చేంతాడు వదలడెందుకు? మన పెద్దదేవుడు నేటికీ పక్షిరాజుమీద కూర్చుని పయనించడమేమిటి? నరులు A.K.47 పడుతుండగా ఆయన చక్రాయుధానీ వదలడెందుకు? మీ మట్టుకు మీరు ఐరావతమనే ఏనుగునెక్కి అడుగులో అడుగేసుకుంటూ తిరగడమేమిటి? లయకర్త శివశంకరుడు ఎద్దు మీద సవారి చేయడమేమిటి? కనకదుర్గమ్మ పెద్దపులి మీద సవారీ చేయడం, సరస్వతమ్మ నెమలి నెక్కడం మానరెందుకు? మానవులు రోజురోజుకు తెలివి మీరిపోతూయుంటే మనమింకా పాతరాతి యుగంలోనే ఉండిపోయామెందుకు? ఇవన్నీ చెబుతుంటే నాకే సిగ్గనిపిస్తుంది. సమస్త జ్ఞానసంపదకు మూలం, సకల విఘ్నాలను తొలగించి శుభారంభాలనిచ్చే పార్వతీ తనయుడైన వినాయకుడు ఏ కారణం చేతనైనా భూలోకం రోడ్ల మీద పయనించ వలసి వస్తే అక్కడి ట్రాఫిక్ పోలీసులు ఆయన వాహనాన్ని "సీజ్" చేసి ఏమిటీ ఓవర్ లోడ్? చిన్నారి చిట్టెలు మీద టన్ను బరువు మోపి పరుగులు తీయించడమా!యని కేసుపెడతారు. వాళ్ల సంగతి ఆలాగుంచి జీవకారుణ్య సంఘాల తాలూకు మేనకాగాంధి, కాస్త పెద్దజీవులైన కుక్కలు పిల్లుల మీద ప్రేమచూపే "అమల" వంటివారు వూరుకుంటారా! చిట్టెలుక పడేకష్టాన్ని చూచి భరించగలరా! అని అప్సర అనర్గళంగా మాట్లాడుతూ వుండగా ఇక లాభం లేదు ఈ అప్సరకు తగిన శిక్షవేయాలని చిత్రగుప్తుడి యొద్దకు వెళ్లి సమాలోచనలు చేయుటకు చిన్న బ్రేక్.

***   ***   ***

అంతనా అప్సర మెల్లమెల్లగా సరోవరాన్నుండి పైకివచ్చి అటూఇటూ తిరుగుచుండగా అక్కడొక చెట్టు, ఆ చెట్టుకొమ్మ ఒకటి స్త్రీ ఆకృతిలో నుండగా భూదేవి ఆ వృక్షాన్ని సమీపించి వృక్షరాజా! అని సంభోదించింది. ఆశ్చర్యంతో అమ్మా మిమ్ముమను చూస్తుంటే దేవకన్యలా కనబడుచున్నారు. నాతో నీకేమిపని తల్లీ! అనగా.. అందుకామె వృక్షరాజా! నీవు నాకొక సహాయంచేయాలి. అదేమంటే గత 25 సంవత్సరాల క్రితం "జగదేక వీరుడు అతిలోక సుందరి" కథనం సందర్భంలో నా అక్కగారైన అప్సర శ్రీదేవి భూలోకంలో మా బావగారితో సెటిలైపోయింది. అప్పుడు వారు బ్లడ్ బ్యాంక్ వగైరాలు నడుపుతూ హాయిగా వున్నట్టు "మెసేజ్"లు పంపేది. ఇటీవలి కాలంలో నాకు ఏ వార్త వారినుండి అందడంలేదు వారెలాగున్నారో తెలియదు. నీకేమన్నా తెలిస్తే చెప్పమని వృక్షరాజును భూదేవి కోరింది. మీ బావగారి పేరేమిటని అడగగా "చిరు" అని గుర్తుందని అప్సర భూదేవి చెప్పగా ఓహో! చిరంజీవా! అనగానే అప్సరకళ్లింత చేసి ఔనంది.!

అంతనా వృక్షరాజు విచారవదనంతో ఇది గోనమ్మ మీ అక్క శ్రీదేవి. ఆ మధ్య మీ బావగారు రాజకీయాల్లో దిగుతాననగా వద్దంటే వద్దందట. అక్కడికీ నేను చెప్పాను. అమ్మానీవు అనవసరంగా తొందరపడకు N.T.R. వలే మీవారు కూడ ముఖ్యమంత్రి కావచ్చని చెప్పినా వినకుండ ఇదిగో! నాలోలీనమై పోయిందని నేనన్నట్టే మీ బావగారు ఇప్పుడు కేంద్ర పర్యాటక శాఖమంత్రి అయ్యారని చెప్పగా చూచి కాసేపురోధించింది. అంతలో తిరిగి దేవేంద్రుని నుండి పిలుపురాగా అప్సర అటువెళ్లింది. అంత దేవేంద్రుడు కోపావేశంతో నీవు స్వర్గాధిపతినైన నన్నేగాక మొత్తం మా దేవుళ్ల "కేబినేట్" నంతా ధిక్కరించి అవమానించావు. నీకిదే నా శాపం! నీవు శిలా ప్రతిమవైపోదువు గాక అని శపించాడు. అంత నామె మెలమెల్లగా శిలగా మారిపోతూ... దిక్కులు పిక్కటిల్లే గంభీరస్వరంతో దేవారా నీశాపానికి ఎవరూ భయపడరు. నాకేమి చింతలేదు. నీశాపాన్ని మహదానందంగా స్వీకరిస్తాను. ఈ భూలోకం ఎంతో భక్తి పారవశ్యమైనది. అందునా ఈ భారతావనిలో భక్తి పొర్లి పారుతూవుంటుంది.

తమిళనాడులో సినిమాతారయైన "కుష్బూ"కు గుడికట్టి పూజిస్తున్నారు. అదంతా ఎందుకు... హరియానాలో క్రికెట్ ఆటగాడైన కెప్టెన్ ధోనికి కూడ గుడికట్టి స్తున్నారట. ఇక్కడొక అప్సరాసాభామ మానవులను అభినందించిన కారణంగా శిలాప్రతిమగా మారిందని తెలిస్తే నాకీ పర్వతం మీద ఒక స్వర్ణదేవాలయం కట్టించి ప్రతిరోజు నాకు పరిమళభరితమైన తాజాపూలతో పూజిస్తారు.

మీ స్వర్గంలో దిక్కుమాలిన సేవలు చేస్తూ వెట్టి చాకిరీ చేయడం కన్నా ఇది నాకంతో మహాభాగ్యం అంటూ శిలగా మారిపోయిందట.

ఈ కథనం విన్నాక ఇంతకుముందు మనము చెప్పుకున్న క్రైస్తవ భక్తురాలి వంటివారు అబ్బ! హిందూ దేవుళ్లను భలేబాగా విమర్శించాడని ఆనందిస్తారుకావచ్చు. హిందూ పురాణకథల్లో చెప్పబడిన దేవుళ్ల వాహనాలు కొంతలో కొంతయినా సహజంగా కాస్తో కూస్తో నమ్మశఖ్యంగా కనబడుచుండగా... క్రైస్తవ దేవుళ్ల వాహనం మాత్రం మరీ విడ్డూరమైన రీతిలో నమ్మశఖ్యంకాని విధంగా కల్పనాకథగా గోచరిస్తుంది. ఆయన మేఘాలమీద పయనిస్తాడా!

క్రైస్తవులు తమ దేవుడే యధార్ధమైన వాడని, ఆద్యంత రహితుడని, నిత్యుడగు దేవుడని, సర్వోన్నతుడైన తండ్రియని ఈ యెహెూవా ఏకైక కుమారుడు యేసుక్రీస్తుని, లోకరక్షకుడని బైబిల్ చెబుతూ యుంది. ఈ మాటలను క్రైస్తవ విశ్వాసులందరు నమ్ముచున్నారు. అయితే వీరు మేఘాలపై పయనిస్తారని పదేపదే చెప్పబడుచున్నది.





ఇతర దేవుళ్ల కథనాలన్నీ పుక్కిటి పురాణాలని బైబిల్ దైవాలే యధార్ధమైన వారని గొంతులు చించుకొని ప్రసంగాలు చేయడం మనము అనునిత్యం టి.వి.లలో చూస్తూ వింటూయుంటాము.

ఒక్కసారి మీ మతనమ్మకాలను ప్రక్కనపెట్టి ఇంగితజ్ఞానంతో ఆలోచించండి! మేఘాలంటే ఏమిటి? అవి నీటి ఆవిరి రూపంలో పొగమంచు రూపంలో గాలివాటుకు కదిలిపోతూ ఒక గమ్య మంటూలేకుండా పయనిస్తాయి. అట్టి మేఘాలకు చల్లనిగాలి తగిలితే అవినీటి బిందువులుగా మారి వర్షంగా కురుస్తాయి. ఒక్కసారి జాగరూకతతో ఆలోచించండి. మేఘాల మీద ఒక పిచ్చుకగాని ఒక గ్రద్దగాని వాలగలదా! అంత బరువైన యెహెూవా సోఫాలో కూర్చున్న విధంగా కూర్చొనుట సాధ్యమేనా? ఈ మేఘాలనేవి మనకు కేవలము మూడునాలుగు కిలోమీటర్ల దూరంలోనే వుండి పయనిస్తాయి. అంతలోనే నైరుతి రుతుపవనాల తాకిడికి నీరుగా మారి వర్షిస్తాయి. నాటి బైబిల్ రచయితల ఊహా జనిత కథనాలను యధార్ధ విషయాలుగా నమ్మడం అర్ధరహితం. దేవుళ్లు మేఘాలు ఎక్కి పయనిస్తారనేది కేవలం కల్పితమే! ఈ ముగింపు విన్న ఆ క్రైస్తవ భక్తురాలికి నోటమాట రాలేదు.

ఈ విధంగా నా రచనా వ్యాసాంగానికి సంబంధించి, కొందరు టీనేజి అమ్మాయిలతో పైవిధంగా అనేక విషయాలు వివరించగా వీరికి బైబిల్ పరిజ్ఞానం ఏమాత్రము లేకపోయినప్పటికి జన్మతా క్రైస్తవులైనందున, చిన్నతనంలో వీరి సండేస్కూళ్లలో నేర్చుకున్న బైబిల్ వాక్యాలు, కథలు, సందేశాలు వీరిపై బలమైన ముద్రవేసినందున, తరచుగా చర్చిల్లో బోధించబడే పాపం, సిలువమరణం, పాపక్షమాపణ, కీస్తురెండవ రాకడ వంటి విషయాలపై నిశ్చితాభిప్రాయంతో నా మాటలు విన్నవారు బైబిల్ సత్యవేద గ్రంథమని, యెహెూవా ఆద్యంతరహితుడు, నిత్యుడైన దేవుడు, యేసుక్రీస్తు యెహెూవా యొక్క ఏకైక కుమారుడని తాము నిష్కర్షగా నమ్ముతామని చెప్పారు.

నేటి కార్పోరేట్ విద్యావిధానంతో ఆధునిక రీతుల్లో తలమునకలైవుంటారు. మరో ప్రక్క కంప్యూటర్‌లతో మునిగి తేలుతూ వుంటారు. ఇంగ్లీషు మీడియం కారణంగా వీరికి తెలుగు రానందున తెలుగు బైబిల్ చదవలేరు. ఇంగ్లీషు బైబిల్ చదివినా అది ఓల్డ్ ఇంగ్లీష్‌లో వ్రాయబడి నందున అది తేలికగా అర్ధంకాదు. అంతమాత్రముచే వీరు బైబిల్ చదవరని కాదు. వీరు బయటకు వెళ్లేముందు బైబిల్‌ను లాటరీ పద్ధతిలో ఏదో ఒక చోట తెరుస్తారు. అందు రెండు మూడు వచనాలు చదువుతారు. ఆ పద్ధతిలో ఈ క్రింది వాక్యం వచ్చిందనుకుందాము...

"నిన్ను విడువను ఎడబాయను" "యెహోవానిన్ను కాపాడును. పగలు ఎండదెబ్బయైనను రాత్రివెన్నెల దెబ్బయైనను నీకుతగలదు. ఏ అపాయము రాకుండ నిన్నుకాపాడును. ఇది మొదలుకొని నిరంతరము నీ రాకపోకలయందు యెహోవానిన్ను కాపాడును." (కీర్తనలు 121:4:7)

ఇటువంటి వాక్యము రాగా చదివి ఆహా! ఈ వాక్యము ద్వారా దేవుడు నాతో మాట్లాడాడని సంబరపడి పోతూ బయలుదేరతారు. బయట ఎండదెబ్బకు బుర్ర సుర్రుమంటున్నా మండుటెండలు నిప్పులు చెరగుచున్నా వారు బయలు దేరేముందు చదివిన వాక్యమిచ్చిన ఆదరణ ఫలితంగా అట్టి ఎండతాపము కూడ వీరికి చల్లగానే అనిపిస్తాది.

అంతేగాని యెహోవా ఎండదెబ్బకు గొడుగుపట్టడు. ప్రమాదాలు జరిగకుండ ఆపనూలేడు.

*** *** ***

16-1-2012వ తేదీన నాకు వరంగల్ నుండి ఒక ఫోన్‌కాల్ వచ్చింది. నెల్సన్ రష్దీగారు మీరేనా?... ఔనండి చెప్పండి... "ఇది నిజమా? పైలెట్ ఎడిషన్" చదివాను. మీ కవితలు చాలాబాగున్నాయి. మీరు రచించిన పుస్తకం అంతా చదివాను. మీరు బైబిల్‌ను 40 సంవత్సరాల పాటు పరిశోధించానంటున్నారు, మీ అనుభవము చాలా గొప్పదేకావచ్చు... ఇప్పుడు మీ వయస్సెంత?... 79 నడుస్తుంది. అలాగా నేను 65 సం॥ వుండవచ్చుననుకున్నాను...

అయితే మీరు అయిదేళ్లకోలేక పదేళ్లకో చనిపోతారు. అయితే ఏమంటారండి!... అదే మీరు చనిపోయాక మీకు తెలుస్తుంది. నరకం ఎలాగుంటుందో అందులో అగ్ని ఆరదు, పురుగుచావదు. కలకాలం మీరు నరకంలో కాలుతూవుంటారు. బైబిల్ చెబుతున్నవన్నీ యధార్థాలు... గుర్తుంచుకోండి అని హెచ్చరిస్తూ తన పేరు చెప్పకుండ ఫోన్ పెట్టేశాడు. వెంటనే నా కోతలంపు వచ్చింది. ఈ గ్యాస్‌తో చావు చస్తున్నాము. ఈ భక్తాగ్రేసరులెవరైనా ఆ నరకంలో నాన్ స్టాప్‌గా మండే ఫార్ములా చెబితే ఎంతబాగుంటాది.

ఈ "మిస్టర్ ఎక్స్" ఎవరో వివరాలు చెప్పి ఆయన ఫోటో కూడ పంపియుంటే ఈ రచనలో చక్కగా ప్రచురించియుండేవాడిని.





ఈ మిస్టర్ ఎక్స్‌కు నేను ఏమి సమాధానం చెప్పాలి? ఏమి చెప్పినా ఆయన నమ్మడు. నేనేమీ జవాబీయకుండ తప్పించుకొంటే పలాయన వాదంగా భావిస్తారు. అందుచే వారికి ఇక్కడ నేను ధీటైన సమాధానం చెప్పవలసిన బాధ్యత నామీద వుంది. అందుచే నేను వారికి సమాధానం చెప్పడంగాక ఈ బైబిల్ గ్రంథం నుండే దైవంచే జ్ఞానం ప్రసాదించబడిన ఒక మహానీయునితో చక్కని సమాధానము బైబిల్ గ్రంథం నుండే వినిపిస్తారు. ఇశ్రాయేలీయుల రాజైన సొలోమోను నోటి నుండి వచ్చిన దివ్యవాక్కులను జాగ్రత్తగా గమనించండి. బోర్ ఫీల్‌కాక మరొక్కసారి మళ్లీ చదవండి. ముచ్చటగా మూడవ సారికూడ చదవండి.

యెహోవాకు ప్రీతిపాత్రుడైన దావీదు మహారాజు కుమారుడైన సోలో మోనుకు గిబియోనులో ముఖ్యమైన ఉన్నత స్థలముండెను. రాజైన సోలోమోను అక్కడి బలి పీఠము మీద వేయిదహనబలులు యెహోవాకు అర్పించెను.

గిబియోనులో రాత్రివేళ స్వప్నమందు యెహోవా సోలోమోనుకు ప్రత్యక్షమై నీకేమి కావాలో కోరుకొనుమనగా : సోలోమోను ఈలాగు మనవి చేసెను: నీ దాసుడును, నా తండ్రియైన దావీదు నీదృష్టికి అనుకూలముగా సత్యమును, నీతిని అనుసరించి యథార్థము గల వాడై ప్రవర్తించెను...(1. రాజులు 3:4-6).....ఇంతగొప్పదైన నీజనములకు న్యాయము తీర్పువాడెవ్వడు? కాబట్టి నేను మంచిచెడ్డలు వివేచించి నీజనులకు న్యాయము తీర్చుటకు నీదాసుడనైన నాకు వివేకము గల హృదయము దయచేయము. సోలోమోను మనవి ప్రభువునకు అనుకూలమాయెను. గనుక దేవుడతనికి ఈలాగు సెలవిచ్చెను. దీర్ఘాయువునైనను, ఐశ్వర్యమునైనను... అడుగక న్యాయములను గ్రహించుటకు వివేకమును అనుగ్రహిచమని నీవు అడిగితివి. ....నీమనవి ఆలకించుచున్నాను. బుద్ధి వివేకములు గల హృదయమును నీకిచ్చుచున్నాను. పూర్వికులలో నీవంటి వాడు ఒకడునూలేడు. ఇక మీదట వుండబోడు. నీవు ఐశ్వర్యమును ఘనతను ఇమ్మని అడుగక పోయినా వాటిని కూడ నీకిచ్చుచున్నాను. అని యెహోవా స్వయంగా రాజైన సోలోమోనుకు అనుగ్రహించాడు. (1.రాజులు 3:9-13)

ఈ సోలోమోను బైబిల్ నందలి సామెతల గ్రంథము, ప్రసంగి, పరమగీతములు రచయిత. దేవుడిచ్చిన జ్ఞానానికి ప్రతీకగా యావత్ ప్రపంచ క్రైస్తవ సామ్రాజ్యం ఈయనను నేటికీ శ్లాఘిస్తూనే వుంటుంది. ఈ మహనీయుడు రచించిన దైవనీతి ఎంత ఘనంగా యుందో చూడండి!! మిస్టర్ ఎక్స్ వరంగల్ గారూ! కాస్త బిగ్గరగా చదవండి. మీ తృప్తికోసం ఈ వాక్యాన్ని పదేపదే పొందుపరుస్తున్నాను.

> నరులకు సంభవించునది ఏదో - అదే మృగములకును సంభవించును. వారికిని వాటికిని కలుగు గతి ఒక్కటే! నరులు చచ్చునట్లు మృగములును చచ్చును. సకల జీవులకు ప్రాణము ఒక్కటే. మృగముల కంటే నరులకేమియు ఎక్కువలేదు. సమస్తము వ్యర్థము. సమస్తమును ఒక్కస్థలమునకే పోవును. సమస్తమును మంటినుండి పుట్టెను. నరులఆత్మ పరమునకెక్కి పోవునోలేదో, మృగముల ప్రాణము భూమికి దిగి పోవునోలేదో ఎవరికి తెలుసు? కావున తమకు తరువాత జరుగు దానిని చూచుటకై నరుని తిరిగి లేపువాడెవడును లేకపోవుట నేను చూడగా వారు తమ క్రియలయందు సంతోషించుట కంటే వారికి మరి ఏమేలును లేదను సంగతి నేను తెలిసికొంటిని. (ప్రసంగి **3:19-22**)

యెహెూవా యంతటివాడు రాజైన సోలోమోనుకు ప్రత్యక్షమై అయనకు జ్ఞానసంపద, దీర్ఘాయుష్షుతో పాటు ఐశ్వర్యాన్ని కూడ ప్రసాదించినట్టు బైబిల్ చెబుతుంది. చెప్పడమేగాక భూత-భవిష్యత్ గ్రాహియైన యెహెూవా నీవంటివాడు గతంలోగాని, రాబోయే కాలంలోగాని ఉండడని ప్రశంశిస్తూ జోస్యం చెప్పాడు.

కాని జరిగిందేమిటి? సోలోమోను మాటలు మరొకసారి వినండి... యెహెూవా అనేవాడు నిజంగా వున్నాడోలేడో.. ఎవరికి తెలుసు అవన్నీ కల్లబొల్లి కబుర్లుగాక మరొకటి కాదాన్నట్టు క్లియర్‌గా తన వాంగ్మూలాన్ని "ప్రసంగి"లో పొందుపరచాడు. నిజంగా అతను తన దర్శనంలో యెహెూవాను చూచియుంటే సోలోమోనుకు యెహెూవా అట్టి ఆశీర్వచనాలు ఇచ్చిన మాటనిజమే అయ్యుంటే ఆయన పైవిధంగా నాస్తికభావాలు వెలిబుచ్చి యుండేవాడేనా? అలనాటి అనాగరిక కాలంలో కలలు నిజమని నమ్మేవారు. యెహెూవా కలలో కనబడి మాట్లాడాడంటే! కలలు కల్లలుకావా? సోలోమోను ఇలా భ్రష్టుడై అన్యదేవతల భక్తుడౌతాడనే విషయం యెహెూవాకు తెలియదా! యెహెూవాకు భవిష్యత్ గ్రాహ్యం ఏమాత్రము లేదన్నమాట. అయినా సోలోమోనును క్రైస్తవులు ఎందుకు ధిక్కరించకుండ నెత్తినెక్కించు కుంటున్నారనేది మాత్రం అంతుచిక్కని ప్రశ్నగా మిగిలిపోయింది.

"పేరుకే ముందుమాట చెప్పేదంతా వెనుకటిమాట" అని ప్రారంభించిన ఈ శీర్శిక భూత-వర్తమాన భవిష్యత్ కాలలను కూడ చుట్టేసుకుంటూ సందర్భానుసారంగా మరెన్నో విషయాలను సవివరంగా చర్చిస్తూ చివరకు "మిస్టర్ ఎక్స్"తో ముగిసింది. అయితే పాఠకులు నాతో ఏకీభవించకపోయినా ఎదుటి మనిషి ఏమి చెబుతున్నాడో తెలుసుకొనుటలో తప్పేమిలేదు. మీరు కూడ అనేక కలలుకంటూనే వుంటారు. అందు ఆవగింజంత యధార్థమైనా కనబడదు అయినా క్రైస్తవ సమాజాలు మాత్రం మారుమాట్లాడకుండ కళ్లుమూసుకొనిమరి నమ్మేస్తూవుంటాయి. ఇకనుండి చర్చించబడే రసవత్తరమైన చర్చను జాగ్రత్తగా చదవండి. కలలు కల్లలని మాత్రం గుర్తుంచుకోండి!

**- రచయిత**





# బైబిల్‌గ్రంథ పరిచయం




ఈ క్రైస్తవ మతగ్రంథమైన బైబిల్‌ను పరిశుద్ధ గ్రంథంగా పిలుస్తారు. ఇంచుమించు అన్ని మత గ్రంథాలు దేవుళ్లనోట్లో నుండి ఊడిపడ్డాయని... ఆయన ప్రతినిధులు, లేక "పరిశుద్ధాత్మ" ప్రబోధించగా వ్రాయబడ్డాయని చెబుతున్నట్టే, యెహెూవా దేవుడే స్వయంగా తన ప్రవక్తలు. న్యాయాధిపతులు, రాజుల మొదలైన వారికి ప్రబోధించగా వ్రాయబడిన పవిత్ర గ్రంథమని బైబిల్‌ను గూర్చి చెప్పబడింది. ఇవి సాక్షాత్తూ యెహెూవా వాక్కులని వివరించబడింది.

ఇందు పాతనిబంధనలో నున్న 39 పుస్తకాలను ముప్పది మంది రచించారు. క్రొత్త నిబంధనలోని 27 పుస్తకాలను తొమ్మిది మంది రచించారు. మొత్తం బైబిల్‌లోని ఆదికాండము నుండి ప్రకటన గ్రంథం వరకు 1600 సం॥ కాలవ్యవధిలో వ్రాయబడ్డాయి. బైబిల్ గ్రంథకర్తలలో ప్రవక్తలు, న్యాయాధిపతులు, పండితులు, రాజులు, యుద్ధ వీరులు, రాజకీయవేత్తలు, ఒక ఖైదీ, ఒక పశువుల కాపరి, వ్యవసాయ దారుడు, వేదాంతి, వైద్యుడు, సుంకపు-గుత్తదారుడు, కవులు, జాలరులు మొదలైన వారున్నారు.

వీరంతా దీనిని దైవప్రేరణతో పరిశుద్ధాత్మ దేవుడనే "ఆత్మశక్తి" సహాయంలో వ్రాశారని చెబుతారు. ఇట్టి బైబిల్ 1140 పేజీలు గల అతి పెద్ద సంకలన గ్రంథం. బైబిల్‌లో 929 అధ్యాయాలు, 41,173 వచనాలు, 7,74,746 మాటలు, 35 లక్షల, అరువది ఆరువేల, నాలుగు వందల అక్షరాలు ఉన్నాయి.

ఇట్టి బైబిల్‌ను రక్షించుకోవడానికి చాలామంది తమ ప్రాణాలను పణంగా పెట్టారు. ఇందలి ప్రతీ లేఖనం దైవాంశ వలననే కలిగిందని బైబిల్ చెబుతుంది. బైబిల్‌లోని పాత నిబంధన గ్రంథం మొదటగా హీబ్రూ భాషలో వ్రాయబడగా, క్రొత్త నిబంధన మొదట గ్రీకు అరమెయిక్ భాషల్లో వ్రాశారు. ఇట్టి పరిశుద్ధ గ్రంథంగా చెప్పబడిన బైబిల్ నుండి ఎవరైనా ఏదయినా కలిపినా, లేక తీసివేసినా ఈ గ్రంథమందు వ్రాయబడిన తెగుళ్లను దేవుడు వారి మీదకు పంపుతాడని ప్రకటన గ్రంథం 21:18,19లో వ్రాస్తూ, అట్టి వారికి జీవవృక్ష ఫలాల్లో భాగముగాని, అసలు "పరలోక రాజ్య" ప్రవేశమే వారికి లభించదని బెదిరించడం జరిగింది. అయినప్పటికి ఈ బైబిల్ నుండి అనేక అధ్యాయాలకు అధ్యాయాలే బైబిల్ సంస్కర్తలచే తొలగించబడ్డాయి. అయినా ఇట్టివారికి ఏవిధమైన రోగాలు రాలేదు. రాగల రచనలలో బైబిల్ నుండి తొలగించబడిన అనేక భాగాలను ఇది నిజామా రెండవ

భాగంలో సచిత్రంగా పొందుపరచబడతాయి. అయినప్పటికి నేటి బైబిల్ నందు కూడ అనేక అవకతవకలు, నమ్మశక్యంకాని కథనాలు, అశ్లీల రచనలు ఇంకా మిగిలి యున్నప్పటికి ఎవరు వాటిని వ్రేలెత్తి చూప సాహసించరు.

దీనిని నిశితంగా పరిశీలించి చూడగా అనేక ప్రకృతి విరుద్ధ విషయాలు కనబడతాయి. ఆవిధంగానే మనము యేసు చరిత్రకు సంబంధించిన క్రొత్త నిబంధనలో చూడగా యేసు తన ప్రచార పర్వంలో అత్యధికంగా సముద్రతీర ప్రాంతాలైన గలిలయ, తిబిరయ, గెరాశీను, సీదోను, దెకపొలియ, మొదలగు సముద్ర తీర ప్రాంతాలందు పర్యటిస్తూ నమ్మశక్యంకాని అనేక అద్భుతాలను కూడ చేసినట్టుగా మనము చూడగలము.

ముఖ్యంగా చాలా మంది క్రైస్తవులు ఏవిధమైన సందేహాలు వ్యక్తం చేయకుండా వీటిని విశ్వసిస్తూ వుంటారు. కాని వీటి వివరాల్లోకి వెళ్తే ఇవన్నీ ప్రకృతి విరుద్ధమైన గాలికబుర్లని విదితమౌతుంది. ఇందు అతి ముఖ్యమైన సముద్ర తీర ప్రసంగాలను గూర్చి కొద్దిగా చర్చించుకుందాము. అనేక మంది ఆయా ప్రాంత ప్రజానీకం ఆయన ప్రబోధాలు వినుటకు, మరి ముఖ్యంగా యేసు చేసే అద్భుతాలను చూచుటకు తండోపతండాలుగా వచ్చేవారని చెప్పబడింది. కాని వారు అయిదారు వేల మంది పురుషులన్నట్టుగా "బైబిల్ కాకి లెక్కలు" చెప్పింది. అలనాటి పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీలకు ఏమాత్రము గుర్తింపులేనట్టుగా కనబడుతుంది. సాధారణంగా ఎక్కడైనా ఇట్టి వింతలు చూడటానికి పురుషులకన్నా స్త్రీలే ఎక్కువగా వస్తూయుంటారు. ఆకాలంలో ప్రతీ కుటుంబంలోని పదిమంది కన్నా సంతానం అధికంగా ఉండే వారని చెబుతారు. అందుచే పురుషుల కన్నా స్త్రీలు పిల్లలే ఎక్కువగా వుండాలి. దీన్ని బట్టి అట్టి సమావేశాలకు పదివేల మందికిపైగా చేరవచ్చునను. జనులు అధికంగా యున్నందున యేసు నిలుచుటకు సరియైన వేదిక వేనందున తీర ప్రాంతాల్లో ఆయన కొండెక్కి కూర్చునట్టు, మరికొన్ని సార్లు దోనెవంటి నాటుపడవ నెక్కి సముద్రంలో కాస్త దూరాన లంగరు వేసి నిలిపి తన ప్రసంగాలను కొనసాగించినట్టు చెప్పబడింది. ఇట్టి సభలు ఎలా కొనసాగివుంటాయో కాస్త ఇంగిత జ్ఞానంతో ఆలోచిద్దాము. ఎవరైనా రాజకీయ నాయకుడు మైక్ లేకుండా కొండెక్కి కూర్చొని ప్రసంగిస్తే క్రిందనున్న వారికి ఏమన్నా వినబడతాదా!

క్రైస్తవ సోదరుల్లో కోల్‌కతా, విశాఖపట్నం, కాకినాడ, నర్సాపురం (అంతర్వేది), మచిలీపట్నం, చెన్నై, కేరళ, గోవా, ముంబయ్, సూరత్, గుజరాత్‌ల వంటి తీరప్రాంత ప్రజలకే కాక, ఏదో ఒక సందర్భంలో సముద్రాన్ని చూచి వచ్చిన వారందరికీ సముద్రం సంగతులు బాగా తెలిసేవుంటాయి. నదీ పరీవాహక ప్రాంతాల వలె సముద్ర తీర ప్రాంతాలు ప్రశాంతంగా వుండవని అనునిత్యం ఇల్లంత ఎత్తయిన రాకాశి కెరటాలతో రణగొణ ధ్వనులతో సముద్రాలు ఘోషిస్తూ ఉంటాయి. నలుగురైదుగురు మిత్రులు కలసి





సముద్రపుటొడ్డున గొంతు చించుకొని మాట్లాడినా వారిప్రక్కనేవున్న సహచరునికి వినబడనంతటి అల్లకల్లోలమైన ధ్వని కాలుష్య వాతావరణంలో వేలాది ప్రజల రణగొణ ధ్వనుల మధ్య యేసు ప్రజలకు మరింత దూరంలో కొండెక్కి కూర్చునో, ప్రజలు మీద పడకుండా దోనెనెక్కి సముద్రంలో నిలిపి యుండగా ప్రళయభీకర కెరటాలను సముద్రపు గాలులు తోడై ఆ నాటు పడవను ఢీకొంటూ పైకి లేపేస్తూ భయంకర రణగొణ ధ్వనులతో సముద్రపు హెూరులో ఎవరికి ఏమీ వినబడి అవకాశములేదు. సాత్వీకుడైన మన ప్రధానమంత్రి నిమ్మళమైన స్వరంలో మైక్‌లో మాట్లాడుచున్నా మనకంతగా వినబడదు కదా! అంతటి కల్లోలభరిత సముద్ర ప్రాంతంలో మరింత దీనుడైన యేసయ్య ప్రసంగాలు నిదానంగా సాగుతూయుంటే దూరశ్రవణ యంత్రాలు గాని అసలు కరెంట్ అనేదిగాని లేని నాటి కాలంలో ప్రజల రణగొణల మధ్య కనీస చదువులు కూడలేని ప్రజానీకాన్ని ఆయా సరిక్రొత్త ప్రసంగాలు అసలు వినిపించి వుంటాయా? వాటిని ఎవరైనా రికార్డు చేయగలరా? అట్టి సముద్రపు ఘోషల మధ్య ఇదంతా అసంభవము. క్రీస్తు మరణానంతరం వందలాది సంవత్సరాలకు గాని ఈ బైబిల్ కూర్పు జరగలేదని మనము తెలిసికొన్నందున అట్టి ప్రసంగాలన్నీ రచయితలు నిదానంగా వ్రాసి యుండవచ్చు. యేసు దేవుని కుమారుడని చెప్పబడినప్పటికి ఆయన బోధనలు ముఖ్యంగా సహజంగా సంభవించే జబ్బులైన నడుము నొప్పి, గూని, మూగ, చెవుడు వంటివి కూడ దయ్యాలు భూతాల చేష్టలేనని ప్రబోధించడం మనము చూస్తాము. నేటి నాగరిక యుగాల్లో 50-60 సంవత్సరాలు వెనుకకు పోయి చూస్తే కలరా, మశూచి, పొంగువంటి రుగ్మతలు దయ్యాలు, దేవతల చేష్టల వల్లనే సంభవిస్తాయని భావించిన సంగతులు మనకు తెలుసును.

అలాగే యేసు చేశాడని చెప్పే ఆహార అద్భుతాలు అయిదు రొట్టెలు రెండు చిన్నచేపలు వంటివి వేలాది మందికి పెట్టినట్టు చెప్పబడిన అద్భుతకథలకు ఎటువంటి ఆధారాలు లేవు. ఇట్టివన్నీ క్రీస్తు మరణానంతరం వందలాది సంవత్సరాల తర్వాత వ్రాయబడ్డాయని ఇంతకుముందే చూచాము. దీనికి ఒక్క రుజువు చాలు. ఆవగింజంత విశ్వాసము వుంటే ఎంతటి అసంభవానైనా చేయవచ్చని యేసు చెప్పిన విషయాలు సర్వాబద్ధమని నేటి దైవజనులు, ఆయా ప్రసంగికులు నేడు రుజువు చేయుచున్నారు. ఆ కారణంగా అవన్నీ కల్పిత విషయాలే! నేడు టి.వి. ప్రసంగాలందు స్వస్థతాప్రార్థనల తతంగాలను "లైవ్" ప్రదర్శనలిచ్చే "వరపసాదులు" ఏ ఒక్కరూ ఒక్కడంటే ఒక్క అన్నార్తునికి ఆకసాన్నుండి గుక్కెడు గంజినీళ్లు కూడ రావించలేరనే విషయాన్ని వైజ్ఞానిక మానవులమైన మనం గుర్తించడము అవశ్యము.

మొట్టమొదటగా ప్రింటింగ్ యంత్రాన్ని కనుగొన్న జోహన్స్ గుటెన్ బర్గ్ క్రీస్తుశకం 1453 నుండి 1456ల మధ్య అనగా మూడు సంవత్సరాలు శ్రమించి మొదటగా 180

బైబిల్ కాపీలను లాటిన్ భాషలో ముద్రించాడట. అనంతరము అందులో నుండి కేవలము 50 కాపీలు మాత్రమే లభించాయట. ఇందు మూడు మాస్టరు కాపీలలో ఒకదానిని నేటి మైక్రో సాఫ్ట్‌వేర్ దిగ్గజం బిల్‌గేట్స్ 1994లో 135 కోట్ల రూపాయలకు కొని అందరిని ఆశ్చర్యపరచాడు. అందు మరొక బైబిల్‌ను "లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్" రెండు కోట్ల రూపాయలకు స్వంతం చేసికోగా మూడవ మాస్టర్ కాపీని కూడవేలానికి పెట్టారట. దానికి ఇప్పుడు రెండు వందల కోట్లు రూపాయలు పలక వచ్చునని భావిస్తున్నారు.



ఒక పల్లెటూరి పాదిరీ విశ్వాసరావు తన సంఘస్తులను ప్రేమ విందుకు పిలచాడు. పొద్దుపోయే వరకు ప్రసంగించి గదిలోకి వెళ్లి తలుపు మూసుకొన్నాడు.
సంఘస్తులంతా ఎదురు చూడ సాగారు. మిస్టర్ హంగ్రీ పాక్స్ అనే యువకుడికి అనుమానమొచ్చి కిటిలోనుంచి చూడగా ఈ విధంగా పాదిరీ జుట్టంతా పీక్కొని ప్రార్థనలో మునిగి కనబడ్డాడు.

ఇంతటి ప్రశస్త గ్రంథంగా చెప్పబడే బైబిల్‌ను, బైబిల్ సొసైటీ వారు ప్రపంచంలో మరే ఇతర గ్రంథము లేనివిధంగా ఇది ఇంచుమించు సమస్త ప్రపంచ భాషల్లోనికి తర్జుమా చేసి అనేక బైబిళ్లను నామమాత్రపు ధరలకు విక్రయించడమే గాక, అనేక బైబిళ్లను ఉచితంగా పంపిణీ చేస్తూ ఎటా కోట్లాది రూపాయలు నష్టపోతున్నారు. వీరు బైబిల్ ప్రచారానికి ఎంతగా పాటు పడుచున్నారంటే. అసలు లిపికూడ లేని లంబాడీ వంటి గిరిజన భాషల్లోకి సైతం "దేవనాగరి-లిపి"లో బైబిల్‌ను ముద్రించి ఆయా తెగలకు శిక్షణ నిచ్చి ఉచితంగా "బైబిల్ సువార్త"లను పంపిణీ చేస్తున్నారు. చివరకు ఈ గ్రంథాన్ని అంధుల కొరకు "బ్రెయిలీ" లిపిలో కూడ ముద్రించారు. బైబిల్ సొసైటీకి ఏటా వస్తున్న నష్టాలను దాతల విరాళాల ద్వారా భర్తీచేసి కుంటూ దీని ప్రచారం చేస్తున్నారు. ఇక్కడ మనము చూడగా ఈ గ్రంథం యొక్క విశ్వవిఖ్యాతి దీని ప్రాశస్త్యాన్ని బట్టి కాక పై విధమైన చౌకబారు ఎత్తుగడల వల్లనేనని గమనించాలి. ఇది చివరకు ఎన్ని వెర్రితలలు వేస్తుందంటే కలకత్తా, ముంబయి, చెన్నైయ్, ఇండోర్ వంటి మహానగరాల నుండి సరఫరా అయ్యే కొన్ని ప్యాకింగ్ పెట్టెల లోపల తెల్లకాగితాలకు బదులుగా ఉచితంగా దొరికే బైబిల్ కాగితాలను అంటించడం నేను గత 25 సం॥కు ముందే సాగించిన వ్యాపారానికి సంబంధించిన రడీమేడ్ దుస్తుల అట్ట పెట్టెల లోపల ఈ విషయాన్ని గమనించడం జరిగింది. దీనిని బట్టి బైబిల్ సర్క్యులేషన్ బండారం





బయట పడింది.

పాతనిబంధనలో సృష్టికార్య వివరణ, యూద చరిత్రకు సంబంధించిన విషయాలు. యూద ప్రజలను యెహోవా తన స్వకీయ జనాంగంగా అభివర్ణిస్తూ అనునిత్యం వారి కొమ్ముకాస్తూ యూదేతర జాతులైన వారిని "అన్య జనాంగాలుగా" ముద్రవేసి. వారిపై విద్వేషము నూరిపోస్తూ, అడుగడుగునా వారిని అణచివేయుటకు గాను యెహోవా ఇశ్రాయేలీయులకు అనేక యుద్ధాలలో తోడ్పడుచూ, వారితో ప్రత్యక్ష సంబంధాలను కొనసాగిస్తూ, వారి దైనందిన జీవితాల్లో కలుగజేసికొంటూ, వారికి ప్రవక్తలను, న్యాయాధిపతులను, రాజులను యెహోవాయే నియమిస్తూ, బర్తరఫ్‌లు చేస్తూ ప్రత్యక్ష సంబంధాలు కొనసాగించినట్టు కనబడుతాది.

అడుగడుగునా వీరికి అనేక అద్భుతాలను కనబరుస్తూ. ఆకాశాన్నుండి ఆహారం కురిపిస్తూ బండల్లో నుండి నీళ్లురావింపజేస్తూ వారిని కాపాడడమే గాక తన యూద ప్రజలు తన్ను ధిక్కరిస్తున్నారని, తన మాటలు వినుట లేదని, అన్యదేవతలను పూజిస్తున్నారని ఏకంగా యావత్ ప్రపంచాన్ని జలప్రళయం పంపి సకల జీవరాశితో పాటు సర్వమానవాళిని చంపేశాడు. అనంతరం తిరిగి భూమిమీద నరులు విస్తరించగా తిరిగి యధాప్రకారంగా తమ యూద జాతీయుల పక్షాన నిలబడి, మరల పాతకథనే కొనసాగించాడు యెహోవా! క్రొత్త నిబంధన యేసు చరిత్ర. క్రీస్తు బోధనలు, అద్భుతాలు శిలువపై మరణం, పునరుద్ధానం, క్రీస్తు రెండవ రాకడ ఆయన శిష్యులు మొదలైన వారి బోధనలతో సాగుతుంది. అయితే సర్వ మానవాళి పాపపరిహారార్థం యెహోవా తన ఏకైక కుమారునిగా చెప్పబడిన యేసును బలియాగం గావించుటకు పంపబడ్డాడని చెప్పే యేసును, యెహోవా యొక్క స్వజనులుగా చెప్పబడిన యూదులు (ఇశ్రాయేలీయులు) అంగీకరించలేదు. అందుచే యెహోవా - పై రక్షణ మార్గాన్ని అన్యజాతులకు ఇచ్చివేశాడట. ఈ కారణంగా ఇశ్రాయేలీయులు యూద మతంలోనే కొనసాగుతూ ఉన్నారు. గాని అలనాడు అడుగడుగునా వారికి ప్రత్యక్షమై వారితో సహజీవనం సాగించినట్టుగా చెప్పబడిన యెహోవా నేడు అడ్రసులేకుండా పోయాడు. పాపం ఏమైపోయాడో ఏమో! అయితే ఇజ్రయేల్ దేశంమాత్రం అరబ్బు రాజ్యాలతో యుద్ధాలు చేస్తూ మనుగడ సాగిస్తుంది. వీరి యుద్ధాల్లో వారికి తోడుగా కందిరీగల బెటాలియన్లను మాత్రం నేడు యెహోవా పంపుటలేదు.

యెహోవా ప్రత్యర్థిగా చెప్పబడిన అపవాది (సైతాను) మాత్రం నేటికి భూమ్మీద సంచరిస్తూ క్రీస్తూ భక్తులను పాపంలో పడగొడుతూ యున్నాడని క్రైస్తవ ప్రపంచం

భ్రమపడుతూ అతనితో ఉత్తుతి యుద్ధం చేస్తుంది. చాలమంది "ఇశ్రయేలు" దేశం క్రైస్తవ దేశంగా భ్రమిస్తూయుంటారు. కానివారు క్రీస్తును నమ్మనేనమ్మరు. ఒక్క "ఓల్డ్‌టెస్ట్ మెంట్" అనగా పాతనిబంధనతోనే అదృశ్యుడైన యెహోవాను ఆరాధిస్తూ అది యూద మతంగా మాత్రమే నేటికీ కొనసాగుతున్నది. అందరూ భావిస్తునట్లుగా ఇజ్రయేల్ క్రైస్తవ దేశంకాదు. ఇటీవలి కాలంలో కొద్దిమంది యూదులు క్రైసవమతం స్వీకరించారు. అయినా వీరి సంఖ్య చాలా తక్కువే.

సాక్షి పత్రికలో ప్రచురించబడిన బైబిల్ గ్రంథ పరిచయం ఆధారంగా మరికొన్ని మార్పుటు చేర్పులతో వ్రాయబడింది ఈ వ్యాసం. సాక్షి పత్రికకు ధన్యవాదాలు.





# బైబిల్ చెప్పిన ప్రకారం సృష్టికర్త ఒక్క యెహోవాయే కాదు! మరి కొందరు "దేవుళ్లు" న్నారు!!

నేడు యావత్ ప్రపంచంలోను వేలాది క్రైస్తవ సంఘాల మధ్య సిద్ధాంత పరమైన అనేక అభిప్రాయ బేధాలతో కొనసాగుతూ యున్నప్పటికి – ప్రస్తుత బైబిల్ ప్రకారం కేవలం ఆరు దినాల్లో సమస్త సృష్టికార్యాన్ని ముగించి. ఏడవ దినాన యెహోవా విశ్రమించాడనే విషయాన్ని మాత్రం ఏక కంఠంతో అంగీకరిస్తారు. ప్రపంచ వ్యాప్తంగా ఈ విషయంపై లక్షలాది మంది భక్తాగ్రేసరులు అనర్గళంగా ప్రసంగాలు గుప్పిస్తారు. కోట్లాది మంది క్రైస్తవులు దీనిని తిరుగులేని విధంగా విశ్వసిస్తారు. సామాన్య ప్రజానీకం సంగతి అలాగుంచినా నేటి క్రైస్తవ మత గురువులకు సైతం – పై విషయం అబద్ధమనే సంగతి నామమాత్రంగా నైనా తెలియకపోవడం విడ్డూరమైన విషయం. ఇట్టి విషయాలన్నీ బైబిల్‌లోనే తేటతెల్లంగా వున్నప్పటికి దానిపై మసక చీకట్లు కమ్మింపజేసి వాటి అర్థాలను తారుమారు చేయడం జరిగింది. ఈ వ్యాసంలో ఈ సంగతులన్నీ వివరంగా చూడ గలము.

నేటి అత్యాధునిక కంప్యూటర్ ప్రపంచంలో మనము ఎంతటి క్లిష్ట సమాచారాన్నైనా, అదెందటి పురాతనమైన దైనా క్షణాల మీద అట్టి సమాచార వివరాలకు, వాటి పూర్వాపరాలు మన కళ్లముందు ప్రత్యక్షమౌతాయి. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన "వికీ్క పీడియా-ద-ఫ్రీ-ఎన్‌సైక్లో పీడియా" వెబ్ సైట్ నుండి ఇట్టి సమగ్ర సమాచారాన్ని ఇంగ్లీషులో సేకరించి దాని తెలుగు అనువాదాన్ని ఇక్కడ యథాతథంగా ప్రచురిస్తున్నాము.

విక్కి పీడియావారు తమ వెబ్ సైట్‌లో అందించిన ఈ సమాచారం కోట్లాది మంది క్రైస్తవ మతానునయులకే గాక లక్షలాది మంది క్రైస్తవ సంఘకాపరులకు, ప్రబోధకులకు నామమాత్రంగా నైనా తెలియదు. సాధారణంగా మత గ్రంథాల మూలాలకు వెళ్లి పరిశీలించే వారు బహుతక్కువ. తెలిసిన వారు సహితం దీనిని ప్రచురించే సాహసము చేయరు.

క్రైస్తవ ప్రపంచానికి దేవుడొక్కడేయని నిరూపించుటకు బైబిల్ సంస్కర్తలు ఎన్నిపిల్లి మొగ్గలు వేశారో చూడండి. ఈ చర్చ క్రైస్తవ సమాజాలకు సరిక్రొత్త అంశంగా గోచరించ వచ్చును. అదేమిటో చూడండి.

ఇంతటి తేటగా బైబిల్ చరిత్రను విక్కీపీడియా వారు ఉచితంగా యావత్ ప్రపంచానికి అందజేయగా మేధావులైన భక్తాగ్రేసరుల దృష్టి దీనిపై ఎందుకుపడలేదు? అనేక మతాలకు అనేక మంది దేవుళ్లుండగా హిందూమతానికి ముక్కోటి దేవతలున్నాయంటారు. ఆ విధంగానే యూద మతంలో కూడా అనేక మంది దేవుళ్లు కొనసాగుతూయుండే వారు. కాల ఈయూద మతం క్రమక్రమంగా ఏకీశ్వర వాదం వైపు మొగ్గు చూపుతూ వచ్చింది. కాల క్రమంలో యూద మత గ్రంథం నుండి బైబిల్‌గా (పాత నిబంధన)గా రూపు దిద్దుకొనే

సమయంలో బైబిల్ నిర్మాతలు, మతాధిపతులు కుమ్మక్కై "దేవుదొక్కడే" అనే సిద్ధాంతానికి మరింత బలం చేకూర్చనారంభించగా భాషాంతరీకరణ సమయంలో తీవ్ర ప్రయత్నం జరిగినట్లు తేటడా విదిత మౌచున్నది. బైబిల్‌లో అనేక సార్లు ఆయా ఇతర దేవుళ్ల పేర్లు రావడము, వారికి అబ్రహాము, యాకోబు బలులర్పించడము వంటి ప్రసక్తి వచ్చి, ఆదేవుళ్ల పేర్లు రాగానే దాని క్రింద "రిఫరెన్స్"లో అనగా ఇశ్రాయేలు దేవుడు...అని వివరణ ఇస్తూ అట్టి "దైవ" నామధేయాలు యెహెూవాకు చెందిన పేర్లేనని వివరించడం జరిగింది. వీరిని నేటి పరిశుద్ధ గ్రంథంలో ఎల్.,ఏల్.,ఎలోహి,ఎలోహింలుగా ప్రస్తావించబడింది. ఎల్, ల్, అనే పేర్లుగల దేవుడు పశ్చిమోత్తర సెమెట్రిక్ జాతి ప్రజలకు అత్యంత ప్రాచీనమైన దేవుడు. ఈ - ఎల్ అనే పేరు గల మూల రూపమునకు "హెహ్" (HEH) అను పదమును చేర్చి "ఎల్"ను "ఎలోహ్" గా (ELOAH) విస్తృత పరచారు. "ఎలోహ్" అనేది ఏక వచన రూపము గల దేవుని పేరు. (PROPER NOUN) ఈ ఎలోహ్‌కు బహువచన రూపమే "ఎలోహిం" హిబ్రూ భాషలో ఒక పదమును బహువచనముగా మార్చుటకు చివర ("Im") ను చేర్చెదరు. గనుక ఎలోహ్‌కు బహువచనముగా ఎలోహిం లేక ఎలోహ్‌లు అని అర్థం. ఈ ప్రకారం గానే ఏక వచన రూపమును దేవుడు అని, బహువచన రూపములో దేవుళ్లు అని యూద మత గ్రంథంలో వ్రాయబడింది. హిబ్రూ భాషలో ఒక వాక్యము లోని "కర్త" ను అనుసరించి క్రియా పదము యొక్క రూపము మారుతుంది. అందుచే ఏక వచన క్రియను బహువచనముగా దేవుళ్లు అని చెప్పుటకు "ఎలోహిం"ను బహువచన క్రియగా ఉపయోగించబడింది.

ఈ విధంగా బైబిల్ గ్రంథాన్ని యూద మత మూల గ్రంథం నుండి తర్జుమా చేయబడిన బైబిల్ గ్రంథంలో ఈ ఎలోహులనే దేవుళ్ల ప్రసక్తి వచ్చినప్పుడల్లా రిఫరెన్సులో "దేవుడు" లేక "ఇశ్రాయేలు దేవుడు"..."బేతేలు దేవుడు" అంటూ చాకచక్యంగా తర్జుమాచేసి బైబిల్ సంస్కర్తలు పై పదాలకు సన్నాయి నొక్కులు నొక్కి ఆయా దేవుళ్లను మరుగు పరచుటకు నానాతంటాలు పడి ఏకీశ్వర వాదాన్ని ప్రతిపాదించ ప్రయత్నించారు.







పై చిత్రాన్ని "విలియం బ్లేక్" అనే చిత్ర కారుడు చిత్రించాడు. ఎలోహిం అనే దేవుడ్ని మానవ రూపంలో చిత్రించాడు ప్రాచీన మానవులందరూ తమ తమ దేవుళ్లను కూడ తమ రూపంలోనే ఉంటార• భావిస్తూ వచ్చారు. ఆ ప్రకారమే వారిని రూపొందించారు. దేవుళ్లు ఆకాశంలో నివసిస్తారు గనుక వారు భూమి మీదికి దిగి రావాలంటే రెక్కలుండాలని భావించి వారిని రెక్కలతో చిత్రించారు. ఈ విధంగా మానవ రూపంలో నున్న ఎగిరే దేవుళ్లుగా భావించడం జరిగింది.

ఎలోహిం క్రింద పండుకొని యున్న మనిషి ఆదాము. "ఆదాము" అనునది పేరుకాదు. అదాము అనగా హిబ్రూ భాషలో "నరుడు" అని అర్థం. ఎలోహిం ఆదామును మంటితో చేశాడు కాబట్టి తడిమట్టితో ఏదయినా రూపాన్ని చేయాలంటటే నేలమీద పరుండబెట్టి యున్న భంగిమతోనే చేయాలి కదా! అని పదుకున్న భంగిమలోనే శిల్ప కారుడు పై చిత్రాన్ని రూపొందించాడు. ఈ చిత్రములో మనకు ఆదామును చుట్టుకొని యున్న సర్పము కూడ కనబడుచున్నది. ఆదాముకు జ్ఞాన ఫలము తినిపించి జ్ఞానము కలిగించిన సర్పము ఆదాము సృష్టించబడిన వెంటనే అతడు లేచి నిలబడక ముందే ఆదాము మనస్సుతో పాటు అతని దేహాన్ని కూడ తన వైపు త్రిప్పుకొన్న దానికి సాదృశ్యముగా ఆదామును పాముచుటుకొన్నట్టుగా కళాత్మకంగా ఇక్కడ రూపొందించబడింది.

యూదుల దైవభావము అనేక మార్పులు చెందుతూ వచ్చింది. B.C. 7వ శతాబ్దములో యూదులు బహుదేవతా రాధికులు. వారికొక ప్రధాన దేవునితో పాటు ఇతర దేవతలు, దేవుళ్లు వుండేవారు. కాలక్రమంలో బాబిలోనియనుల "చెర" కాలము అనంతరం యూదులు క్రమక్రమంగా ఏకీశ్వరవాదం వైపు తిరుగుతూ వచ్చారు. "రబ్బీ"ల కాలం నాటికి అనగా క్రీస్తు శకము 2వ శతాబ్దము నాటికి వీరు పూర్తిగా ఏకీశ్వర వాదం స్వీకరించడం జరిగింది. యావత్ ప్రపంచంలోను ప్రప్రథమంగా ఏకీశ్వర వాదం స్వీకరించిన మొట్టమొదటి మతం యూదమతం (JUDHISM). ఈ నేపథ్యంలో యూదులు అప్పటి వరకు తాము ఆరాధిస్తూ వచ్చిన అనేక మంది దేవుళ్లను, దేవతలను మరుగుపరచి ఇస్రాయేలీయులు తమ ఏకైక దేవునిగా "యెహెూవా"ను పేర్కొని ఆయనే ఈ విశాల విశ్వాన్ని సృష్టించిన దేవునిగా "రూపొందించి" ప్రచారం చేశారు. గనుక హిబ్రూ బైబిల్‌కు తర్జుమాగా క్రైస్తవులు రూపొందించిన "పరిశుద్ధ గ్రంథము" అనే పేరు తెలుగులో ప్రచురించిన బైబిల్‌లోని వాక్యములు పరిశీలించగా సృష్టికార్యం చేశారని చెప్పేదేవుళ్లు ఎవరు?...ఎంతమంది? వారిలో యెహెూవా స్థానాము ఏమిటి? అనే విషయాలు తెలిసి కొందాము.

బైబిల్ నందలి ఆదికాండంలో మొదటి అధ్యాయము, రెండవ అధ్యాయ మందలి 3వ వచనము వరకు సృష్టిక్రమము వర్ణింపబడింది. ఆదికాండ ప్రారంభంలో ఆదియందు "దేవుడు" భూమ్యాకాశములను సృజించెను అని తర్జుమా చేయబడింది.

**బైబిల్‌లో మనము గమనించగా "దేవుడు"** అని తర్జుమాచేయబడిన పదము హిబ్రూ బైబిల్ మూల ప్రతిలో "ఎలోహిం" అనియుంది. ఈ ఎలోహిం అనే పదము బహువచన పురుషలింగంగా మొదటే మనము తెలిసి కొన్నాము. అసలు బైబిల్ నందలి ప్రప్రథమ వాక్యము "ఆదియందు" "ఎలోహ్‌లు" భూమ్యాకాశములను సృజించిరి అని తర్జుమా చేయాలి. కాని ఇతర దేవుళ్ల పేర్లను రూపు మాపుటకు వారి పేర్లకు బదులుగా "దేవుడు" అని బైబిల్ నందు తర్జుమా చేశారు. ఈ విధంగా వారి పేర్లను తొలగించి వ్రాయుటకు వారికి ధైర్యము చాలక మొదటి అధ్యాయమంతా దేవుడుగా కొనసాగించి రెండవ అధ్యాయం 4వ వచనం నుండి దేవుడైనా యెహోవా అనే నామాన్ని ప్రవేశపెట్టారు. బైబిల్ ప్రారంభమందే సృష్టిని చాలామంది దేవుళ్లు కలసి చేసినట్టుగా మరొక వాక్యంలో దొరికి పోవడము జరిగింది. మనము (ఆదికాండము 1:26)వ వాక్యము చూడగా దేవుడు మన స్వరూపమందు..."మన పోలికె చొప్పున నరులను చేయుదము" అని చెప్పబడిన వాక్యము కూడ అనేక మంది దేవుళ్లు కలసి సృష్టి కార్యాన్ని చేసినట్టు తేటగా కనబడుచున్నది. ఈ ప్రకారంగా సృష్టికార్యము ఆరురోజుల్లో పూర్తి చేసి ఏడవ దినాన విశ్రమించిన దేవుళ్లు ఎలోహులన్న మాట. లేదా ఎలోహిం.

యెహోవాను ఏకైక దేవునిగా ప్రచారము చేసిన మత సృష్టికర్తలు యెహోవా కుమారునిగా యేసును ప్రచారం చేశారే గాని మనము క్రొత్త నిబంధన అంతా తిరగేసినా యేసు నోటి నుండి యెహోవా నా తండ్రి! యని ఒక్కసారైనా రాకపోవడం చిత్రమైన విషయం! అంతేకాదు క్రొత్తనిబంధనలో ఎక్కడా యెహోవా అనే మాటగాని, పాతనిబంధనలో యేసు అనే పదముగాని మనకు కనచడదు. యేసు నా కుమారుడని యెహోవా, యేసుపెరెత్తి ఎక్కడా పలుకలేదు. అలాగే ఏసు కూడ యెహోవా నా తండ్రి అని చెప్పలేదు.

బైబిల్ లేఖనముల ప్రకారము సృష్టికర్తలు "ఎలోహిం"లు అనగా అనేకులైన ఎలోహ్ అనే పేరుగల దేవుళ్లు వారు ఆరురోజులు పనిచేసి ఆది కాండం 1:1 నుండి ఆది 2:3 వరకు సృష్టికార్యం చేసినట్టు చెప్పబడిందేగాని యెహోవాయే సృష్టించాడని చెప్పబడలేదు. సమస్త ప్రపంచం యావత్ సృష్టి కేవలం B.C. 4004వ సంవత్సర ప్రాంతాలందే సృజించబడిందని బైబిల్ చెబుతుంది.





మోషేకు సీనాయి కొండమీద ప్రత్యక్షమైనప్పుడు నా పేరు యెహోవాయని పరిచయం చేసికొన్నాడు. ఈ సంఘటన జరిగింది బైబిల్ లెక్కల ప్రకారం B.C. 1573వ సంవత్సరంలో కాబట్టి బైబిల్ లేఖనముల ప్రకారం సృష్టి జరిగిన 2,421 సంవత్సరాల తరువాత అన్నమాట. అయితే సృష్టిక్రమము లెక్కల ప్రకారం సృష్టి జరిగిన 2,421 సం॥ల ముందే వ్రాయబడిన సృష్టి క్రమంలోనే యెహోవా పేరు ఎలా వ్రాయబడింది?



*బైబిల్ సృష్టి కార్యం కేవలం ఆరేడు వేల సంవత్సరాల క్రితమే జరిగిందని కాకి లెక్కలు చెబుతూ యుండగా అదే నిజమని సమస్త క్రైస్తవ ప్రజానీకం నిస్సందేహంగా నమ్ముచున్నారు.*

*అయితే మన కళ్లముందు సాక్ష్యాధారాలతో సహా నిరూపించబడుచున్న ఈ శాస్త్రయుక్తమైన యథార్థాన్ని మీ మనోనేత్రాలతో గాక బాహ్యనేత్రాలతో పరికించి చూడండి!*

*డెబ్బది (70) మిలియన్ సంవత్సరాలు అనగా ఏడుకోట్ల సంవత్సరాల నాటి డైనో సార్ కళేబర అవశేషాలు 1946లో సోవియట్ మంగోలియాలో "గొబి" ఎడారిలో కనుగొన్నారు. 24 అడుగుల పొడవైన శరీరం, ఎనిమిది అడుగుల పొడవైన తోక కలిగిన "తెరన్నో సారస్" అనే తెగకు చెందిన ఈ డైనోసార్ బరువు టన్ను వరకు వుంటుందని అంచనా వేశారు. అద్భుతమైన ఈ చారిత్రాత్మిక అవశేషం మంగోలియాలోని నెమెడ్జ్ ప్రాంతానిదని నిపుణులు నిర్ధారించారు. ఈ విధంగా ప్రపంచ వ్యాప్తంగా జంతు, వృక్ష జాతులకు చెందిన అనేక శిలాజాలు లభ్యమయ్యాయి. ఇట్టి శిలాజాలు: కేవలం ఆరేడు వేల సంవత్సరాల క్రితమే విశాల విశ్వంలో జంతు జాలాలు. నరులు సృష్టించబడ్డారని బైబిల్ చెప్పే కల్పిత గాథలను పటాపంచలు చేస్తున్నాయి. (22-6-2012 "వార్త" నుండి సేకరణ)*

బైబిల్ సృష్టికార్యం అబద్ధమని నిరూపించుటకు అనేకమైన వృక్ష, జంతు, మానవ శిలాజాలు మనకు లభించాయి. అయితే అవి అలనాటి నిర్జీవ శిలాజాలు.



ఈనాడు హైదరాబాద్

మంగళవారం 10 జులై 2012

# ఆ జీవుల వయసు 8.6 కోట్లు!

ఆ జీవులు... కొత్తగా బయటపడ్డాయి... శాస్త్ర వేత్తలు పరిశీలించారు... ఆపై ఆశ్చర్యపోయారు... ఎందుకో తెలుసా? వాటి వయసు 8 కోట్ల 60 లక్షల ఏళ్లు! ఇంతకీ ఏంటవి? సూక్ష్మజీవులు!!

ఇక్కడ మనము చూస్తున్న జీవులు అత్యంత ఆశ్చర్యకరమైన రీతిలో ప్రతికూల వాతావరణంలో కూడ వాటి సంతతినశించి పోకుండా 8 కోట్ల 60 లక్షల సంవత్సరాలుగా జీవించియున్న ఈ సూక్ష్మజీవులను శాస్త్ర వేత్తలు కనుగొనడం మహాద్భుతం!

**<u>ఈ ఎలోహీలనే దేవుళ్ల ప్రస్తావన బైబిల్‌లో మరికొన్ని చోట్ల కూడ తేటతెల్లంగా కనబడుతాది.</u>**

ఆది కాండము 32వ అద్యాయము (32:22-31) వరకు చూస్తే ఆ రాత్రి... అక్కడ యాకోబు ఒక్కడు మిగిలి పోయెను. ఒక "నరుడు" తెల్లవారు వరకు అతనితో పెనుగులాడెను. తాను అతని గెలువకుండట చూచి తొడగూటి మీద అతనిని కొట్టెను. అప్పుడతడు పెనుగులాడుట వలన యాకోబు తొడగూడు వసిలెను. తెల్లవారుచున్నది గనుక నన్ను పోనిమ్మనగా అతడు నీవు నన్ను ఆశీర్వదించితేనే గాని నిన్ను పోనియ్యననెను. ఆయన నీ పేరిమిటని అడుగగా అతడు "యాకోబు" అని చెప్పెను. అప్పుడాయన నీవు దేవునితోను, మనుష్యులతోను పోరాడి గెలిచితివి గనుక ఇకమీదట నీ పేరు "ఇశ్రాయేలే" గాని యాకోబు అనబడదని చెప్పి అక్కడతనిని ఆశీర్వదించెను... అప్పుడు యాకోబు నీపేరు దయచేసి తెలుపుమనెను... యాకోబు నేను ముఖాముఖిగా దేవుని చూచి తిని





అయినను నా ప్రాణము దక్కినదని ఆ స్థల మునకు "పెనూయేల్" అనుపేరు పెట్టెను.

తనతో పోరాడిన దేవుడు ఎల్...ఎలోహ అనే దేవుళ్లకు సంబంధించిన "యేల్" గా ఆ స్థలమునకు "<u>పెనూయేల్</u>"గా నామకరణం చేసినట్టుగా కనబడుచున్నది.

ఇస్సాకు కుమారుడైన యాకోబు ఇశ్రయేలుగా పిలవ బడ్డాడు. పై బిరుదును యాకోబుకు ఇచ్చింది ఎలోహేయి అను దేవుడే!

యాకోబు యెహోవాకు బలిపీఠం కట్టించి ఆరాధించిన విషయం ఇక్కడ మనము చూడగలము.

(యాకోబు) షెకెము తండ్రియైన హమోరు కుమారుని యొద్ద పొలమును నూరు వరహాలకు కొని అక్కడ ఒక బలిపీఠమును కట్టించిదానికి "ఏల్ ఎలోహేయి" ఇశ్రాయేలు అనుపేరు పెట్టెను. ఈ వచనమును గూర్చి బైబిల్ రిఫరెన్సులో ఏల్ ఎలోహెాయి అనగా ఇశ్రాయేలు దేవుడే దేవుడు అని అర్థం చెప్పబడింది. (ఆదికాండం 33:19,20)

తిరిగి మనము ఆదికాండము 35:7,8 వచనాలు చూడగా: యాకోబుకు దేవుడు ప్రత్యక్షమైనట్టును, అక్కడ అతనొక బలి పీఠము కట్టించి ఆచోటికి కూడ "ఏల్ బేతేలు" అనే పేరు పెట్టడం జరిగింది. దీనికి కూడ బైబిల్ తర్జుమా కర్తలు బేతేలు దేవుడని చక్కగా వివరించారు.

| |
|---|
| ఇంతేగాకుండ కీర్తనల గ్రంథము, *82:1,2* చూడగా : దేవుని సమాజములో దేవుడు నిలిచియున్నాడు. దైవముల మధ్యన ఆయన తీర్పుతీర్చుచున్నాడు. ఎంతకాలము మీరు అన్యాయముగా తీర్పుతీర్చుదురు? ఎంతకాలము భక్తి హీనుల ఎడల పక్షాపాతము చూపుదురు? |

కీర్తనలు 82:6 మీరు దైవములనియు, మీరందరు సర్వోన్నతుని కుమారులనియు నేనే సెలవిచ్చియున్నాను. ఈ రెండు వాక్యాలను మనము చూడగా : "దేవుని సమాజములో దేవుడు నిలిచియున్నాడు. దైవముల మధ్యన ఆయన తీర్పు తీర్చుచున్నాడు" అనే వాక్యం యొక్క బావమేమిటి?

దేవుళ్ల యొక్క "యూనియన్"లో దేవుడు (యెహోవా) నిలచి ఏకంగా దేవుళ్లకే తీర్పుతీర్చినట్టుగా కనబడుచున్నది. దేవుళ్లారా! మీరు ఎంతకాలము భక్తిహీనుల పక్షానవుండి అన్యాయపు తీర్పులిస్తారు? అని మందలించడమేగాక మనుష్యుల వలెనే మీరు కూడ చావక తప్పదని హెచ్చరించి నట్టుగా కనబడు చున్నది. ఈ వాక్యాలను బట్టి బైబిల్ నందు యెహోవా ఒక్కడే కాక అనేక మంది దేవుళ్లున్నట్టు తేటగా కనబడుచున్నది.

ఇంతేగాక యేసు తన సిలువ మరణ సమయములో నయినా యెహోవాను తనతండ్రిగా ఒప్పుకొనక కనీసం యెహోవా పేరైనా ఎత్తకుండ ఆఖరు గడియలో పలికిన

పలుకులు వినండి..."ఎలోయీ...ఎలోయీ...లామా! సభక్తానీ" అంటూ బిగ్గరగా కేకలు వేస్తూ మరణించాడు. ఇంతవరకు మనము చర్చించిన యెలోహ్‌లను జ్ఞప్తికి తెచ్చుకొని కేకలు వేస్తూ మరణించాడేగాని యెహెూవాను నామ మాత్రంగా నైనా తలంచక పోవడం చిత్రమైన సంగతి.

**ఈ ఎలోయీ అనే పదం యొక్క ఏక వచన రూపం. ఎలోహ్‌నకు "అరమేయిక్" రూపము. ఈ అరమేయికి భాష అలనాడు పాలస్తీనాలో వాడుక భాషగాయుండేది. యేసుమరణ సమయంలో యెహెూవాను కాక తన తండ్రియైన ఎలోహ్‌ను తలచాడని పిస్తుంది. దీనికి కూడ బైబిల్ తర్జుమా కర్తలు నిజాన్ని దాస్తూ "ఎలోయి! ఎలోయీ లామా! సభక్తానీ!" అనే మాటకు నాదేవా! నాదేవా! నన్నెందుకు చేయివిడిచావని అర్థంచెప్పి ఊరుకున్నారు. ఇవి ఇంతవరకు మనము చెప్పుతున్న దేవుళ్లే! దీనిని ప్రశ్నించిన వారేలేరు!**

అసలు యేసుకు శిలువ మరణ మంటే ఇష్టం లేదులాగుంది. లేకుంటే తండ్రీ! నీ చిత్తమైతే ఈ "గిన్నె" నాయెద్ద నుండి తొలగించండని ప్రార్థించియుండేవాడు కాదేమో!

ఆఖరుగా ఈ ఏల్-ఏలోయి-ఎలోహీల ప్రభావం క్రైస్తవుల మీదనే కాదు మొత్తం పరిశుద్ధ గ్రంథం మీద చివరకు యేసు మీద కూడ వీరి ప్రభావం ఎంతగా పడిందో చూడగలరు. మొత్తానికి ఈ ఎలోహీలను ఎంతగా మరుగుపరచి, యెహెూవాను మాత్రమే తండ్రియైన దేవునిగా నిలుప ప్రయత్నించినా జరిగిందేమిటో చూడండి!

బైబిల్ నిండా ఈ ఎలోహీలకు సంబంధించిన పేర్లే అధికంగా కనబడతాయిగాని యెహెూవాకు సంబంధించిన పేర్లు నామ మాత్రంగానే కనబడతాయి. ఇట్టి దేవుళ్ల పేర్లు వట్టి మనుష్యులకే గాక...దేవుళ్లకు, దేవ దూతలకు ప్రవక్తలకు కూడ పెట్టబడి యావత్ బైబిలు "ఏల్"లతో నిండి పోయింది. మచ్చుకు కొన్ని చూద్దాము.

జగద్రక్షకుడుగా చెప్పబడిన ఏసుకు "ఇమ్మానియేల్", గాను దేవదూతలకు గాబ్రియేల్, మిఖాయేల్, రఫాయేల్; ప్రముఖ ప్రవక్తలకు...సమూయేల్, దాని యేలు, యోవేలు, నథానియేల్, ఏలీ, ఇశ్శాయేల్ ఇశ్రాయేల్ గాను, తదితరులకు సల్తాయేల్, కొర్నేలు, ఎలీహు, దయావేలు, షెలూయేలు, నెతనేలు, ఫగీయేలు, సూరియేలు, గబీయేలు, వుండగా, యూదమతానికి, క్రైస్తవులకు చెందిన "ఏకైక దేవునిగా" చెప్పబడే యెహెూవా నామాన్ని తగిలించుకొన్నవారి సంఖ్య వ్రేళ్లమీద వెక్కించవచ్చును....యెహెూషువా యెహెూషాపాతు, యెహూ, యెహెూనాదాబు, యెహెూయాకీము, యెహేజ్కేలు, యెహెూరాము మొదలైనవి మాత్రమే కనబడతాయి.

ఇంతవరకు బైబిల్ పై అనేక విమర్శలు వచ్చాయి కాని దేవుడొక్కడే యని చెప్పుకొనే పరిశుద్ధ గ్రంథంలో ఇతర దేవుళ్ల ప్రసక్తి బహుషా చర్చకు రాలేదనుకుంటున్నాను. ఎవరి





సంగతి ఎలాగున్నా ఈ చర్చను చూచిన టి.వి. ప్రసంగికుల గొంతుల్లో పచ్చివెలక్కాయ పడినట్లుండ వచ్చును. ఇంత వరకు క్రైస్తవ సమాజాలను ఒక్క యెహెూవాను గూర్చి సర్వోన్నతుడైన దేవునిగా, యేసుకు గూర్చి లోక రక్షకునిగా మాత్రమే చెప్పబడి నందున సామాన్య క్రైస్తవ సమూహాలకు ఎలోహీల ప్రస్తావనను వారెవరూ అర్థం చేసికోలేరు. ఈ కారణంగా ఈ ఎలోహీలను ప్రక్కన బెట్టి యెహెూవా యేసులపైనే విమర్శలు కొనసాగుతాయి. ఏది ఏమైన బైబిల్‌నందు యెహెూవా యేకాక "యెలోహ్"లనే దేవుళ్ల ప్రసక్తి వుండడం మాత్రం కాదనలేని సత్యం.

మరొక ముఖ్య విషయము మనము గమనిస్తే ఇస్లాము స్వీకరించిన "అల్లాహ్" ఈ "ఎలోహిం"ల నుండే స్వీకరించినట్టుగా కనబడుచున్నది.

# బైబిల్ సృష్టి కార్యానికి పూర్వగాథ... అపవాది - ఆవిర్భావం!

ఆదికాండ గ్రంథమండలి రెండం అధ్యాయములో (దేవుడు) "భూమ్యాకాశములను చేసిన దినమందు"... "భూమ్యాకాశములు సృజించబడినప్పుడు" అని రెండు సార్లు రెండు విధాలుగా వ్రాయబడింది. దీనిని బట్టి ఆదికాండ సృష్టి కన్నా ముందుగానే యెహెూవా మరో సృష్టి గావించినట్టు బైబిల్ పరిశోధక మేధావులు అలనాటి (పశ్చిమ గోదావరి జిల్లా) ప్రాంత మిషనరీయైన సైలస్‌ఫాక్స్, మరికొందరు ప్రసంగికుల ద్వారా నాచిన్న తనంలో విన్నాను. అంతేగాక సైలస్ ఫాక్స్ అప్పుడు తాను నడిపించిన "క్రైస్తవ నిరీక్షణ" అనే మాసపత్రికలో ఇట్టి విషయాలు చర్చించేవారు. దీనిని మా తల్లిదండ్రులు చర్చించుకొంటూ యుండగా యీకథా సాంగ్రహాన్ని వినడం జరిగింది. కాని నేటి క్రైస్తవ బోధకులు ఇట్టి గందరగోళ కథలు జోలికి వెళ్లరు. అసలు చాలా బైబిల్ కథనాలను మనము పరిశీలించగా భూత భవిష్యత్ వర్తమాన గ్రాహియైన యెహెూవాకు రేపు ఏమి జరగ బోతుందో బొత్తిగా తెలియని సందర్భాలు చాలా కనబడతాయి.

యిర్మియా 4:23-26లో చూస్తే..... నేను భూమిని చూడగా అది నిరాకారము గాను, శూన్యము గాను వుండెను. పర్వతములను చూడగా అవి కంపించుచున్నవి. నేను చూడగా నరుడొకడునువేడు. ఆకాశ పక్షులన్నీ ఎగిరిపోయెను. అందులోని పట్టణములన్నియు యెహెూవా కోపాగ్నికి నిలువలేక పడగొట్ట బడెను. అని యుంది. ఆదికాండము ప్రారంభమందు ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. భూమి నిరాకారము గాను శూన్యము గాను వుండెను. చీకటి అగాధ జలములు పైన కమ్మియుండెను. అని ప్రారంభించ బడింది. ఇంకా మరికొన్ని ఆధారిత వాక్యాలకు అనుగుణంగా ఈ పూర్వగాధా వృత్తాంతాన్ని కొందరు పూర్వ బైబిల్ మేధావులు చెబుతూ యుండేవారు. కాని దీని కంతగా ప్రచారములేదు. దీనికి సంబంధించిన వివరాలు బైబిల్ నందు అక్కడొక ముక్క ఇక్కడొక ముక్క కనబడుతూయుంటాయి. అనగా బైబిల్ సృష్టికి ముందు మరో సృష్టిగాని, మానవ సమాజాలు గాని వుండేవేమో! ఎవరికి తెలియదు. మనము మొదట చూచిన యిర్మియా 4:23-26 ను బట్టి పై విషయాలు ఊహిస్తూయుంటారు.

యెహెూవా మొదట భూమ్యాకాశాలను సృజించాడని దాని మీద తన కోటాను కోట్ల మంది దేవదూతా సమూహాలను వుంచి వారందరి పైనా లూసీఫరు అనే దూతను ప్రధానిగా నియమించినట్టుగా చెబుతారు. ఆ ప్రధాన దూత నవరత్న ఖచిత మణి మాణిక్యాలను ధరించి స్పురుద్రూపియై సింహాసన మెక్కి అంగరంగ వైభవంగా పాలిస్తూయుండేవాడట.

**నెల్సన్ రష్దీ**






ఆ ప్రధాన దూతయైన లూసీఫరు అందగాడే గాక తన రెక్కలు విప్పితే శ్రావ్యమైన సంగీత ధ్వనులు వినవస్తూ అలరించేవట. దీనికి తోడు సితార, స్వరమండలము, పిల్లనగ్రోవులతో సంగీత ధ్వనుల మధ్య పాటలు పాడుతూ, నాట్యాలు చేస్తూ "మైకిల్ జాక్సన్" వలె బృందగానాలు చేస్తూ యెహెూవాను స్తుతిస్తూ యుండేవాడట. ఇంతటి అహ్లాద కరజీవితం గడుపుతూ యుండగా ఒకనాడు లూసీఫరు గర్వాంధుడై తాను ఆ ఉత్తరదిక్కున నున్న సభాపర్వతము మీద యెహెూవా యొక్క సింహాసము మీద కూర్చుంటే యెహెూవాతో సమానుడనై పోతాను కదాయని తలంచాడట. అలా తలచిన దేతడవుగా ఈ విషయం యెహెూవాకు తెలిసి ఆగ్రహెూదగ్రుడై ఆఘ మేఘాల మీద అక్కడికి అరుదెంచి లూసీఫరును, అతనికి వత్తాసు పలికిన అనేక మంది దేవదూతలను కనీసం విచారణ అయినా చేయకుండ ఆకాశ విశాలంలోనికి గెంటి వేయడం జరిగిందట. ఇదే విషయాన్ని మరికొన్ని రకాలుగా కూడ చెప్పబడింది.

ఈ బైబిల్ పూర్వగాథ - కథాసాంగ్రహంగా లేదు. ఇర్మియా, యెషయా, పేతురు, యూదా గ్రంథాలందలి వాక్యాల ఆధారంగా ఈ విషయాన్ని వివరించడం జరిగింది.

**నెల్సన్ రష్దీ**

సాధారణంగా ఏదయినా దొంగతనం లేక హత్యలు జరిగినప్పుడు ఆయా వ్యక్తుల గుర్తులు "కూ" ఏదో ఒకటి విడిచి వెళ్తారు. వేలిముద్రులు కావచ్చు, ఆవ్యక్తికి సంబంధించిన వస్తువుకావచ్చు. దాన్నిబట్టి నేరస్తుని గుర్తించే అవకాశం కలుగుతుంది.

అయితే ఈ రచయితలు ఈ అపవాది తిరుగుబాటు సందర్భంలో ఒక పదప్రయోగం చేశారు. అదేమంటే "ఉత్తర దిక్కుననున్న సభాపర్వతం మీద యెహోవా సింహాసనం" అని వ్రాశారు. యీ దేవదూతల తిరుగుబాటు సమయానికి ఇంకా సూర్యచంద్ర నక్షత్రాదులను యెహోవా సృష్టించలేదు. అవేమిలేకుండానే కోట్లాదిమంది దేవదూతలతో లూసీఫరు అక్కడ "రాజ్యము" ఏలినట్లు చెప్పబడింది. ఈ సందర్భంలో బైబిల్ రచయితలు "ఉత్తర దిక్కున నున్న సభా పర్వతము"అని వ్రాశారు. అప్పటికి సూర్యుడనే వాడే లేనప్పుడు తూర్పు పడమర ఉత్తర దక్షణాలనే పదాలే వుండియుండవు కదా! దీనినిబట్టి ఈ బైబిల్ రచయితలు ఈ సృష్టికథనం తాలూకు అపవాది కథవ్రాసే సమయానికి విశాలవిశ్వం అంతా యథాతథంగా వుందన్నమాట. అనాలోచితంగా వారు "ఉత్తదిక్కు" అని వ్రాసి చేతులు కాల్చుకున్నారు.

జరిగిందేదో జరిగిపోయిందనుకుందాము. పోనీ మరొక సమర్థుడైన వాడిని ప్రధానిగా నియమించక నాయంతటి వానిపైనే తిరుగుబాటు యత్నమా యనుకున్నాడో ఏమో! కోపోద్రిక్తుడై ఎలుక దూరిందని ఇంటికి నిప్పు పెట్టిన చందాన అలనాటి "యావత్" సృష్టిని చిన్నాభిన్నం గావించి భూమిని నిరాకారము గాను, శూన్యం గాను మార్చి వేసింది చాలక యావత్ ప్రపంచాన్ని జలదిగ్బంధం గావించి, చిమ్మచీకట్లు కమ్మించి, తనకు కూడ శిక్ష విధించుకున్న చందాన యెహోవా ఆత్మరూపుదాల్చి ఆగాధాంధకార అగాధ జలములపై అల్లాడుతూ వుండి పోయాడట. పాపం యెహోవాకు బొత్తిగా భవిష్యత్ జ్ఞానం లేనందున ఇలా జరిగియుండ వచ్చును. యెహోవా చరిత్రచూస్తే... ఒకసారి ప్రపంచంలో పాపం పండిపోయిందని యావత్ ప్రపంచాన్ని జలప్రళయంలో ముంచి చంపేశాడు. అయినా పాపం - ప్రపంచం తిరిగి పాపపంకిలపైమైపోయింది. ఇలా ఆయనకు ఇల్లుపీకి పందిరి వేయడం అలవాటే!

ఈ కథనానికి సంబంధించిన ఆధారిత వాక్యాలు బైబిల్ నందు కొన్ని చూద్దాము. యెషయా. 14:13-15 నేను ఆకాశమున కెక్కి పోయెదను. దేవుని నక్షత్రమునకు పైగా నా సింహాసనమును హెచ్చింతును ఉత్తర దిక్కున నున్న సభా పర్వతము మీద కూర్చుందును. మేఘ మండలము మీదికి ఎక్కుదును. మహోన్నతునితో నన్ను సమానంగా చేసి కొందును అని నీవు మనస్సులో అనుకొంటివి గదా! నీవు పాతాళమునకు నరకములో ఒక మూలకు త్రోయ బడితివే!..... యెహెజ్కేలు 19:11-14 లందు ఈ లూసీఫరును గూర్చి నర్మగర్భితంగా వ్రాయ బడినట్టుగా చెబుతారు..... భూపతులకు దండములైనట్టి గట్టిచువ్వలు దానికి కలిగి యుండెను. విస్తారమైన దాని కొమ్మలు బహుఎత్తుగా కనబడెను. అయితే





బహురౌద్రము చేత అది పెరికి వేయబడినదై నేల మీద పడవేయబడెను..... మరియు దాని గట్టిచువ్వలు అగ్ని చేత కాల్చివేయబడెను.... అని వ్రాయబడింది....

ఈ విధంగానే పరోక్షమైన రీతిలో మర్మమైన విధంగా తూరురాజుతో అపవాదిని పోల్చుతూ యెహెజ్కేలు 28:12-19లో..... నీవునియమించబడిన దినమున పిల్లనగ్రోవులు వాయించు వారును నీకు సిద్ధమైరి. అభిషేకమునొందిన కెరూబువై ఒక ఆశ్రయముగా నీవుంటివి. అందుకే నేను నిన్ను నియమించితిని. దేవునికి ప్రతిష్టించబడిన పర్వతము మీద నీవుంటివి. కాలుచున్న రాళ్లమధ్యను నీవు సంచరించుచుంటివి. నీవు నియమించబడిన దినము మొదలు కొని పాపము నీయందు కనబడు వరకు నీ ప్రవర్తన విషయములో నీవు యథార్థ వంతుడవైయుంటివి..... నీ సౌందర్యమును చూచుకొని నీవు గర్వించిన వాడవై నీ తేజస్సు చూచుకొని నీ జ్ఞానమును చెరుపుకొంటివి. కావున నేను నిన్ను నేలను పడవేసెదను.

యెహోవా! ఈ దేవదూతలను గూర్చి ఎంతమంచి సాక్ష్యమిచ్చాడో చూడండి! ఈ లూసీఫరు "పాపం" చేసిన తరువాత అనంతరం వాడిపై అపవాదిగా ముద్ర వేసిన తరువాత అపవాదిని గూర్చి కాస్త విచారిస్తూ ఏమయ్యా లూసీపరు! నీ జీవితము ఎంతటి అంగరంగ వైభవంగా యుండేది! నీవు అద్భుతమైన మ్యూజిక్ డైరక్టలా గుండేవాడివి. నీవు అభిషేకించబడిన "కెరూబు" (దేవదూత) వలె ఒక పెద్దదిక్కుగా యుంటివి. దేవుడినైన నాకు ప్రతిష్టించబడిన "మౌంటన్" మీద నిన్నుంచాను. ఖనఖనమని కాలుచున్న రాళ్ల మధ్య నీవు ఠీవిగా శికార్లు చేసేవాడివి. నేనునిన్ను ప్రధాని పదవిలో నియమించగా నాటి నుండి చాలా కాలము వరకు నీ "కేరక్టర్" ఎంతో యథార్థంగా యుండేది. నీ అనన్యసామాన్యమైన నీ సౌందర్యం అంతా ఇంతాకాదు. నీ తేజస్సు తెగవెలిగి పోయేది. నీ అసమాన సౌందర్యాన్ని, తెలివి తేటలను చేజేతులా పాడుచేసి కొన్నావు ఆ కారణంగానే నీవు నేలమీదకు పడద్రోయ బడితివని యెహోవా లూసీఫరును తలచుకొని తలచుకొని కుమిలి పోయినట్టు మనకీ పై వాక్యాలు కనబడుచున్నాయి.

**భూమికి పునాదులు వేయకముందే నీవెవడివో ఏమిటో...అన్నీ నాకు ముందే తెలుసునని..... జీవగ్రంథంలో మీ మీపేర్లు వ్రాయబడియున్నాయని భవిష్యత్ సంగతులను ఎంతో మహోన్నతంగా చెప్పుకున్న యెహోవా! పాపమీ! అపవాది విశయంలో పప్పులో కాలేశాడు. కొరివితో తలగోక్కున్నట్లయ్యింది. నిజంగా ఆయనకీ విషయాలన్నీ ముందస్తుగానే తెలిసియుంటే ఈ లూసీఫరును తన సంస్థానంలో "ప్రైమినిస్టర్" పదవిని చచ్చినా ఇచ్చియుండే వాడు కానేకాదు. ఇంతటి ప్రత్యక్ష సాక్ష్యాన్ని క్రైస్తవ విశ్వాసులు నమ్మగలరా! కాని వీరు ఇట్టి నిజనిర్ధారణలను గూర్చి అనవసరంగా జుట్లు పీక్కోరు. మతంపై అచంచల విశ్వాసంతో ముందుకు సాగుతారు.**

యెహోవా లూసీఫరు గర్వించిన కారణంగా అతనిని నేలకు పడద్రోసి బంధిఖానాలో యుంచినట్టుగా యూదా, పేతురు గ్రంథాలందు వివరించబడింది.

II పేతురు 2:4లో... దేవతూతలు పాపము చేయగా దేవుడు వారిని విడిచిపెట్టక, పాతాళమందలి చీకటిగల బిలములలోనికి త్రోసి తీర్పుకు కావలిలో ఉంచబడుటకు వారిని అప్పగించెను. (అని యుంది)

అలాగే యూదా 1:6లో మరింత వివరంగా వ్రాయబడింది.... మరియు తమ ప్రధానత్వమును నిలుపుకొనక తమ నివాసములను విడచిన దేవదూతలను మహాదినమున జరుగు తీర్పు వరకును కటిక చీకటి గల బిలములలో ఆయన బంధించెను. (అని యుంది).



బైబిల్ గ్రంథంలో ఈ "లూసీఫరు" అనే ప్రధాన దూతయే అపవాది, సాతాను, ఘటసర్పముగా, అంధకార శక్తిగా కనబడుతూ క్రైస్తవ ప్రపంచములో అటు యెహోవాకు ఇటు క్రైస్తవ సోదర సమాజాలకు భయంకరమైన శతృవుగా కనబడుతూ వుంటాడు. ఇట్టి అపవాది పాతాళమందు కటిక చీకటి గల బిలాల యందు బంధించబడి, పటిష్టమైన కావలిలో వుంచబడినట్టును, ఎప్పుడో యుగాంతమందు జరగబోవు న్యాయపు తీర్పు కొరకై బంధికానాలో వుంచబడినట్టు బైబిల్ తేటతెల్లంగా వివరిస్తుంది.

అయితే ఇట్టి నాయ్యపు తీర్పు అనగా అంతిమ తీర్పు ఎప్పుడు జరగనున్నదో మనము బైబిల్‌నందు పరిశీలించగా - యేసు తన రెండవ రాకడలో మహావైభవంతో భూమికి తిరిగి వచ్చి వేయి సంవత్సరాల పాటు యావత్ ప్రపంచాన్ని తన అధికార దర్పంతో పాలిస్తాడట. ఆ సమయమందు ప్రపంచం పుట్టినది మొదలుకొని భూమ్మీద పుట్టి పెరిగిన వారంతా సమాధుల నుండి బ్రతికి బయట పడతారని, సముద్రము తనలోని మృతులను బ్రతికించి అప్పగించగా అప్పుడు న్యాయపు తీర్పు జరిపి పుణ్యాత్ములు స్వర్గానికి, పాపాత్ములు నరకానికి పంపబడతారని బైబిల్ చెబుతుంది. ఇక్కడ కొన్ని అనుమానాస్పద విషయాలు.... సమాధుల్లోని వారు బ్రతికారను కుందాము. దహన సంస్కారాలు చేయబడిన





వారు కూడ బ్రతికి వస్తారా? కోట్లాది సంవత్సరాలుగా చచ్చిన వారంతా బ్రతికి వస్తే వారు నిలబడటానికి ఎన్ని భూమండలాలు కావాలి?

అట్టి సమయమందే బంధించబడి యున్న లూసీఫరును, అతని అనుచర బృందాలను కూడ తీర్పుతీర్చి నరకంలోనికి త్రోయబడతారన్న మాట. అయితే అపవాదిని "ఏంటిసి పేటరీ బెయిలు" వంటి దానిపై యెహోవా విడుతల చేసినట్టుగాని, ఒక వేళ్ల అపవాది ఆ అంధకార బంధురమైన పాతాళలోకమందలి బిలాల నుండి తప్పించుకొని పలాయనం చిత్తగించినట్టు గాని బైబిల్‌లో ఎక్కడా వ్రాయబడలేదు. దీనిని బట్టి లూసీఫరు నేటివరకు బంధిఖానాలోనే "డిటెన్యూ"గా యుండి న్యాయపు తీర్పు వరకు కనిపెడుతూ యుండాలి. కాని ఈ బైబిల్ - అపవాదిని గూర్చి అనేకమైన చిత్రకథలు చెబుతూయుంది. తాను చెప్పిన మాటలను తానే ఖండిస్తూ యున్నప్పటికి బైబిల్ భక్తులు మాత్రం అనుకూలమైన విషయాలను, ప్రతికూలమైన విషయాలను కూడ ప్రశ్నించకుండ నమ్మేస్తూయుంటారు. ఈ అపవాదిని గూర్చే యెషయా గ్రంథంలో అపవాదిని నరకంలో ఒక మూలకు త్రోయబడితివే! యని చెప్పగా, యెహెజ్కేలు గ్రంథంలో నేలమీద పడద్రోయ బడినట్టుగాను, వ్రాయబడియుండగా, యూదా, పేతురు గ్రంథాలందు పాతాళమందలి చీకటి గల బిలములలోనికి త్రోసి బంధించబడి కావలిలో యున్నట్టు చెప్పబడగా, తిరిగి పేతురే అపవాది గర్జించు సింహము వలె పరుగులు పెడుతున్నాడు జాగ్రత్తండోయ్ అని హెచ్చరించడం చూస్తుండంగా ఇందు ఏది నిజమో ఎవరికీ తెలియదు.

అసలు దేవదూతలు ఎవరు ఎలా సృష్టించబడ్డారు? అనే విషయాలపై సరియైన వివరణ బైబిల్‌లో లేదు. కాని బైబిల్ రిఫరెన్సులో దేవదూతలు అనగా దేవుని కుమారులు అని అర్థంచెప్పబడింది. దేవదూతలు కోట్లమంది వున్నారని చెప్పుచుండగా వారినికన్న తల్లులు ఎవరో, ఎన్నిలక్షల మందో ఎవరికి తెలియదు. మరో ప్రక్క బైబిల్ ఎక్కడా యేసు యెహోవా ఏకైక కుమారుడని అటు పాతనిబంధనలో గాని, అటు క్రొత్తనిబంధనలో గాని వారివారి పేర్లతో వ్రాయబడనప్పటికి యావత్ క్రైస్తవ ప్రసంగికులు మాత్రం యెహోవా కొడుకు యేసని బల్లలుగుద్ది మరి చెబుతారు. ఈ విశయాన్ని యెహోవా గాని, యేసుగాని చెప్పినట్టుగా బైబిల్ అంతా తిరగేసినా మచ్చుకైనా మనకు కనబడదు. అనుమానమొస్తే మీరుకూడ పరిశీలించండి.

## అపవాది నిత్యపాశములతో బంధిచబడి కావలిలో యుంచబడగా, ఏ అంధకార బిలాలనుంచి పలాయనం చిత్తగించాడా?

లూసీఫరును గూర్చి.... పేతురు వివరంగా వ్రాస్తూ... దేవదూతలు పాపము చేయగా, వారిని యెహోవా చీకటి గల బిలాలలో (పాతాళమందు) బంధించి కావలిలో మహాతీర్పు దినము వరకు వుంచి నట్టుగా వ్రాశాడు. దీనిని మరింతగా బలపరుస్తూ యూదా 1:6లో మరింత తేటగా వ్రాయడము జరిగింది.

మొదటగా నా చిన్నతనములో నేనీ వాక్యమును చదివినప్పుడు..... ఇక పరవాలేదు! సైతాను బంధిచబడ్డాడు. నిత్యపాశములతో బంధిచబడటమే కాక యెహోవా యంతటి వాడు ఈ అపవాదిని పటిష్టమైన రీతిలో బంధించి ఉంచినట్టు వివరించబడింది. అందుచే ఎప్పుడో యుగాంతమందు జరుగు తీర్పువరకు ఇక సైతాను భయముండదని నాకు తెలిసీ తెలియని బాల్యమందే భావించి తృప్తిచెందాను. తర్వాత తర్వాత ఆయా ప్రసంగికుల బోధనలను విని అమ్మో! ఈ అపవాది భూలోకమందు మరింత చురుకుగా సంచరిస్తూ క్రైస్తవ భక్తులను తమ తమ విశ్వాసాల నుండి పడగొట్టుటకు ప్రయత్నిస్తూ తిరుగుచున్నాడని మరింతగా భయపడ్డాను.



అయితే మిస్టర్ పీటర్ మహాశయుడు విశ్వాసములో రాటుదేరిన "బండవంటి పేతురు" అని చెప్పబడిన పేతురు గారే తన రాతలను తానే ధిక్కరిస్తూ ప్లేటు పిరాయిస్తూ ఏమంటున్నాడో చూడండి!

నిబ్బరమైన బుద్ధిగల వారై, మెలకువగా ఉండండి! మీ విరోధియైన అపవాది గర్జించు సింహము వలె ఎవరిని మ్రింగుదునా అని వెదకుచూ తిరుగుచున్నాడు (I పేతురు, 5:8)

అని బైబిల్ చెబుతుంది. వుత్కృష్టమైన మానవజన్మగా చెప్పబడే నరులను గూర్చి చాలామంది తిరస్కార భావంతో మాట్లాడుతూ. (కుక్క అత్యంత విశ్వాసము గల జంతువైనప్పటికి) తన కుక్క బుద్ధి బయట పెట్టుకున్నాడని నిందిస్తూ మాట్లాడడం మనము గమనిస్తాము.

అపవాది కుయుక్తులకు గాను నిజంగా సాతానును మృగరాజైన సింహంతో పోల్చడము అంత సమంజసంగా లేదేమో! దాని బుద్ధికి తగ్గట్టుగా మీ విరోధియైన శునకం ఎవరిని కరుద్దునాయని మొరుగుతూ తిరుగు చున్నాడంటే బాగుండేదేమో! కాని





క్రైస్తవ విశ్వాసము దీనికి అంగీకరించక పోవచ్చు. ఎందుకంటే అపవాది ఒకప్పుడు యెహోవా స్వయంగా నియమించిన ప్రధాని. అందునా ఇది పరిశుద్ధ గ్రంధమందలి ముఖ్యపాత్ర కావడముచే దానిని సింహంతో పోల్చడము సబబేయని తలస్తారు.

> కొసమెరుపు: మిత్రులారా మీరు మరొక్కసారి ఇక్కడ పొందుపరచబడిన "గర్జించు సింహాన్ని" నిశితంగా పరిశీలించి చూడండి. ఆ చిత్రం నిజం సింహం కానేకాదు. "అది శునకరాజు" సింహం ఆకృతిలో కనబడే ఆ కుక్క చిత్రాన్ని ఇటీవలి వార్తా పత్రికలు ప్రచురించాయి!



సర్వశక్తి మంతుడైన దేవుడు ఏమూలను ఏమి జరుగుతుందోయని "సి.సి. కెమీరాల" వలె అనునిత్యము పరికించి చూస్తూయుండగా యెహోవా కన్ను గప్పి కాదుకాదు! ఆయన ఏడు నేత్రాలను కప్పి అపవాది గాడు తప్పించుకొని పారిపోవడమేమిటి? ఆ మహామాయగాడైన ఈ అపవాది భక్తజనులను శోధిస్తూ ప్రలోభాలు చూపుతూ అను నిత్యము క్రైస్తవ విశ్వాసులను వెంబడిస్తూ తమతమ విశ్వాసాల నుండి పడగొట్టుటకు ప్రయత్నాలు చేస్తూయుంటాడని యావత్ క్రొత్త నిబంధన ఘోషిస్తూ యుండగా ఏకంగా పేతురు అపవాది తన నోరు తెరచి ఏక్షణాన మ్రింగి వేస్తాడోయని భయాందోళనలకు గురిచేస్తూ యుండగా భక్తజనులు తల్లడిల్లి పోతూయుంటారు.

ఈ పేతురు, యూదాలకన్నా మరింత ఎక్కువగా అపోస్తలుడైన పౌలు మొదలుకొని యావత్ క్రైస్తవ మేధావులు తమ తమ ప్రసంగాలందు అమ్మో అపవాది! బాబోయ్ సాతాను! అయ్యయ్యో దయ్యం! భూతం! అంటూ చిందులు ద్రొక్కడం మనము చూస్తూ వుంటాము. అపవాది బంధింపబడి వున్న విషయం వీరి కందరికి తెలుసు. అయినా ఎందుకిలా జరుగుతుంది? వెనకటికి అంతర్జాతీయ నేరస్థుడైన కిలాడీ చార్లెస్ శోభరాజువలె జెయిలు గార్డులకు తన పుట్టినరోజని చెప్పి మిఠాయిలో మత్తుమందు కలిపిపెట్టి, పారిపోయినట్టుగా ఈ అపవాది పారిపోయాడనుకోవాలా? అపవాది బంధిఖానా నుండి విడిపించబడినట్టు ఎక్కడా వ్రాయబడలేదు. అయినప్పటికి బైబిల్ అపవాది గర్జించు సింహం వలె తిరుగుచున్నాడు జాగ్రత్తయంటూ భయాభ్రాంతులకు గురిచేస్తుంది. అయితే యెహోవా ఈ దేవదూలను కన్నాడో లేక దత్తత తీసికొన్నిడో అనే విషయాలన్నీ అగమ్యగోచరం. యెహోవా తాను భూమ్యాకాశాలను సృజించాడనే నాటికి ఈ దేవదూతల పాత్ర మనకేమి తెలియక పోయినా పూర్వగాధలో కోటాను కోట్ల దేవదూతలున్నట్టు చెప్పబడింది. అంతే గాక లూసీఫరు మీద కోపగించిన యెహోవా భూమిని అగాధజలాలతో ముంచెత్తి అంధకార బంధురం గావించి ఆ చిమ్మచీకట్లో యెహోవా ఆత్మ అల్లలాడుతూ

వున్నప్పుడు పై దేవదూత సమూహాలు ఏమయ్యాయో అజాపజాలేవు. ఏదైవజ్ఞులు ఇట్టి ప్రశ్నలకు జవాబులీయలేరు. ఈ దేవాది దేవుడు అపవాది మీద అలిగి తనకుతానే శిక్షవిధించుకోవడమేమిటి?

అయితే ఈ దేవదూతలు బైబిల్‌లో చాలాసార్లు తారసపడుతూయుంటారు. వీరిని పాతనిబంధన కథనాల్లో చూస్తాము. ఒకసారి యెహొవా అబ్రహాము ఏకైక కుమారుని తనకు బలియర్పించమనగా అందుకు అబ్రహాము తన కుమారుని మెడపై కత్తిఎత్తగా వెనువెంటనే ఒక దేవదూత ప్రత్యక్షమై నీభక్తికి యెహొవా మెచ్చాడు. ఇదిగో నీ వెనుకకు చూడు. ఆ తుప్పల్లో చిక్కుకొని యున్న గొర్రె పిల్లను తీసుకొని వచ్చి నీకుమారునికి ప్రతిగా యెహొవాకు బలి ఇవ్వమని చెబుతాడు. మరొకసారి హబక్కూకు అనే ప్రవక్తను జుట్టు పట్టుకొని హెలికాప్టరు వలె ఎగరేసుకొనిపోయి నట్టు చెప్పబడింది. ఈ విధంగానే బైబిల్ నందు దేవదూతల సమాచారం చాల కనబడతాది.

ఒకసారి ఏలియా అనే ప్రవక్త.....రాజైన అహాబు, రాణి-ఎజబెలులకు భయపడి అరణ్యమునకు పారిపోయి దాగుకొనగా ఒక దేవదూత ఏకంగా పరలోకాన్నుండి ఒక నిప్పులకుంపటి, రొట్టెల పెంకు, వాటికి కావలసిన పిండి, నూనె బుడ్డి తగిలించుకొని వచ్చి ప్రవక్తకు వేడివేడి రొట్టెలు కాల్చియిచ్చిందట. అవేమి మ్యాజిక్ రొట్టెలో గాని అవితిన్న అనంతరము నలువది రోజులవరకు ఆకలన్నదే లేదట. దేవుడు ఈ రొట్టెల తయారీని మానవులకు కూడ తెలియజేస్తే ఇక ప్రపంచంలో అన్నార్తులెవరూ వుండరు. మరికొన్ని దేవదూతలు వార్తాహరుల వలె వార్తలను మోసుకొని వచ్చి ఆయా చోట్ల అందిస్తాయట. యేసు జననం సంగతి బెత్లెహేము ప్రాంతంలో పొలాల్లో తమ గొర్రెలను కాచుకొంటూవున్న కొంతమంది వెర్రి గొర్రెల కాపరులకు ఒక దేవదూత ఎగురుచూ వచ్చి సమాచార మందించిందట.



మరొకసారి ఇశ్రాయేలీయులపై శత్రుసైన్యాలు ముట్టడించి వుండగా కత్తిచేత బట్టిన ఒక దేవదూత వచ్చి ఆ రాత్రికి రాత్రే లక్షా ఎనబదియైదు వేలమంది యోధులను నరికిపారేసిందట. అంత్యదినాలందు ఒక దేవదూత బూరవూదగా భయంకర క్రూరమృగాలను అధిరోహించి, కవచాలు ధరించిన యుద్ధవీరులు కోట్లాదిమంది పుట్టుకొచ్చి ప్రపంచ జనాభాలోని మూడవ భాగాన్ని చంపేస్తారట. అసలు ఈ దేవదూతలు ఎలా పుట్టారో ఎవరికి తెలియదు. అయితే ఈ దేవదూతలను గూర్చి బైబిల్ వాఙ్మయంలో ఆయా కథాచిత్రాల్లో పటములోచూపబడిన





విధంగా అందమైన స్త్రీ మూర్తులుగా చూపుతారు. నిజానికి ఈ దేవదూతలంతా పురుష పుంగవులట. కాని ఏ ఒక్కరికి మీసాలు గడ్డాలు వున్నట్టు ప్రదర్శించరు.




వీరంతా ధవళవస్త్రాలు ధరించిన అందమైన స్త్రీలవలె రెక్కలు కలిగి వుంటారు. ఇక్కడ మనము చర్చిస్తున్న లూసీఫరు అనే యెహొవా మాజీ ప్రధానదూత అందగాడుగా బైబిల్ వివరించినప్పటికి క్రైస్తవ సమాజాలు అతనిని కురూపిగా ప్రదర్శిస్తూ వుంటాయి. అయితే యెహొవా తనపై తిరుగుబాటు చేసిన లూసీఫరును నీవు అంద వికారుడవు కమ్మని ఎప్పుడూ ఎక్కడా శంపించినట్టు మాత్రం బైబిల్ నందు కనబడదు. అయితే ఈ బైబిల్ మేధావి వర్గాలు మాత్రం అపవాదిని అందంగా చిత్రించి వాడు మ్రింగేస్తాడు....కరచేస్తాడు మిమ్ము‌ను బోల్తా కొట్టించేస్తాడు జాగ్రత్తండోయ్! అని గొంతులు చించుకొని ప్రసంగాలు చేస్తే ఎవరూ నమ్మరు కదా! అందుచే యెహొవా పర్మిషన్ లేకుండానే ఈ క్రిస్టియన్‌ల విలన్ అయిన అపవాదికి మేకకొమ్ములు, గబ్బిలం రెక్కలు కోతి చెవులు తగిలించి, పిల్లికళ్లతో, ఎలుకపళ్లతో మసిపూసి మారేడు కాయను చేసి, అపవాది పాత్రను ఒనీడా.టివి. ప్రచారకర్తవలె ఒక శాశ్వత రూపాన్ని క్రైస్తవ హృదయాలో ముద్రించారు. ఇంతవరకు మనము చూచిన వివరాల ఆధారంగా చీకటి గల బిలాల్లో బంధించబడియున్నాడని..... కాదుకాదు గర్జించు సింహం వలె విచ్చలవిడిగా తిరుగుతున్నాడని ఇది నిజమా? అది నిజమా! యని మనము బుర్రలు బద్దలు గొట్టుకుంటూ యుండగా వీటికి విరుద్ధంగా కాదు!కాదు! ఈ అపవాది గాడు మొన్న మొన్నటి వరకు నా కొంపలోనే కాపురం వెలగబెట్టాడని యెహొవాయే స్వయంగా చెప్పినట్టు ప్రకటన గ్రంథంలో యోహాను గారు మరో సరిక్రొత్త కథనం వినిపిస్తున్నారు. అదేమిటో కాస్త చూద్దాము. కాని మన టి.వి. ప్రసంగికులు ఇట్టి వివాదాస్పద విషయాల జోలికి అంతగాపోరు.

## అపవాది - వాని అనుచరులు - యెహెూవాదివ్య సన్నిధిలో - ఆయన బెడ్‌రూమ్ ప్రక్కనేవున్నారా! ఇది నమ్మశక్యమేనా!

ఇంతకు ముందు మనము అపవాది నిత్య పాశముల నుండి పలాయనం చిత్తగించాడా? యనే విషయాన్ని గూర్చి తీవ్రంగా చర్చించాము. అయితే అపవాదిని గూర్చి భూమండలమంతా గావించినా వాడు మనకు ఎక్కడా కనిపించడు. అయితే వాడు పోయిపోయి యెహెూవా కోంపలోనే దూరినట్టు తెలిసికొని అవాక్కైపోయాను. ఈ ఉదంతం మరింత ఆసక్తిని రేకెత్తిస్తుంది.

అసలు అపవాది బంధించబడియున్నాడని.....కాదుకాదు! స్వేచ్ఛగా విహరిస్తున్నాడని విని సందిగ్ధంలో యుండగా పైరెండు వాదనలను కాదని ఇక్కడొక సరిక్రొత్త వాదన చూస్తాము. ఇది ప్రకటన గ్రంథము 12:17-12 చూడండి!

> *అంతట పరలోకమందు యుద్ధము జరిగెను. మిఖాయేలును, అతని దూతలను ఆ ఘటసర్పముతో యుద్ధము చేయవలెనని యుండగా అఘటసర్పమును, దాని దూతలను యుద్ధము చేసిరి గాని వారు గెలువలేక పోయిరి. గనుక పరలోకములో వారికి స్థలములేక పోయెను. కాగా సర్వలోకమును మోసపుచ్చుచూ, అపవాదియు, సాతానయు పేర్లుగల, ఆదిసర్పమైన ఆ మహాఘటసర్పము పడద్రోయ బడెను. అది భూమిమీద పడద్రోయబడెను. దాని దూతలు దానితో కూడ పడద్రోయబడిరి. మరియు ఒక గొప్ప స్వరము పరలోకమందు ఈలాగు చెప్పుటవింటిని.....*
>
> *రాత్రింబవళ్లు మనదేవుని ఎదుట, మన సహెూదరుల మీద నేరముల మోపువాడైన అపవాది పడద్రోయబడి యున్నాడు. గనుక ఇప్పుడు రక్షణయు శక్తియు, రాజ్యమును మనదేవుని వాయెను. ఇప్పుడు అధికారము క్రీస్తుదాయెను....భూమీ!! సముద్రమా!! మీకుశ్రమ!*
>
> *అపవాది తనకు సమయము కొంచమేయున్నదని తెలిపికొని బహుక్రోధము గలవాడై మీయొద్దకు దిగివచ్చియున్నాడని చెప్పెను.*

ఈ ప్రకటన గ్రంథ వాక్యాలను మనము మరింత శ్రద్ధగా పరిశీలించవలసి యుంది. ఈ వాక్యము యెహెూవా యొక్క సర్వశక్తిని, ఆయన యొక్క పరిశుద్ధతను, చివరకు ఆయన దైవత్వానికి కూడ భిన్నమైన రీతిలో కనబడుచున్నది...

అపవిత్రమైన దేదీ యెహెూవా సన్నిధిలో నిలువ జాలదని పరిశుద్ధ గ్రంథం ఘోషిస్తూ యుండగా ఈ పాప పంకిలమైన దుర్మార్గపు ముఠా అంతా మూకుమ్మడిగా యెహెూవా సన్నిధిలో కలసికట్టుగా సహజీవనము చేయడమేమిటి? ఏదో ఒక మూలనివసించడమైనా కాదు! యెహెూవా ప్రత్యర్థియైన ఈ అపవాది రాత్రనక పగలనక విశ్వాసులైన సోదర





ప్రజానీకంమీద పితూరీలు చెబుతూ....నేరాలు మోపుతూ రేయింబవళ్లు యెహెూవాకు కంటిమీద కునుకు లేకుండ చేయడమేమిటి?

"కంటిమీద కునుకు లేకుండ చేయడమేమిటి" అనగానే క్రైస్తవ సోదరులకు అసహనం కలగవచ్చును ఈ శీర్షిక హెడ్‌లైన్స్ చూచి ఏకంగా దేవుని "బేడ్‌రూమ్" అని చెప్పడంపై ఆగ్రహం వెలిబుచ్చవచ్చును.

ఏమిటీ రాతలు? "ఇశ్రాయేలును కాపాడు దేవుడు కునుకడు, నిద్రపోడు" అని బైబిలు చెబుతూయుండగా ఈ రచయిత వ్యాక్యలు అనే కులకు చిలిపిగా కనబడవచ్చును. అయితే యెహెూవా కూడ నరునిపోలికలోనే రక్తమాంసాలు కలిగి యుండవచ్చును. ఈ విధంగా మానవాకృతిలోనున్న యెహెూవా అయిదు దినాలో సృష్టికార్యం చేసి, ఆరవదినాన ఆదామును చేయుటకు మంటిని తడిపి మంచి పాకమువచ్చే వరకు త్రొక్కి పిసికి బొమ్మనుచేసి ప్రాణంపోసి, అనంతరము స్త్రీని రూపొందించుటకు ఆదాముకు ఆపరేషన్ లాంటిది చేసి అతని ప్రక్కటెముకతో స్త్రీని చేసినట్టు చెప్పబడింది. యావన్మంది క్రైస్తవులు ఈ మాటలను వెనకా ముందు ఆలోచించకుండ నమ్మివేస్తారు.

ఇదిగో చూడండి! ఇది పురుషుని ప్రక్కటెముక. ఇది అరచేతిలో ఇమిడే చిన్న ఎముక. ఇది అనేక సంవత్సరాల నాటి ఎండిపోయిన ఎముక. పచ్చిఎముక అయితే మరికాస్త లావుగా వుండవచ్చును. ఈ వంకరి టింకరి బలహీనమైన యెముకను యెహెూవా కొండపల్లి బొమ్మను చెక్కిన విధంగా చెక్కాడనుకుందాము. అది ప్రక్కటెముక ఉన్న విధంగా గూని ఆకృతేవస్తాది కాని అందమైనస్త్రీగా రూపొందదు. ఈ స్త్రీకి ఆదాముకువున్న విధంగా శరీరంలో జీర్ణకోశము, ప్రేవులు, గుండె తదితర అవయవాలతో పాటు అదనంగా గర్భసంచికూడ అమర్చాలి. ఇది సాధ్యమేనా! ఎందుచేతనంటే స్త్రీని "హాం! పట్" అని యెహెూవా తన అతీత శక్తితో సృజించినట్టు బైబిల్ చెప్పలేదు. కేవలం ఎముకతో స్త్రీని రూపొందించినట్టుగా చెప్పబడినందున ఇక్కడ పై విధంగా ఆలోచించవలసి వచ్చింది. అయితే పై వివరాలేమి మనకు తెలియవు. పురుషుని ప్రక్కటెముకతో స్త్రీని రూపొందించాడు. ఆదాముకు సాటియైన సహాయంగా అప్పగించడము జరిగింది. ఇది సంభవమేనా!



పరుషుని ప్రక్కటెముకతో నెల్సన్ రఫ్షీ

పురుషుని ప్రక్కటెముక సేకరణకు కొద్దిపాటి చరిత్రవుంది. నేను 15 సంవత్సరాలు బాలుడిగా వుండగా గోదావరి నదీ తీరాన కొవ్వూరుకు ఆవల "ఆరికిరామల" అనే ఒక కుగ్రామంలో ఒక పెండ్లి సందర్భంగా మా కుటుంబం ఆవూరు వెళ్లడం జరిగింది. ఆనాటి సాయం సమయాన నేను, మరికొందరు బాలురతో కలసి గోదావరి నదీ తీరాన రంగురంగుల రాళ్లు నత్తగుల్లలు సేకరించుటకు వెళ్లాము. ఇలా చాలా దూరం వెళ్లిన మేము ఇసుకలో తీరం వెంబడి వస్తూయుండగా ఒక చోట నది ఒడ్డు కోయబడి. ఆ మట్టిలో మానవ కళేబరానికి చెందిన ఎముకలు కనబడ్డాయి. కపాలము కూడ కనబడింది గాని నేను భయపడి కేవలము రెండు మూడు ప్రక్క టెముకలు మాత్రము సేకరించి భద్రపరిచాను. పైన నా ఫోటోలో చూపబడిన ఆ ఎముక అలనాటిదే. ఆ స్థలమందే ఒక బండమీద "శివయ్య" అని చెక్కబడియుంది. ఆ కారణంగా అది పురుషుని ప్రక్కటెముకగా నిర్ధారించుకొన్నాను.

ఇక్కడ మనమొక విషయము గమనిస్తే మానవాకృతిలోనే వున్న యెహోవాకు సాటియైన సహాయం వున్నట్టు మనకు బైబిల్‌లో ఎక్కడా కనబడదు.

ఇంతటి క్లిష్టతరమైన సృష్టికార్యాన్ని చేయుటకు యెహోవా రెక్కలు ముక్కలు చేసికొని ఆరుదినాలు నిర్విరామంగా పనిచేసి అలసిసొలసి ఏడవ దినాన పూర్తిగా విశ్రాంతి తీసికోవడము జరిగింది. దీనిని బట్టి యెహోవాకు కూడ నిద్ర, విశ్రాంతి అవసరమని విదితమౌతుంది. అనంతరము అప్పుడప్పుడు ఏదేను తోటలో నున్న ఆది దంపతులను పరామర్శిస్తూ వచ్చి నట్టుమనము చూస్తాము. అయితే ఇక్కడ ఒక తేటయైన వివరణ వుంది. దీనిని బట్టి యెహోవా మధ్యాహ్నం పూట ఒక్క కునుకు తీసేవాడేమో? అనుకోవలసి వస్తుంది. ఎందుకంటే ఆయన మిట్ట మధ్యాహ్నముకాక ఎండపూర్తిగా తగ్గి వాతావరణం చల్లబడ్డాక సాయంకాల సమయాలందే ఆదాము హవ్వలను దర్శించేవాడు. అయినప్పటికి యెహోవా నిద్రపోతాడో! లేదో మనకు అంతగా తెలియదు. కాని ప్రవక్తయైన ఇర్మియాకు మాత్రం ఆ విషయం బాగా తెలుసు. యిర్మియా గ్రంథంలో అనేక సార్లు ప్రవచన వాక్యాలు వ్రాస్తూ..."యెహోవా పెందలకడనే లేచి" ప్రవక్తలైన నా సేవకులను మీ యొద్దకు పంపుతూ వచ్చానని చెప్పడం వల్ల యెహోవా దేవుడు గ్యారంటీగా నిద్ర పోతాడని రుజువౌతున్నది. దీనిని ఎవరు కాదనలేరు.

మనము పైన చెప్పుకొన్న విధంగా యెహోవాతో పాటు అపవాది ఇంత సన్నిహితంగా కలసి జీవించాడనే మాటను, అదయినా రాత్రింబవళ్లు అనే పదాన్ని కాదనలేము. అయితే మనము గత శీర్షికలో చూచిన పాత ప్రశ్నలు మళ్లీ మొదటికి వచ్చాయి. యెహోవాచే సృష్టికి పూర్వమే లూసీఫరు గెంటివేయ బడ్డాడని... బంధించబడి కావలిలో వుంచబడ్డాడని చెప్పబడిన విషయాల సంగతి ఏమిటి? యెహోవాకు అపవాది మధ్య ఏదయినా లోపాయకారీ "రాజీ" ఏమయినా కుదిరిందా? అనే ఇట్టి ప్రశ్నలకు మనకు సమాధానం ఎక్కడా దొరకదు. అనుభవం గల ఏ ప్రసంగికుడు ఈ ప్రశ్నలకు సమాధానమీయలేడు. ఈ బైబిల్ వివరణల వల్ల అపవాది బంధించబడియున్నాడా? లేక





గర్జించు సింహంవలే తిరుగుచున్నాడా? కాకుంటే యెహోవా సన్నిధానమందున్నాడా అనే పరస్పర విరుద్ధమైన కథనాలు ఈ బైబిలే చెబుతున్నందున చివరకు ఇవన్నీ కట్టుకథలేనని భావించవలసి వస్తుంది.

ఇట్టి వివరణలకు మన సందేహాలు నివృత్తి కాకపోగా మరెన్నో అనుమానాలు కలుగుచున్నాయి. యెహోవా యుద్ధతంత్రాదులను చూచుకొనే సర్వసైన్యాధ్యక్షుని వంటి దూత మిఖాయేలు ఘటసర్పముగా చెప్పబడిన లూసీఫరుల మధ్య యుద్ధం జరగాలని వుందని ఎవరురాసి పెట్టారు? ఈ యుద్ధానికి ముందు రాత్రనక పగలనక అపవాది - యెహోవాల మధ్య "పిచ్చాపాటి" సంభాషణలు జరగడమేమిటి? యెహోవా పక్షానికి - అపవాది వాడి అనుచరులకు వీరి మధ్య భయంకరమైన యుద్ధం జరగడమేమిటి?.... చివరకు యెహోవా పక్షం గెలవడము, అపవాది ఓడిపోవడము జరిగిందట. ఈ శుభవార్తవిన్న యెహోవా పక్షం పరమానంద పడి ఊరట చెందడమేమిటి? ఈ విజయం వల్ల ఇక యెహోవా పక్షానికి తిరుగులేదని యేసుక్రీస్తు చేతికి అధికారం దక్కిందని ఈ దేవుళ్లు మురిసి పోతూ ఆనందించడం చిత్రంగా వుంది. ఈ ఓటమివల్ల అపవాది వాడి అనుచరులకు ఇక పరలోకంలో చోటు లేకుండపోయిందని చెప్పుకొని సంబరపడడం చూడగా వింతగొలుపుతుంది. ఒక వేళ అపవాది పక్షం గెలిచియుంటే యెహోవా యేసయ్యలు ఆ స్వర్గాన్ని అపవాది చేతికి అప్పగించి ఈ దేవుళ్లు అజ్ఞాతంలోనికి వెళ్లిపోయేవారా? అసలు సాతాను ఓడిన వెంటనే వాడిని వాని అనుచరులను "ఎన్ కౌంటర్" చేసి పారేస్తే క్రైస్తవ ప్రపంచానికి, యెహోవాకు పీడవిరుగడ అయ్యేదికదా!

అసలు మనమిక్కడ వింటున్న కథనం సృష్ట్యాదికి నాటి అపవాది చరిత్రకాగా పైన మనము విన్నకథనంలో యేసుక్రీస్తు పాత్ర సమాచారమున్నందున యెహోవా సన్నిధిలో అపవాది పాత్ర గత రెండు వేల సంవత్సరాల క్రితం జరిగిన వుదంతంగా భావించవలసి వస్తుంది. ఇది ప్రకటన గ్రంథ రచయిత యోహాను వ్రాసిన దైనందున యేసు మరణానంతరం పైన చెప్పబడిన పరలోక యుద్ధం జరిగిందా? అయితే అప్పుడు అపవాది దైవసన్నిధానంలో వుంటే... యేసు శిష్యులు, అపొ॥పౌలు వారి కాలంలోనే అపవాది విచ్చలవిడిగా తిరుగుచున్నదని చెప్పిన విషయాలన్నీ అబద్ధాలే అనుకోవలసివస్తాది.

సమయము కొంచమేవున్నదని అపవాది మరింత చురుకుగా తిరుగుచున్నాదని, అనాదిగా బైబిల్ రచయితలు చెబుతున్నప్పటికి వేల సంవత్సరాలు గతించిపోతున్నా కీస్తురెండవరాకడ తటస్థించలేదు. సాతాను ఉనికి విషయంలో అనేక రకాలైన తలాతోకాలేని కథలు చూచాము. దీనిని బట్టి మనము తెలిసికోవలసిన విషయమేమంటే నిజం అనేది ఒకే విధంగా వుంటాది. అబద్ధాలు సవాలక్ష రీతుల్లో వుంటాయి. గనుక అపవాది కథలన్నీ సర్వాబద్ధమని మనము తెలిసికోవాలి. ఈ అపవాది పాత్ర గ్రీకు పురాణగాథల నుండి తస్కరించబడి బైబిల్‌లో చేర్చబడిన విషయం ఈ అవకతవక వివరణలను బట్టి నిజమేననిపిస్తుంది.

# గ్రీకు పురాణ గాథల నుండి బైబిల్‌లో ప్రవేశపెట్టబడిన "అపవాది" పాత్ర!




ఇంచుమించు అన్నిమత గ్రంథాలందు భూతప్రేత పిశాచాది పాత్రల ప్రస్తావనలు ఆయా దేవుళ్లతోపాటు తారసపడుతూ వీరితో సమాంతరంగా సాగిపోతూ వుంటాయి. ఏ కథయైనా ఏ విధమైన అడ్డంకులు లేకుండ సాఫీగా సాగిపోతే కథ రక్తిగట్టదు, వినసొంపుగా యుండదు. ఆ ప్రకారం గానే బైబిల్‌లో కూడా మనకొక దుష్టపాత్రగా "అపవాది", వాడి అనుచర బృందాలు తారసపడుతూ ఉంటాయి. ఏ కథలోనయినా మధ్యమధ్యలో దుష్ట పాత్రవచ్చి అడ్డంకులు సృష్టించడము దానికి సంబంధించిన కథానాయకుడు వచ్చి "డిఘం!డిఘం!"లు కొట్టి విలన్‌ను పారద్రోలడం కనబడుతూయుంటాది.

ఈ కారణంగా బైబిల్ రచయితలు కూడ ఇందు అపవాది అనే దుష్టపాత్రను గ్రీకు పురాణగాథల నుండి తస్కరించి బైబిల్‌లో చేర్చినట్లు తిరుగులేని సాక్ష్యాధారాలతో సహా ఇక్కడ మనకు కనబడుతుంది. ఇందులో ఒక్క అపవాది పాత్ర మాత్రమే కాకుండా యెహోవా, యేసుక్రీస్తులకు సంబంధించిన అంశాలు అనేకం కనబడడము మరీ విశేషం. కాని చిత్రమేమిటంటే బైబిల్‌లో ప్రవేశపెట్టబడిన ఈ అపవాది పాత్ర మాత్రం ఈ బైబిల్ దేవుళ్లకన్నా బలీయంగా కనబడుతూ వారికన్నా పై చేయిగా వుంటూ యెహోవాను ముప్పుతిప్పలు పెట్టడం విశేషం. యెహోవా అంతటి దేవుడు అపవాదిని ఏమీ చేయలేక చేతులెత్తేశాడు.




"ఈశ్చిలస్" అనే గ్రీకు రచయిత రచించిన (PROMETHEUS BOUND) "ప్రొమిథియస్-బౌండ్ అనే నాటకాన్ని క్రీస్తు పూర్వం 415లో రచించాడని చెప్పబడింది. అయితే శేక్స్‌పియర్ రచించిన "టెంపెస్ట్" "మర్చెంట్ ఆఫ్ - వెన్నిస్ మొదలైన అసంఖ్యాకమైన తదితర





నాటకాల విషయంలో అవి ఆయన రచనలు కావవని కొందరు మేధావులు లేవనెత్తిని అనుమానాలవలెనే ఈ - ఈశ్చిలస్ రచనల విషయంలో కూడ అలనాడు కొంత అలజడి బయలు దేరినట్లు "WWW.wikipedia.org/prome+hius-bound" వెబ్-సైట్‌లో వివరించబడింది.

ఏది ఏమైనప్పటికి క్రీస్తుపూర్వం 415 సంవత్సరాల క్రితము వ్రాయబడిన ఈ - ఈశ్చిలస్ రచన అనంతర కాలంలో ఇంగ్లీషులోనికి తర్జుమా చేయబడి, ఇంగ్లండు, తదితర దేశాల్లో జనరంజకంగా ప్రదర్శించబడినట్లు వివరించబడింది.

ఈ కథాంశం గ్రీకు పురాణాలకు సంబంధించి గాథ ఈ నాటికకు తెలుగు అనువాదం "బంధించబడిన ప్రొమిథియస్"గా చెబుతారు.




గ్రీకుల దేవుడైన జ్యూపిటర్ ను "జోవ్" మరియు జియస్ గాను వ్యవహరించేవారు. ఈ నాటికలోని కథానాయకుడు ప్రొమిథియస్. ఈ చిత్రములో చూపబడిన గ్రీకుల దేవుడు "జ్యూపిటర్" యొక్క కుమారుడే ప్రొమిథియస్.

యావత్ భూమండలాన్ని, విశాల విశ్వాన్ని, సమస్త మానవాళిని ఈ గ్రీకు దేవుడే సృష్టించాడట. అయితే ఈ దేవుడైన జ్యూపిటర్ మానవులను అజ్ఞానులుగానే ఉంచాడట. వీరంతా ఈ జ్యూపిటర్‌ను ఆరాధించేవారు. అయినప్పటికి ఈ జ్యూపిటర్ ఆలోచన ఈ మానవుల విషయంలో ఈ అజ్ఞాన మానవులతో పాటు యావత్ ప్రపంచాన్ని నాశనం చేసి, మరోక్రొత్త ప్రపంచాన్ని సృష్టిచాలని సంకల్పించాడట.



అయితే తన తండ్రియైన జ్యూపిటర్ మనోగతాన్ని ప్రొమిథియస్ గ్రహించి ఈ విషయాన్ని తీవ్రంగా ఆలోచించి ఏ విధంగానైనా సరే మానవాళిని కాపాడాలని నిర్ణయించు కొన్నాడట.

వెనువెంటనే ప్రొమెథియస్ తన ప్రాణాలకు ముప్పు వాటిల్లినా సరే ననుకొని స్వర్గాన్నుండి "జ్ఞానాన్ని" దొంగిలించి మానవులకు అందజేశాడట! అలనాడు మానవులకు

అగ్నిరాజేయడం కూడ తెలియదట. "జ్ఞానమన"గా అగ్నిఅట. మానవులు మహదానందంగా ఆ అగ్నిని అందుకొని దాని ద్వారా ఉడికించిన ఆహారాన్ని తింటూ, గనులు త్రవ్వి, బొగ్గు, తదితర లోహాలను వెలికి తీసి వాటిని కరిగించి పనిముట్లను చేసికొని, కాలక్రమంలో అభివృద్ధి చెంది నాగరికులై పోయారు.

ఇదిలాగుండగా ఒకనాడు జ్యూపిటర్ మానవులెలాగున్నారోయని చూడగా - వారంతా నాగరికులైపోయి దేవుడైన తనను పూర్తిగా మరచిపోవడమే గాక మరో క్రొత్త దేవుడ్ని ఆరాధిస్తున్నారు. ఈ విషయం తెలిసికొన్న జ్యూపిటర్ కోపావేశంతో పరికించి చూడగా అసలువిషయం గ్రహించి ఇదంతా తనకుమారుని నిర్వాకమేనని వారికి జ్ఞానాన్ని అందించి నాకు ప్రతిగా తానే వారికి దేవుడైపోయాడని ఆగ్రహావేశాలతో ప్రొమిథియస్‌ను తక్షణమే గొలుసులతో బంధించవలసిందిగా ఆదేశించాడు.



ఆ ప్రకారంగానే భటులు బంధించారు. అయినా జ్యూపిటర్ కోపం చల్లారక వీడిని వెనువెంటనే కాకసస్ పర్వత సాణువుల్లో బంధించి ఆకాశపక్షులకు ఆహారంగా వేయమన్నాడు. ఆ ప్రకారంగానే వారు చేయగా ఆకాశ పక్షులు వచ్చి అతని శరీరాని పొడిచి మాంసాన్ని తినడం ప్రారంభించాయి. రక్తం ధారలుగా కారసాగింది.









ఆ బాధలు భరించలేక ప్రొమెథియస్ ఏమిటిది తాను మానవాళి మేలుకోరి ఒక మంచిపని చేయగా దానికి ప్రతిగా నాకీ చిత్రహింసలా యంటూ విలపించసాగాడు. అది చూచిన జ్యూపిటర్ మరింత కౄరంగా, మరణావస్థలోనున్న తన కుమారుడైన ప్రొమిథియస్‌ను శిలువవేసి చంప వలసిందిగా ఆ జ్ఞాపించగా అతనిని శిలువ వేయుటకు తీసికొని వెళ్లారు.

వెనువెంటనే శిలువ కొయ్యకు వ్రేల్లాడదీశారు.

ప్రొమిథియస్ శిలువపై భయంకర యాతన పడుచూ తాను ఏ నేరము చేయలేదు! తాను దీనజనులైన అజ్ఞాన మానవులను విజ్ఞానవంతులను చేయుటకు ప్రయత్నించగా నాకింతటి ఘోరశాక్షా! అంటూ హృదయ విధారకంగా ఆక్రందనలు చేశాడట.

ఈ విషయాలను రచయిత అయిన "ఈశ్చిలస్" ఈ విలాపవాక్యములను హృదయాలు ద్రవించే విధంగా వివరించాడట. ప్రొమిథియస్ శిలువమరణ సమయంలో

అతనిని ప్రాణప్రథంగా అభిమానించిన కొందరు స్త్రీలు సిలువ యొద్దకు వచ్చి దయనీయంగా విలపించారట. ప్రొమిథియస్ మరణఘడియలు ఆసన్నమైయ్యాయి. వెనువెంటనే సూర్యుడు అంధకారబంధుర మయ్యాడు. లోకమంతా చిమ్మచీకట్లు కమ్మాయి. వెనువెంటనే భూకంపము వచ్చి కొండలు బండలు బద్ధలై భూమికంపించి సమాధులు తెరవబడి అనేకమంది మృతులు సజీవులైయ్యారట. అనంతరం ప్రొమిథియస్ మరణించగా అతని ఆత్మ స్వర్గానికి చేరిందట.

ప్రొమిథియస్ ప్రధాన శిష్యుడైన "పేతురూస్" అనేవాడు దేవుడైన జ్యూపిటర్ తనను కూడ చంపుతాడేమోనని భయపడి అజ్ఞాతంలోనికి పారిపోయాడట.

ఈ గ్రీకు పురాణకథ వింటుంటే, ఇందలి అంశాలు చదువుతూయుంటే క్రైస్తవ భక్తాగ్రేసరులకు వెన్నుల్లో చలి లాంటిది పుట్టవచ్చును. ఏమిటి? ఎప్పుడో యేసుకన్నా వందలాది సంవత్సరాలకు పూర్వం వ్రాయబడిన... ఈ గ్రీకు పురాణగాథలోని అంశాలు ఎక్కడో విన్నట్టుగా ఉన్నాయేమిటి? యని బుర్రలు గోక్కోవచ్చును.

బైబిల్ విశ్వాసుల్లారా క్రీస్తూ జననానికి 400 సంవత్సరాలకు ముందే వ్రాయబడిన గ్రీకు పురాణగాథలో వున్న అంశాలు అచ్చుగుద్దినట్టుగా అటు అపవాదికి, ఇటు యెహోవాకు యేసుక్రీస్తుకు కూడ అన్వయించబడడమేమిటి? ఇది కాకతాళీయం కాదు. బైబిల్ రచయితల పన్నాగమేలాగుంది. జ్యూపిటర్ దేవుని "స్టోరీ"ని కొద్ది పాటి మార్పులైనా చేయకుండ ఉన్నది ఉన్నట్టుగా పొల్లు పోకుండా బైబిల్‌లో వ్రాయబడ్డాయి. యేసు మరణ సమయములో వేలాది మంది చూచిన ప్రత్యక్ష సాక్ష్యాలుగా బైబిల్ అప్పుడు జరిగిన సూచనలను వివరించి యుండవచ్చును కదా! అయితే ఎవరో గ్రీకు పురాణ రచయిత "బి.సి." నాడు వ్రాసిన విషయాలు, పుక్కిటి పురాణ గాథలు పరిశుద్ధ గ్రంథమైన బైబిల్‌లోనికి ఎలావచ్చి చేరాయి? గ్రీకు పురాణాలకు కార్బన్ కాపీ వలె వున్నందున ఈ విషయాలను గూర్చి ఆరా తీయవలసి వస్తుంది. బైబిల్ గ్రంథ రచయితలకు పరిశుద్ధాత్మ దేవుడు బోధించగా వ్రాయబడిందంటారు. అయితే పరిశుద్ధాత్మ దేవుడ్ని పల్లెత్తుమాట అనకూడదంటారు! గనుక ఈ విషయాన్ని విజ్ఞులైన పాఠక మహాశయుల వివేకానికే వదలి వేయుచున్నాను. మనము మరొక్కసారి గ్రీకు పురాణాన్ని బైబిల్‌కు పోల్చి సవివరంగా చర్చిందాము. ఇదంతా చదివిన అనంతరం న్యాయనిర్ణేతలు పాఠక మహాశయులే!

1) గ్రీకుల దేవుడు జ్యూపిటర్. మానవాళిని అజ్ఞానులుగా చేశాడు. వారిని అలాగే వుంచాలనుకున్నాడు.





యెహోవా దేవుడు కూడ మానవాళిని అజ్ఞానులు గానే వుంచాలనుకున్నాడు. ఆదిదంపతులైన ఆదాము-హవ్వలను తెలివి హీనులుగా పామరులుగా సృజించాడు. వారికి ఇది మంచి అని గాని అది చెడ్డయని గాని తెలియని అవి వేకులుగా చేశాడు. ఆ ఏదేను తోటలో జ్ఞానవృక్ష ఫలాల చెట్టును యెహోవా మొలిపించాడు. ఒకవేళ్ల ఆ చెట్టు యొక్క ఫలాలను వీరు తిని ఎక్కడ జ్ఞానులైపోతారో అని తలచి మీరు ఒకవేళ ఆ చెట్టు ఫలాలు తింటే ఆరోజే చస్తారు సుమా! అని బెదిరించాడు.

2) జ్యూపిటర్ దేవుడు సకల ప్రపంచాన్ని సమస్త ప్రజలను సర్వనాశనం చేయాలని మరో క్రొత్త ప్రపంచాన్ని సృష్టించాలని "ప్లాన్" వేశాడు.

యెహోవా దేవుడు పై విధంగా తలంచడమే కాదు. ఏకంగా యావత్ ప్రపంచాన్ని జలప్రళయం పంపి ముంచి మరి చంపాడు. జ్యూపిటర్ కేవలము తలాంచాడంతే! యెహోవా యావత్ ప్రపంచాన్ని బోనులోని ఎలుకల్ని చంపినట్టుగా ప్రళయ జలాలలో ముంచి చంపేశాడు.

3) జ్యూపిటర్ దేవుని కుమారుడు ప్రొమోథియస్. ఆలాగే యెహోవా కుమారుడు లూసీఫరు (అపవాది). బైబిల్ గ్రంథం "రిఫరెన్సు"లో దేవదూతలు అనగా దేవుని కుమారులు అని మూలభాషలో అర్థమని వ్రాయబడింది. అందుచే అపవాది యెహోవా కుమారుడే అన్నమాట.

4) ప్రోమోథియస్ అజ్ఞాన మానవులకు విజ్ఞానం అందజేశాడు. అనగా అగ్నిని అందించి వారిని నాగరికులుగా తీర్చిదిద్దాడు.

"లూసీఫరు" (అపవాది) కూడ మంచిచెడ్డలు తెలియని మొరటు మానవులైన ఆదాము-హవ్వలకు నిషిద్ధ ఫలాలు తినిపించి వారిని విజ్ఞానులుగా చేశాడు.



అపవాది సర్పాకారంలో ఆదిదంపతులను మేల్కొలిపి మేళ్లూ-కీళ్లూ తెలిపే వృక్ష ఫలాలను తినిపించాడు. ఆ ఫలాలు తిన్నవెంటనే వారు విజ్ఞానులైపోయారట. అయితే అవితిన్న దినాన మీరు నిశ్చయంగా చస్తారని యెహోవా బెదిరించాడు. సర్పాకారంలోనున్న అపవాది మీరు చావనేచావరని అభయమిచ్చాడు. ఆ ప్రకారంగానే ఆదాము హాయిగా "పిల్లా మేకలనుకని" ఏకంగా తొమ్మిది వందల ముప్పది ఏళ్లు బ్రతికి హాయిగా మరణించాడట. (ఆదికాండం 5:5) చూడండి.



5) జ్యూపిటర్ ప్రొమెథియస్‌ను గొలుసులతో బంధించాడు.



ఆ ప్రకారంగానే యెహోవా లూసీఫరు (అపవాది)ని నిత్యపాశములతో బంధించి, చీకటిగల బిలముల్లో బంధించి కావలిలో వుంచాడు.

I వ. పేతురు, యూదా గ్రంథములందు వ్రాయబడి వుంది.

6) ప్రొమెథియస్ ముఖ్య అనుచరుని పేరు "పేతురూస్" అట. తాను ప్రొమెథియస్ ముఖ్య అనుచరుడననే విషయం తెలిస్తే తనను కూడ జ్యూపిటర్ దేవుడు చంపేస్తాడనే భయంతో అడ్రసులేకుండ అజ్ఞాతంలోకి పారిపోయాడట!

అచ్చం ఆ విధంగానే యేసు ముఖ్య శిష్యుడైన "పేతురు" యేసు ఎవరో నాకు తెలియదంటే తెలియదు. నేనాయనను ఎరగనే ఎరగనని ముమ్మారు అబద్ధాలు ఆడి మెల్లగా జారుకున్నాడు. ఇక్కడ మనము చూడగా క్రీస్తు పూర్వము నాలుగు వందల ఇరువదియైదు సంవత్సరాల క్రితము రచించబడ్డ గ్రీకు పురాణగాథలోని ప్రొమిథియస్ ముఖ్యశిష్యుని పేరు పేతురూస్ కాగా...సరిగా అదేపేరు యేసు ముఖ్యశిష్యునికి ఉండడము కాక తాళీయమంటారా?





"కాక తాళాయం" అనగా ("కాకి-తాడి చెట్టు") తాడి చెట్టు క్రింద కాకి వుంటే తాటి పండు సరిగా కాకి నెత్తి మీద పడటం బహు అరుదు. నిజంగా అటువంటి సంఘటన జరిగితే - దానిని కాకతాళీయం అంటారు.

7) ప్రొమిథియస్ సిలువ మరణ సమయంలో మానవాళికి జ్ఞానాన్ని అందించిన మహానీయునిగా కొందరు స్త్రీలు అతని మరణ సమయములో సిలువ యొద్దకు వచ్చి హృదయ విదారకంగా విలపించారట.



ఇదిగో ఇక్కడ చూడండి! యేసు సిలువ మరణ సమయంలో యేసుకు అత్యంత సన్నిహితులైన "మగ్దలేని మరియ" మరికొందరు స్త్రీలు రాణువవారికి సైతం వెరవకుండ సిలువ యొద్దకు వచ్చి విలపించినట్టుగా మనకు అనేక చిత్రాలు సాక్ష్యమిస్తున్నాయి. గ్రీకు పురాణకథకు బైబిల్‌కు ఇంతటి అవినాభావ సంబంధం ఎలా వచ్చిందో ఆలోచించగలరా?

8) మరికొన్ని ముఖ్యమైన కొండ గరుతులు: ప్రొమిథియస్ మరణించిన వెంటనే సూర్యుడు అంధకార బంధురమయ్యాడు.

యేసు మరణించిన సమయములో కూడ చీకట్లుకమ్మాయి.

9) ప్రొమిథియస్ మరణించిన వెంటనే భూమికంపించింది.

యేసు మరణానంతరం కూడ భూకంపం వచ్చింది.

10) ప్రొమిథియస్ మరణించగా కొండలు బండలు పగిలాయి.

యేసు మరణానంతరం కూడ ఇలాగే జరిగిందట.

11) ప్రొమిథియస్ మరణ సమయములో సమాధులు తెరవబడ్డాయి. అనేకులు సజీవులైలేచారు.

యేసు మరణ సమయంలో కూడ సమాధులు తెరవబడి అనేక మంది పరిశుద్ధులు సజీవులై వచ్చిరట. (కాని అందు ఏ ఒక్కరి పేరుగాని, అడ్రసులు గాని వ్రాయబడలేదు.) ఆ సమయంలో నేనక్కడ వుంటే మరణించినపుడు నీ వెక్కడి కెళ్లావు నీ ఆత్మ పాతాళానికి గాని దిగిందా? లేక "పరదైసు" కు ఎక్కిందా! మొదలగు వివరాలు అడిగివుండేవాడిని. అసలు చనిపోయి మట్టిలో కలసిన వాడెవరు జీవించడు. అది అసంభవము. దీనికి ఎన్నటెన్నటికి సమాధానము దొరకదుగాక దొరకదు.

అపవాదికి ప్రొమిథియస్‌కు అనేక దగ్గర పోలికలు కనబడుచున్నందున ఈ కథ ఆధారంగా బైబిల్‌లో అపవాది పాత్రను ప్రవేశపెట్టి వుండవచ్చును. ఈ కథనంలో అపవాది పాత్రకన్నా జ్యూపిటర్‌కు యెహోవాకు...ప్రొమిథియస్‌కు యేసుకు మరింత దగ్గర సంబంధం కనబడుతుంది. అలాగే ప్రకటన గ్రంథంలో చాలా భాగాలు గ్రీకు పురాణ కథలనే పోలివున్నాయి. రాగల రచనలలో అట్టి క్రూరమృగాలను సచిత్రంగా చూడవచ్చును.

ఇంతటి తేటతెల్లంగా బైబిల్‌లో చేర్చబడిన గ్రీకు పురాణాల తాలూకు ప్రక్షిప్తాలను సాక్ష్యాధారాలతో సహాచూచాము. ఈ పుక్కిటి పురాణగాథల కార్బన్ కాపీ లాంటి ఈ సత్యాలు క్రైస్తవ మత పునాదులను కంపింపజేయగల వనుటలో సందేహము లేదు.

అయితే బైబిల్ గ్రంథమందలి అపవాదిది దుష్ట పాత్రగాను, యెహోవా పరమదయాళుడు గాను చెప్పడం మనము చూస్తాము అయితే ఈ బైబిల్ ప్రసంగికులు చేసే ప్రసంగాలలో ఏ మాత్రము నిజంలేదు.

అసలు మనము నిష్పాక్షికంగా బైబిల్‌ను పరిశీలిస్తే ప్రేమగల తండ్రిగా దయాదాక్షిణ్యములు గల ప్రభువుగా కీర్తించబడే యెహోవాయే దుర్మార్గాన్ని, హింసను, జాత్యాహంకారాన్ని ప్రోత్సహిస్తూ అమాయక ప్రజల రక్తాన్ని చిందిస్తూ అనేక సార్లు తన ప్రజలని చెప్పుకున్న స్వజనులనే భయంకర హింసలకు గురిచేస్తూ, స్వల్పకారణాలకే అమాయక ప్రజల రక్తాన్ని చిందిస్తూ తన చేతులను రక్తసిక్తం చేసుకున్న భయంకరమైన దేవుడుగా యెహోవా! యే కనబడతాడు.

అయితే యావత్ క్రైస్తవ ప్రపంచం దృష్టిలో...దుష్టుడు. దురాత్మ, దైవవిరోధి, అపవాది, సాతాను దయ్యం, భూతం, సర్పం, ఘటసర్పం మొదలైన తిట్టినతిట్టు తిట్టకుండా నిందాపూర్వకమైన "బిరుదుల"తో క్రైస్తవ సోదరులను భయాభ్రాంతులకు గురిచేస్తున్న లూసీఫరు అనబడిన అపవాదే 100% బుద్ధిమంతుడుగా కనబడతాడు. బైబిల్ అంతా తిరగేసినా అతని నేరప్రవృత్తి ఎక్కడా కనబడదు. ఏభక్తుడైనా సరే గుండెల మీద చేయివేసికొని ఈ అపవాది ఒక్క నరమానవుడినైనా చంపాడేమో రుజువుచేయగలరా? ఏ క్రైస్తవ భక్తులనైనా ప్రలోభపెట్టి మాయమాటలతో పాపంలో పడగొట్టాడని ఎట్టి సాక్ష్యాధారాలకైనా రుజువులుచూపగలరా? చివరకు వీడే మానవ పక్షపాతిగా ముక్కుసూటిగా ప్రవర్తించేవాడుగా కనబడుతాడు.

యీ వాదనకు చాలామంది నాపై ఎదురుదాడి చేయప్రయత్నించవచ్చు. అపవాదిని గూర్చి వాడి దురాగతాలను గూర్చి తెలుసుకోవాలంటే మీరు, యోబు గ్రంథం చూడమని చెప్పవచ్చు. ఆ మాట నిజమేలాగుంది అయినా ఒకసారి యోబు గ్రంథంలోకి వెళ్దాము. అసలు యోబు గ్రంథం పరిశీలించేముందు "యెహోవా గ్రంథం" కాస్తపరిశీలిద్దాము.





ఒకసారి దేవదూతలు యెహోవా సన్నిధిని నిలుచు దినమొకటి తటస్థించెను. ఈ పరిశుద్ధ దేవదూతలతో పాటు దుష్టుడు, దుర్మార్గుడు, అపవిత్రుడు అయిన ఈ అపవాది ఏ విధంగా కలిసివచ్చాడు? సత్ప్రవర్తనగల మనమెవరైనా ప్రధానమంత్రిని కలుసుకొనే అవకాశం ఈ జన్మలో మనకు దొరకుతుందా? అటువంటిది ఒకనాడు వాడిని, వాడి అనుచరులను యెహోవా మెడపట్టిగెంటి వేయగా, కోటానుకోట్ల దేవదూతా సమూహాలు అసలు అపవాదిని దైవసన్నిధానంలోనికి అడుగు పెట్టనిస్తాయా? అది అసంభవం. అటువంటిది అపవాది అవలీలగా యెహోవా సన్నిధిలో అడుగు పెట్టగానే తనకు విధేయులైన దేవదూతా ప్రముఖుల నెవ్వరిని పలకరించకుండ సరాసరి అపవాది యొద్దకే యెహోవా వచ్చి "హలో! లూసీఫర్! హౌ ఆర్‌యు?" అన్నట్టు పలకరించడమేమిటి? ఏమయ్యా చెప్పాపెట్టకుండా వచ్చావ్! ఎక్కడి నుండి వూడిపడ్డావన్నట్టుగా యెహోవాయే ముందు పలకరించాడు. అందుకు అపవాది ఏదో భూమ్మీ అటూ ఇటూ తిరుగుతూ నిన్నుచూద్దామని వచ్చాన్‌లే! అనే "కేర్‌లెస్" సమాధానమిచ్చాడు. నిజానికి యెహోవా వాడిని చూడడంలోనే మరుక్షణమే వాడిని బంధించి కారాగారంలో పెట్టాలి.

అదేమీ జరలేదు. ఇరువురు స్నేహితుల మధ్యన జరిగిన సంభాషణలాంటిది తిరిగి యెహోవాయే ప్రారంభించాడు. ఏమయ్యా! లూసీ! నా భక్తుడైన యోబు ఎంతటి ఉత్తముడో నీకు తెలుసా? అతను యథార్ధవర్తనుడు, నా యందు భయభక్తులు గలవాడు... యోబు ఒక్కడు తప్ప భూమిమీద అటువంటి వాడెవడూలేడని గొప్పగా అపవాదికి చెప్పాడు యెహోవా! అందుకు అపవాది "కేర్‌లెస్"గా బదులిస్తూ! చాల్‌చాల్‌లే! వూరుకో వయ్యా! అతనికి నీవు సకలసంపదలు, పదిమంది సంతానాన్ని ఇచ్చి అతనికి అతని ఆస్తికి కంచెవేసినట్టు కాపాడుతున్నావు ఆ ఆస్తి తీసేశావనుకో! నీ ముఖంముందే నిన్ను ధిక్కరించకపోతే నాపేరు లూసీఫరు కాదనట్టు జవాబిచ్చాడు. యెహోవాకు రోషంకట్టలు తెంచుకొంటూ వచ్చింది. సరేనయ్యా నీకునాకు "పందెం" అన్నచందాన... యెహోవా మాట్లాడుతూ యోబును నీ చేతికి అప్పగిస్తాను నీయిష్టం ఏమయినా చేయ్! నాకు "నెంబర్ వన్" భక్తుడు యోబు ఒక్కడేవున్నాడు జాగ్రత్త అతని ప్రాణాలు మాత్రం తీయకని చెప్పి అపవాదిని సాగనంపాడు. ఇది ఎంతవరకు సమంజసం. లూసీఫరు ఎంతటి కుయుక్తి పరుడో యెహోవాకు చాలాబాగా తెలుసు.

అయితే క్రైస్తవ భక్తాగ్రేసరులు ఇక రెచ్చిపోయి మీరు సాతాను చాలా బుద్ధిమంతుడని, వెనకేస్తుకు వస్తున్నారు. వాడు ఎంతటి దుర్మార్గుడో చూడండి! యోబు గొర్రెలమందలను, పశువులను, వేలాదిమంది పనివారిని చంపలేదా! యోబు కుటుంబాన్ని మట్టుపెట్టలేదాయని నాకు ఎదురు తిరగవచ్చు. మీరు బైబిల్ సరిగ్గా మరొకసాది చదవండి. సాతాను వారినెవరినీ చంపలేదు. యెహోవాయే చంపపాడు. యోబు 1:16 చూడండి..(యెహోవా యొద్దనుండి) దేవుని అగ్ని ఆకాశమునుండి పడిగొర్రెలను, పనివారిని

కాల్చివేసెను...గొప్పసుడిగాలి వచ్చి యోబు కుటుంబీకులున్న ఇంటిని కూల్చగా అందరూ చనిపోయారు... ఈ విధంగా సమస్త ఆస్తిపాస్తులు, కుటుంభ సభ్యులుపోయి యోబు ఒక్కడూ మిగలగా మరల ఒకరోజు అపవాది యెహోవా యొద్దకు వచ్చికలవగా చూచావా? నా భక్తుడైన నా యోబు ఎంతటి స్థిరచిత్తమైన వాడో తెసిందా అని తిరిగి అపవాదిని రెచ్చగొడతాడు. అందుకు అపవాది మాట్లాడుతూ అతని యావదాస్తి పోయింది. ఇల్లుకూలి అతని కుటుంభ సభ్యులంతా మరణించారు. నిజమే నేనుకాదనుటలేదు. అయినా యోబు, అతని శరీరము చక్కగానే వుందికదా! నీవు మరొక్కసారి నీ చేయిచాచి అతని శరీరాన్ని, అతని చర్మాని మొత్తిచూడు అప్పుడతడు నీ ముఖంముందే నిన్ను ద్వేషిస్తాడని చెప్పగా సరే అలాగే చేద్దామని అపవాదికి "ఆపవర్స్" అనుగ్రహించాడో ఏమో! ఈసారి యోబుకు అరికాలు మొదలుకొని నడినెత్తివరకు కుష్ఠుకురు పుల్లొంటివి వచ్చేసి దురద భరించలేక పళ్లు గిట్టకరచి చిల్లపెంకులతో గీక్కొంటూ, బరుక్కొంటూ రక్తాలు కార్చుకొంటూ, నానా యాతనలు పడుచున్నాడు.

ఈ హింసాకాండకు అసలు కారకులెవ్వరు? ప్రపంచంలో ఉన్నయేకైక భక్తుడైన యోబును కాపాడుకోవలసింది పోయి యెహోవాయే తన సన్నిధానం నుండి అగ్నినికురిపించి...తుఫాను రావింపజేసి యోబు ఇంటిని కూల్చి కుటుంభ సభ్యులను చావగొట్టడం...వళ్లంతా కురుపులతో బాధించడం ఏమిటి దీనికి మూలకారకుడు యెహోవాకాదా! పోనీ మీరు భావించినట్టు అపవాది దొంగే అనుకుందాము కాస్త బుద్ధికుశలత ఉన్నవాడెవడైనా దొంగకు తాళం చేతులిచ్చి పంపుతాడా! ఇందు అపవాది తప్పు ఇసుమంతైనా లేదు. అసలు ప్రథమ ముద్దాయి యెహోవాయే! భక్తి పారవశ్యంలో విశ్వాసుల దృష్టికి ఇవేమి కనిపించవు. యెహోవా అపవాది ముందు గొప్పలకుపోయి తన భక్తుడైన యోబును బలిపశువును చేయాలా! వాడెంతటి కిల్లాడీగాడో యెహోవాకు తెలియదా!

యావత్ ప్రపంచ భక్త జనులను అమ్మో అపవాది సామాన్యుడు కాడు. వాడిని అడగడుగునా ఎదిరించండి. వాడితో యుద్ధం చేయండి. అంటూ జాగ్రత్తలు చెప్పి నీతులు వల్లించిన యెహోవా అంతటి వాడే అపవాదిని సాదరణంగా ఆహ్వానించి మంచిచెడ్డలు మాట్లాడి యోబును సర్వనాశనం చేస్తాడా దీనికంతటికి మూలకారణం ఎవరు? యెహోవా కాదా! ఈ కథలో అసలు ముద్దాయి యెహోవాయే, దుష్టాత్ముడు, దుర్మార్గుడు, నరహంతకుడు గాను మరింత తేటగా చెప్పాలంటే నికృష్టమైన దొంగతనం, దోపిడీ, జాత్యాహంకారం చివరకు వ్యభిచార మనస్తత్వాన్ని కూడ అనేక సార్లు ప్రోత్సహించిన ఘనచరిత్రగల వానిగా బైబిల్ తేటతెల్లంగా, దాపరికం లేకుండా అనేక కథాసాంగ్రహాలు బట్టబయలు చేస్తున్నాయి. ఇంతటి తీవ్రమైన వ్యాఖ్యలను నేను చేయడంలేదు కేవలం





బైబిల్‌లో వున్న విషయాలనే చెబుతున్నాను.

అయితే క్రైస్తవ సోదరులు ఈ నావాదనను అత్యంత తీవ్రంగా గర్హిస్తూ అసలు ఈ రచయితయైన నెల్సన్‌రష్దీ గాడే పెద్దసైతానని, వీడిని సాతాను సంపూర్ణంగా ఆవరించి ఈ విధంగా పలికిస్తూన్నాడని ఇది తిరుగులేని యధార్థమని నాపై ఎదురుదాడి చేయ ప్రయత్నిస్తారు. అయితే ఈ వ్యాఖ్యలలో అతిశయోక్తులు ఎంతమాత్రము లేవని ఇవన్నీ యధార్థాలని చాలా మందికి తెలుసు.



ఈ రచనలో నేను పై మాటలు వ్రాయుచున్న సందర్భంలో నాకేవో గత స్మృతులు గుర్తుకువచ్చినా ఒళ్లు జలధరించింది. వెంటనే నాకొక అనుమానం వచ్చింది. ఒకవేళ్ల నిజంగానే నన్ను సైతాను ఆవరించిందేమోనని అనుమానం వచ్చింది. అది మే నెల, 1985వ సంవత్సరం నా రచనా వ్యాసంగం నాటినుండే సాగుతూవుంది. ఈ సందర్భంలో నాకు ప్రశాంతచిత్తం అవసరమని బెల్లంపల్లి (ఆదిలాబాద్ జిల్లా) రైల్వేస్టేషన్ సమీపమందున మా హౌసింగ్ కాంప్లెక్స్ వెనుక భాగంలోనున్న నిమ్మతోట, మామిడి చెట్ల గుబురుల్లో నాకు ప్రశాంతచిత్తం అవసరమని ప్రతీ ఆదివారము అక్కడకు వెళ్లి రచనా వ్యాసంగంలో మునిగివుండేవాడిని. అంతనా ఏకాగ్రతను భంగం చేస్తూ ఏదో గలగలమని చప్పుడైయ్యింది. నేను మామిడి చెట్టుచుట్టూ కుండీలాగ కట్టిన గోడకు ఆనుకొని వున్నాను. అంతలో నా



చెవికి ఏదోచల్లగా తగిలింది. నేను వెనుదిరిగి చూచి అప్రయత్నంగా వెర్రికేక వేశాను. నాకు రెండుంగుళాల చల్లచల్లగా నా చెవికి తాకింది అయిదారు అడుగులపొడవైన పాము. దానిని పరిశీలించగా అది సుమారు మూడున్నర దూరంలోనే కొమ్మకు చుట్టుకొనివుంది. దానిని పరిశీలించగా అది సుమారు మూడున్నర కిలోల బరువుగల "రెండు తలకాయల పాము"గా వ్యవహరించబడే విషరహిత పాముగా గుర్తించాను అనంతరం దానిని పట్టుకొని ఇంటికి తీసికోనివెళ్లి చాలాకాలం పెంచి చివరకు దానిని అడవిలో వదలివేయడం జరిగింది.

అయితే అప్పుడు నాకు "అపవాది-సర్పాకారం" సంగతి ఏ మాత్రం గుర్తుకురాలేదు. కాని ఈ 2010లో ఈ రచనను ముద్రణకు అనువుగా తిరుగవ్రాయుచుండగా ఒకవేళ అలనాటి అపవాది సర్పాకారంలో నాకు ప్రత్యక్షమైయ్యిందే మోనని అనుమానం వచ్చింది. ఈ విషయాన్ని గూర్చి కాస్త ఆలోచించగా అది అప్పుడు నా చెవిని తాకిందేగాని ఒక్క మాటయినా నా చెవిలో వేయలేదు. అందునా అది తెలివైనది చురుకైనదీ కానేకాదు. సర్పం అంతకన్నాకాదు. ఒకవేళ్ల అదే సాతానైయ్యుండి ఒక్క మాటయినా నాతో మాట్లాడియుంటే దానిని వెంటనే అపవాదిగా గుర్తించి...అపవాది, దయ్యం, భూతం వుంది గనుక... దేవుడు కూడ నిజమేనన్న మాటయని వెనువెంటనే నేను మారు మనస్సు పొంది, ఈ బైబిల్ వ్యతిరేక గ్రంథాన్ని ముక్కలు ముక్కలుగా చించి కాల్చి బూడిద చేసి గంగలో కలిపి నేనొక నిజమైన దైవసేవకునిగా మారిపోయి ఈ 20వ శతాబ్దంలో సైతానును ప్రత్యక్షంగా చూచిన నేటి నరమానవునిగా-రక్షణ-టివి, ఆరాధనా టి.వి. సువార్త, శుభవార్త, కల్వరి ఛానళ్లు మొదలైన సమస్తగాడ్ ఛానళ్లను అదరగొడుతూ ప్రముఖ దూరదర్శన్ ప్రసంగికునిగా మారిపోయి యుండేవాడిని. పాము ప్రత్యక్షమైన నాడు నేను తీయించిన ఫోటో సంగతి గుర్తుకొచ్చి వెదకగా చివరకది దొరికింది. దానినే ఈ రచనలో పొందుపరచడం జరిగింది. చిత్రాన్ని మరొక్కసారి పరీక్షగా చూడండి. నా వెనుకనే కొమ్మకు చుట్టుకొని వున్న పాము కనబడతాది.





# భూమి నుండి - జీవం...

యెహోవా - యేసుక్రీస్తుల సర్వజ్ఞత మరోకోణం నుండి పరిశీలిస్తే వర్తమాన, భూత, భవిష్యత్ గ్రాహులుగా కీర్తిప్రతి్స్ఠ లందుకొంటున్న వీరిరువురు కూడ అజ్ఞాన మనస్కులు గానే కనబడతారు. ఇట్టి తీవ్ర పదజాలం గూర్చి భక్తజనులు ఆవేశాందోళనలకు గురికాకుండ ఈ రెండు మూడు పేజీలను కాస్తసావధానంగా చదివితే ఇందలి సత్యం అవగాహన కాగలదు.

అయితే మీరు ఈ శీర్షికను చదవక ముందు నుండే ఈ ఆధునిక ప్రపంచ క్రైస్తవ సమాజాలు - రాత్రింబవళ్లు సమస్త గాడ్ ఛానళ్లందు అనేకమంది భక్తాగ్రేసరులు నిర్విరామంగా చాలాకాలంగా వింటూ కూడ ఇట్టి పనికిమాలిన ప్రసంగాలను పెడచెవిని బెట్టి అభ్యుదయ పథంలో ముందుకు సాగుచున్నందుకు గాను యావత్ ప్రపంచ క్రైస్తవ సోదర సమూహాలను "అడ్వాన్సుగా" అదే ముందస్తుగా నా హృదయ పూర్వకంగా అభినందిస్తున్నారు.

> యెహోవా తాను చేశారని చెప్పే సృష్టికార్య వివరణలో... *(ఆదికాండం 1:24-25)* చూడగా - దేవుడు వాటి వాటి జాతి ప్రకారము జీవము గల వాటిని... పశువులను, పురుగులను, అడవి జంతువులను భూమి పుట్టించను గాకయని పలికెను. ఆ ప్రకార మాయెను. అది మంచిదని దేవుడు చూచెను.

పై వాక్యమును మనము పరిశీలించి చూడగా... ఈ సర్వోన్నతుడైన యెహోవా మహాజ్ఞానియైన తండ్రి తాను ఇంకా భూమికి పునాదులు వేయకముందే వర్తమాన, భూత భవిష్యత్ గ్రాహియై సమస్తము ఎరిగిన వాడని చెప్పబడుచున్న యెహోవా - రాళ్లు, రప్పలు, మట్టి మయమైన "భూమి చెవిలో" చెప్పినంతనే సమస్త జీవజాతులు, పురుగులు పుట్రలు పుట్టుకొచ్చాయా? ఇందు మలేరియా, పైలేరియా, టైఫాయిడ్, కుష్ఠ, కేన్సర్, క్షయ, ఆస్తమా, ఎయిడ్స్, కలరా, న్యూమోనియా, బ్రెయిన్ ఫీవర్, చికన్ గున్యా, సైన్‌ఫ్లూ, డెంగ్యూ, చికిన్ ఫాక్స్ తదితర భయంకర రోగకారక క్రిములైన వైరస్‌లు, బ్యాక్టీరియాలు పుట్టు కొచ్చాయా? ఇంతేగాక వీటిని వ్యాప్తి చేసే ఈగలు, మరిముఖ్యంగా దోమలు గయ్ - మంటూ ఎగిరివచ్చేశాయా! ఇవన్నీ అహా! ఎంత బాగున్నాయి! అంటూ ఇవన్నీ చాలాచాలా బాగున్నాయని ఆనందిచడం ఈదయా మయుడైన దేవాది దేవుడు ప్రశంసలు కురిపించడం ఎంత వింతగావుంది. ఇట్టి ప్రాణాంతక వ్యాధికారక వైరస్‌లను యెహోవా తెగమెచ్చుకోవడంతోని ఔచిత్యమేమిటి?

అసలు మంటి నుండి జీవంపుడుతుందా? నేటి ఆధునిక బైబిల్ ప్రసంగి కోత్తములు సైతం మంటిలో జీవమున్నదని "తందానతానా!" అంటూ ప్రచారము చేయడము

చూస్తాము. దేవుడు మంటినుండి మానవుని రూపొందించాడని అలాగే సమస్త భూజంతువులు, క్రిమికీటకాదులను భూమినుండే రావింపజేశాడని భావించే ఇట్టి క్రైస్తవ విశ్వాసులు ఇదంతా నిజమేనని నమ్ముతారు. నమ్మడమేకాదు నేటికి భూమినుండి జీవం పుడుతుందంటారు. ఈ విధమైన ప్రచార పరంపరలో విశాఖపట్నం – అక్కయ్య పాలెంకు చెందిన ప్రముఖ మత ప్రచారకుడు "జయశాలి"గా పిలవబడుచున్న శ్రీయుత పి.డి.సుందర్రావు గారు నడిపే "భూతలక్రిందులు" అనే క్రైస్తవ మాసపత్రికలోను, "21వ, శతాబ్దపు సంచలనాలు" అనే ప్రచురణలందు.. . దేవుని వాక్కునుండి భూమి పుట్టిందని జంతువుల మలం నుండి, వాటివాటి మృత కళేబరాల నుండి, కుళ్లి పోయిన ఆకులలమల నుండి క్రిమి కీటకాదులు పుట్టుట లేదా! అని వివరించారు. నిజమే! ఒకనాటి శాస్త్రవేత్తలు కూడ పై విధంగానే భావించారు. వారినేమి తప్పుబట్టలేము.

అలనాడు మత్తుమందు కనుగొనని రోజుల్లో మత్తుమందు ఇవ్వకుండ చేసే బలవంతపు ఆపరేషన్ సమయాల్లో తమ చేతిలోని కత్తికి మధ్యమధ్యలో పదును పెట్టుటకు గాను నాటి నాటు వైద్యులు తమ కత్తెను తమలెదర్ బూట్లకు రుద్ది పదునుపెట్టే ప్రయత్నం చేసేవారట. అయితే తాము శస్త్రచికిత్సను సక్రమంగా చేసినప్పటికీ కొన్నిసార్లు రోగి మరణించే వాడు. అయితే గాయం "ఇన్‌ఫెక్షన్" కారణంగా సెప్టిక్ అయిన విషయం వారికి అర్థంకాక సతమతమైయ్యేవారట. దీనికి కారణం నాటికి సూక్ష్మదర్శినిని కనుగొన నందున, సూక్ష్మదర్శిని అందుబాటులోకి వచ్చాక కూడ ఎలక్ట్రానిక్ సూక్ష్మదర్శినిని కనుగొన్న అనంతరమే అత్యంత సూక్షాతి సూక్ష్మజీవులైన బ్యాక్టీరియా, తదితరవైరస్ జీవుల ఉనికి వారికి తెలిసింది. నాడు యెహోవాకు (నాటి రచయితలకు) ఇట్టి రోగకారక క్రిముల సంగత సూచన ప్రాయంగానైనా తెలియనందున ఆయా జీవులన్నీ మంచివైనట్టుగా చెప్పబడింది. అనంతరం వైజ్ఞానిక యుగాల దశలో అలెగ్జాండర్ ప్లెమింగ్ పెన్సిలిన్‌ను కనుగొని మానవాళిని రక్షించాడు.

నేటి ఆధునిక ప్రపంచంలో కూడ ఈ "వైరస్" జీవుల వుధృతి ఎంతగా వ్యాపించి యుందో తెలియజేసే విషయాన్ని ఈ వార్త ద్వారా మనము అవగాహన చేసి కోవచ్చును.

కేవలము 2000 సంవత్సరాల క్రితము అవతరించాడని చెప్పే యేసయ్య స్వయానా యెహోవా కుమారుడని చెప్పబడుచుండగా యేసుకు కూడ సమస్తము ముందే తెలుసునని, ఆయన సర్వమానవుల అంతరంగాలను ఎరిగినవాడని, ప్రపంచంలో ఏమూల ఏముందో ఇట్టే చెప్పగల సమర్థుడని ఆయనను గూర్చి చెప్పబడింది. (అయితే ఆయనకు అరబ్బుదేశాల సంగతులు, నాటి ఇశ్రాయేల్ దేశమందలి ఊళ్లు మాత్రమే తెలుసు గాని అమెరికా, ఐరోపా ఖండాలు కూడ భూమిమీద వున్నాయనే విషయాల నామమాత్రంగానైనా తెలియదు.) యేసుకు ఏమూల ఏముందో ముందే తెలుసుకొని ఒక ఉదాహరణ





"ఈనాడు" గురువారం ఫిబ్రవరి 3, 2011

## ఒక్క తుమ్మే చాలు

- గదిలో ఫ్లూ వైరస్ వ్యాపించేస్తుంది
- అమెరికా శాస్త్రవేత్తల వెల్లడి

లండన్: ఫ్లూతో బాధపడుతున్నారా? అయితే ఆఫీసులో తుమ్మటానికి ప్రయత్నించకండి. ఎందుకంటే ఒక్క తుమ్ముతోనే ఫ్లూ వైరస్ గదినిండా వ్యాపిస్తుందనీ, పైగా దాని ప్రభావం గంటల కొద్దీ ఉంటుందనీ అమెరికా శాస్త్రవేత్తలు గుర్తించారు. దగ్గు, తుమ్ముల ద్వారా బయటకొచ్చిన సూక్ష్మమైన బిందువులు గాలిలో గంటలకొద్దీ తిరుగుతుంటాయని.. ఫ్లూని వ్యాప్తి చేయటానికి తగినంత వైరస్ వాటిల్లో ఉంటుందని వర్జీనియా టెక్ పరిశోధకుల అధ్యయనంలో వెల్లడైంది. వైరస్ దూషిత గాలిని పీల్చిన గంటలోనే ఫ్లూ దాడి చేస్తున్నట్లు కనుగొన్నారు. క్యూబిక్ మీటరు విస్తీర్ణంలోని గాలిలో సగటున 16 వేల వైరస్ బిందువులు ఉన్నట్లు వెల్లడైంది.

చెప్పబడింది. ఒకసారి ఆయన తన శిష్యులను పిలచి నేను ప్రవక్త ప్రవచనం ప్రకారం ఒక గాడిద పిల్లనెక్కి పయనించ వలసియుంది. మీరు అర్జంటుగా బేతనియకు ఆవలనున్న గ్రామానికి వెళ్లండి అక్కడ ఇంతవరకు ఎవరూ ఎక్కని ఒక గాడిద పిల్లకట్టబడి వుంటాది. వెళ్లిదానిని తీసికొని రమ్మని చెప్పివారిని పంపుతాడు. (నేటి బాబాలైతే నా కొరకు ఒక "బి.యం.డ.బ్ల్యు" లగ్జరీకారు ఆరేంజ్ చేయమని చేబుతారు.) ఇంతటి కాలజ్ఞానియైన యేసూప్రభునికి కూడ కొద్దోగొప్పో అవగాహన ప్రారంభమైన రెండువేల సంవత్సరాల క్రితము కూడ రోగకారక క్రిములను గూర్చి ఏ మాత్రము తెలిసినట్టులేదు. అప్పుడు ఉన్నత మట్టుకు విద్యా వికాసాలు గల శాస్త్రులు, పరిసయ్యులు అనేక మార్లు యేసు, ఆయన శిష్యుల యొక్క కార్యకలాపాలను గూర్చి తరచుగా విమర్శిస్తూ యుండేవారు. కాని యేసు తన మాటకారి తనంతో ఏదోవిధంగా ఎదిరించి వారిని అవమాన పరుస్తూ వుండేవాడు.

ఒకసారి వారు యేసునొద్దకు వచ్చి మీరు, మీ శిష్యులు ఊరంతా తిరిగి వచ్చి స్నానం చేయకుండ, కనీసం కాళ్లూ చేతులైన శుభ్రపరచుకోకుండా భోజనం చేయడ మేమిటని మీరు యూదుల పారంపర్యాచారాలను అసలు పాటించుట లేదని ఘాటుగా విమర్శించారు. యేసుకు వళ్లు మండి పోయినట్లుంది. వెంటనే వారిమీద "సీరియస్" ఔతూ, కోపంతో...వేశధారువైన అవివేకుల్లారా! మీరు స్నానాధికాలు చేస్తూ, గిన్నెలు, పళ్లాలు బయట మాత్రమే శుభ్రపరుస్తూ పైపైకి శుభ్రంగా కనబడతారేగాని, మీ హృదయాలన్నీ కల్మషంతో నిండివున్నాయని నిందించింది చాలక అవివేకుల్లారా! మీకీ మాత్రం తెలియదా? బయట నుండిలోనికి పోవునదేదియు మనుష్యుని అపవిత్రం చేయదని,

లోపలి నుండి బయటకు వచ్చేదే అపవిత్రమైనదని, అదిగాకున్నా బహిర్భూమిలో అపవిత్రమైన దంతా విడువబడి (కడుపులోని) భోజన పదార్థములను పవిత్రము చేయును గదాయని పాతకాలం నాటి నాటువైద్యునివలె మాట్లాడి తన అజ్ఞానంతో వారినోళ్లు మూయించి పంపినట్లు కనబడతాది. (చూడండి..మార్కు 7వ అధ్యాయము, లూకా 11:37-41) ఈ అవగాహనా లోపమైన సంభాషణను బట్టి యెహోవా కుమారుడైన యేసుకు ఆయన "డాడీ" వలెనే ఆరోగ్యసూత్రాలకు సంబంధించిన "ఓ.నా.మా." లైనా రాని పామరులుగా కనబడు చున్నాడు. అలనాడు కొద్దో గొప్పో శాస్త్ర పరిజ్ఞానమున్న శాస్త్రులకే యేసు చెత్త ఆరోగ్య సూత్రాలు బోధించుటకు గల కారణం యేసుకు చదువు సంధ్యలు ఏ మాత్రము లేక పోవడమే! (చూడండి...యోహాను 7:15) ఈ వాక్యం ప్రకారం యేసుకు విద్యాగంథలేదని, అయినా ఆయనకు ముక్కుపచ్చలారక ముందునుంచే బాలకార్మికునిగా అదయినా కార్పెంటర్ హెల్పర్‌గా పనిచేయడం జరిగింది. అయినా యేసు "అరమేయిక్" భాషలోవున్న యూద మతగ్రంథాన్ని పఠించే పరిజ్ఞానాన్ని సంపాదించినట్టుగా కనబడతాది. బైబిల్ సృష్టికర్తలు అపవాది అనబడే సాతానుగాడికే యెహోవా ధర్మశాస్త్ర గ్రంథవాక్యాలు తెలుసునని యేసు శోధనల సమయంలో చెప్పగాలేనిది యేసుకు కూడ చదువు వచ్చునని చెప్పుటలో వింతేముంది?

ఇక్కడ మనము దేవుళ్లకే ఆరోగ్యసూత్రాలు తెలియవా? అంటూ ఈ దైవ పాత్ర దారులను నిందించి ఏమి ప్రయోజనం? అయితే ఈ యూద మతగ్రంథ రూపకర్తలకే ఇట్టి వాటిపై అవగాహన లేనప్పుడు వారి రచనలు ఇంతకన్నా మెరుగుగా సాగే అవకాశము ఎలా గుంటుంది?



నేడు మినరల్ వాటర్ ప్రచార సందర్భాలలో ఒక గ్లాసుడు మంచి నీళ్లలో కోటి వైరస్ - క్రిములు వుంటాయని అందలి బ్యాక్టీరియా క్రిములు మనల్ని మృత్యువు ఒడిలోనికి తీసికొని వెళ్తున్నాయని ఆయా కంపెనీలు మొత్తుకొంటూ వుండగా... నేడు కరడుగట్టిన క్రైస్తవ విశ్వాసులు సైతం... లేదు లేదు! కాదుకాదు!! మన సర్వజ్ఞుడైన ప్రభువు వారు చెప్పారు కదా! లోనికి వెళ్లేదంతా పవిత్రమైన దేనని పట్టుబట్టకుండా యేసుని అజ్ఞాన బోధనలను నిర్ద్వందంగా ధిక్కరిస్తూ శాస్త్ర విజ్ఞానం ఎప్పటికప్పుడు మనకు అందిస్తున్న సూచనలను "తు.చ" తప్పకుండ పాటిస్తూ ఆహారపానీయ భద్రతకు పెద్దపీట వేస్తూ క్రమం తప్పకుండ ప్రశస్తమైన మినరల్ వాటర్‌తో తమతమ ఆయురారోగ్యాలను





పరిరక్షించుకొంటున్న సర్వలోక క్రైస్తవ సోదరసోదరీ మణులను మరియొకసారి మన: స్ఫూర్తిగా అభినందించకుండ వుండలేక పోతున్నాను.

## ఇదీ సంగతి!




"బ్యాక్టీరియా" దాని తీవ్రతలపై ప్రముఖ దినపత్రిక "ఈనాడు" వెలువరించిన సందేశాత్మకమైన చక్కని "ఇదీ సంగతి" కార్టూనును ఇక్కడ సందర్భోచితంగా ప్రచురిస్తున్నాను.

గుంటూరుకు చెందిన నిర్మల మేరీ అనే ఒక మహామేధావి బహువిద్యా పారంగతురాలు, ఆచార్య నాగార్జున యూనివర్సిటీ మాజీప్రిన్సిపాల్ గారు "బైబిల్ వాక్కులు - సైన్సు సాక్ష్యాలు" అనే పుస్తకం ప్రచురించారు. అందు యావత్ సైన్సు బైబిల్‌నందే వుందని చెప్పే ప్రయత్నంలో బైబిల్ వాక్యాలకు చిన్నచిన్న అబద్ధాలు లాంటి అతిశయోక్తులు జోడించి (యెహోను 2:6 లో) శుద్ధీకరణ ప్రకారము చేతులు కాళ్లు కడుగుకొని భోజనము చేయాలని బైబిల్‌లో వున్నట్టుగా భ్రమింపజేస్తూ కంటికి కనబడని బ్యాక్టీరియా క్రిముల నుండి విముక్తుల మౌతామని బైబిల్‌లో ఇట్టిసైన్స్ అంతా నిక్షిప్తమై వుందని మోసపూరిత రాతలు వ్రాశారు. అయితే మనము పై వాక్యమును చూస్తే... యూదుల శుద్ధీకరణాచారం ప్రకారము రెండేసి మూడేసి తూముల (నీరు) పట్టు రాతిబానలు అక్కడ వున్నవని మాత్రమే వ్రాయబడి యుంది. ఇట్టి ఈ రచయిత్రి మాయమాటలను ఎండగడుతూ... ముఖ్యంగా సైన్స్ అంతా బైబిల్‌నందే వుందని చెప్పిన విషయాలను "ఇది నిజమా!" ద్వితీయ భాగంలో చూడగలరు. -రచయిత

# మానవ దేహం పురుగుల పుట్ట!



మానవ జన్మమహోత్కృష్టమైనదని అది మహోన్నతమైనదని, అత్యంత పవిత్రమైనదని, వీరు కారణ జన్ములని, యావత్ ప్రపంచమందలి సమస్త మత గ్రంథాలు వాటి తాలుకు దేవుళ్లు, ఆయా ప్రవక్తలు, స్వాములు, రుషులు, మత గురువులు ఏక కంఠంతో వక్కాణిస్తూ యుంటారు. ఈ విధంగానే ఆయా గ్రంథాలు కూడ ఘంటాపథంగా చెబుతూయుంటాయి. క్రైస్తవ మతం నరుడు సాక్షాత్తూ దేవుని పోలికలోనే చేయబడ్డాడని వివరించింది. ఇట్టి సృష్టికార్య వివరణలో ఈ విషయాలను మనము సవిస్తరంగా చర్చించాము. అయితే ఇట్టి మానవునికి దేవునికి వుండవలసిన లక్షణాలు ఎందుకు రాలేదని బేరీజువేశాము.


బోనీ బాస్లేర్

"బోనీ బాస్లేర్" అనే ఆమె రసాయిన శాస్త్రంలో పి.హెచ్.డి. చేస్తున్న సమయంలో, ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయంలో మైక్రోబయాలజిస్టు, "సిల్వర్ మేన్" అనే జన్యు శాస్త్రవేత్త యొక్క ప్రసంగం వినడం తటస్థించింది. ఆయన బ్యాక్టీరియాను గూర్చిన అనేక క్రొత్త విషయాలను వివరించగా తెలిసికొని ఆమె ఆయన శాస్త్రవేత్తల బృందంలో చేరి పరిశోధనల అనంతరం మరిన్ని విశేషాలను ఆ విష్కరించడం జరిగింది. అనంతరం "బోనీ బాస్లేర్" ప్రపంచానికి మరిన్ని ఆశ్చర్యకర విషయాలను తెలియజేయడం జరిగింది.

"బ్యాక్టీరియా" అనే పదం ఏకవచనం. దీనికి బహువచనం "బ్యాక్టీరియం" అంటారు. ఒక మనిషి దేహంలో దాదాపు ఒకలక్ష కోట్ల సూక్ష్మకణజాలం వుంటుందని చెప్పుచుండగా యీలక్ష కోట్ల కణజాలాలను తమ ఆవాసాలుగా చేసికొని ఈ దేహసూక్ష్మాణువులను ఏకంగా పదిలక్షల కోట్ల బ్యాక్టీరియం సూక్ష్మజీవులు ఆశ్రయించి





జీవిస్తూ ఉంటాయని ఆమె తెలిపారు. అలాగే మానవ దేహమందు ముప్పదివేల "జన్యువు"లుండంగా వాటికన్నా సుమారు నూరురెట్లు అధికమైన బ్యాక్టీరియా లుంటాయని ఇందు 4,742 రకాల వివిధ జాతుల బ్యాక్టీరియాలు, ఈ వివిధ జాతుల క్రిమి సముదాయాలు మానవ శరీరంలో తిష్టవేసికొని కూర్చుంటాయని బోనీ బాస్లేర్ వివరిస్తూ ఇట్టి వాడిని మనిషి అనాలా లేక మరో విధంగా పిలవాలాయనే సందేహం వెలిబుచ్చారు.

ఏదయినా ఒక వస్తువుకు మనము పేరుపెట్టే సందర్భంలో, ఆ వస్తువు తయారైన పదార్థములేక దానిలో ఏమున్నాయో వాటి ఆధారంగా ఆయా వస్తువులకు పేర్లు పెడతాము. బంగారపు పూతపూసినంత మాత్రాన వాటిని బంగార అనము. "రోల్డ్ గోల్డ్" అనే అంటాము. మన శరీరంలోని "డి.యన్.ఎ."లతో పోల్చిచూస్తే నూటికి నూరుశాతం కన్నా ఎంతో ఎక్కువగా నున్న ఈ సూక్ష్మక్రిములైన బ్యాక్టీరియాలు మెజారిటీగా యున్నందున మనుష్యునికి "నరుని"గా నామకరణం చేయడం అంత సబబుగా అనిపించుట లేదేమోననిపిస్తుంది. మంటితో మానవుని చేసి వాని నాసికారంధ్రములలో యెహోవా తన జీవపు ఊపిరి ఊది మగవాడైన ఆదామును చేశాడని, బైబిల్ చెబుతుండగా అతనిని "పురుషుడు" అని మన మాతృభాషయైన తెలుగులో అంటున్నారు. మనపూర్వీకులకు గాని ఈ బ్యాక్టీరియా ఆచూకి ఏమయినా తెలిసిందో ఏమో గాని... "పురుగు" అనే మూడక్షరాలలోని మొదటి రెండక్షరాలను చేర్చి "పురుషుడు" అన్నారేమో! అనిపిస్తుంది.

యూదుల మూల పురుషుడైన యాకోబును ఉద్దేశించి యెహోవా ఒక సందర్భంలో "పురుగు వంటి యాకోబూ! అని సంబోధించాడు. (యెషయా 41:14) అదంతా మనకెందుకులే గాని బైబిల్ ప్రకారం మానవుడు దేవుని రూపంలో చేయబడ్డ డూప్లికేట్ మానవుడు కాగా మానవులకు మూలపురుషుడైన యోహెూవాలో అసలు సిసలైన బ్యాక్టీరియాలు మరెన్ని ఉండివుంటాయో, నరమానవుల కెవ్వరికీ తెలియదు.



— బోనీ బాస్లేర్ పరిశోధన

ఈ ప్రకారం లెక్కా పత్రంలేని విధంగా నింగి, నేల, నీరు, మంచు, అనే తేడాలేకుండా ఇంచుమించు విశాలవిశ్వమంతా ప్రభలిపోయి సకల ప్రపంచాన్ని గడగడ లాడిస్తున్న ఈ ప్రాణంతకమైన బ్యాక్టీరియా వైరస్ జీవుల ఉనికి యేసుకే కాదు ఏకంగా యెహోవాకు కూడ తెలియని విధంగా ప్రభలిపోయిన అత్యంత భయానకమైన ఈ చర్చను గూర్చి విద్యాధికులైన సోదరక్రైస్తవ సమాజాలు తీవ్రాతి తీవ్రంగా ఆలోచించవలసిన సమయం చాలా కాలనుండే మించి పోతుందని సవినయంగా విన్నవించుకొంటున్నాను.

సాక్షి దినపత్రిక 2010వ సంవత్సరంలో ప్రచురించిన "మానవ దేహం పురుగుల పుట్ట" అనే వ్యాసం ఆధారంగా వ్రాయబడింది. ఈ శీర్షిక...రచయిత. సాక్షి పత్రికకు అభినందనలు.

మంచి బ్యాక్టీరియా: సాధారణంగా బ్యాక్టీరియా సూక్ష్మజీవులనగానే అవన్నీ రోగకారక క్రిములేనని అందరూ తలంచుట సహజమే! యీ విధంగానే అనేకులు మొన్నమొన్నటి వరకూ తలస్తూ వచ్చారు. అయితే ఇందుమంచి బ్యాక్టీరియా క్రిములు కూడా వున్నాయని ఇటీవలి పరిశోధనల్లో మరింత వివరంగా తెలుసుకొన్నారు. పాలుపెరుగుగా తోడుకొనుటకు మంచి బ్యాక్టీరియా తోడ్పడుతుంది. ఇట్టి పరిశోధనలు మరింత ముందుకు సాగినందున అనేక విషయాలు వెలుగు చూచాయి. బ్యాక్టీరియాను మనకంటితో మనము చూడలేము. పాతకాలం వారు కోడిపేలను చూచియుండ వచ్చును. ఈ వైరస్ క్రిములు ఆ కోడిపేనును వేయి ముక్కలు చేస్తే ఎంతటి సూక్ష్మంగా యుంటాదో అంతచిన్నగా వుంటాయట. మన మానవ దేహంలో ఇటుంటి బ్యాక్టీరియాలు మంచివి, చెడ్డవి కలపితే వాటి బరువు సుమారు మూడుకిలోల వరకు తూగుతాయట. వీటిని లెక్కవేయాలంటే అవి ఎన్ని మిలియన్ల-ట్రిలియన్-ట్రిలియన్లుంటాయో అంచనాలకందవు.

తల్లిగర్భము నుండి పుట్టిన పసికందు లోపల పుట్టుకతోనే ఉన్న వైరస్‌లు కాక పుట్టినవెంటనే బిడ్డ పాలకోసం ఏడుస్తూ నోరు తెరచినప్పుడే మరిన్ని బ్యాక్టీరియాలు లోనికి ప్రవేశిస్తాయట. ఇవి నోట్లోను, చర్మమీద చేతివ్రేళ్లూ - కాళ్లసందుల్లోను, ముక్కు చెవులు, బొడ్డు మొదలైన తేమగాయుండే శరీరంలోను స్థావరాలేర్పరచుకొని జీవిస్తాయి. మానవ జీర్ణాశయ గోడలను అతుక్కొనియున్న రకరకాల బ్యాక్టీరియాలు మన జీర్ణప్రక్రియకు తోడ్పడుతూ వుంటాయని ఇటీవల కనుగొన్నారు. వీటిని మంచి బ్యాక్టీరియా



జీర్ణాశయ గోడలపై ఉండే రకరకాల బ్యాక్టీరియా మనం తీసుకున్న ఆహారాన్ని జీర్ణం చేసుకోవడంలో తోడ్పడతాయి.





అంటారు.

భూమండలం మీద నున్న బ్యాక్టీరియా ఎంతో అంచనా వేయడం దుర్లభం. కొందరు ప్రయత్నించినా దీనిపై ఏకాభిప్రాయంకుదర లేదు. అయినా ఒక అంచనా ప్రకారం ఐదు బిలియన్ - ట్రిలియన్ - ట్రిలియన్ల బ్యాక్టీరియా వుండవచ్చని అంచనా! ఇది ఊహించడం కూడ కష్టమే! కాల క్రమంలో మరికొన్ని క్రొత్తరూపాలతో ఇవి పెరుగుతూయుంటాయట. ఈ బ్యాక్టీరియాలను ఒకదాని వెనుక మరొకదాన్ని "క్యూ" కట్టిస్తే అవి వెయ్యికోట్ల కాంతి సంవత్సరాల దూరంవుంటుందట.

*ఒక కాంతి సంవత్సరం అంటే కాంతి ఒక్క సంవత్సర కాలంలో పయనించే సమయాన్ని ఒక కాంతి సంవత్సరం అంటారు. అసలు కాంతి వేగం నిముషానికి 1871/2 కోట్ల కిల్లో మీటర్లు పయనిస్తాది. నక్షత్ర మండలం, కాంతివేగం, నక్షత్రాలు భూమిమీద రాలుట మొ॥ వివరాలు "ఇది నిజమా!" ద్వితీయ భాగంలో విపులంగా చూడగలరు.*

అయితే ఇంతటి ప్రమాదభరితమైన ఈ సూక్ష్మాతి సూక్ష్మక్రిములను ప్రేమగల దేవుడు, కరుణాకటాక్షాలు గల తండ్రి దయామయుడైన యెహోవా దేవుడు సృష్టించనవే అంటారా? క్రైస్తవ పాఠకులు ఔననలేరు కాదనలేరు. మౌనం వహిస్తారు.

ఆఖరుగా ఇందలి యధార్ధమైన సంగతి నేనే చెబుతాను వినండి. బైబిల్ దేవుడైన కరుణా సముద్రుడైన యెహోవా! ఇంతటి ఘాతుకానికి ఎంతమాత్రము పాల్పడడు. వీటిని యెహోవా ఎంతమాత్రము సృష్టించలేదు. ఆయన నిర్దోషి. నిమిత్తమాత్రుడు. ఎవరైనా ఎప్పుడైనా ఈ విషయంలో యెహోవాను నిందిస్తే ఊరుకొనేది లేదు. తస్మాత్! జాగ్రత్త!

యెహోవా సృజించిన సృష్టికార్యం కేవలము ఆరేడు వేల సంవత్సరాలకు పూర్వమే జరిగిందని చెబుతూయుండగా ఈ దిక్కుమాలిన వైరస్‌లు, బ్యాక్టీరియాలు వందలుకాదు, వేలుకాదు, లక్షలుకాదు. ఏకంగా మూడు వందల కోట్ల సంవత్సరాలకు ముందే పుట్టామని చెబుతున్నాయి. ఈ విషయాలను అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ నాసా కూడ ధృవీకరించడమేకాదు. ఈ వైరస్‌లు ఇతర గ్రహాల్లో కూడ వుండ వచ్చునంటుంది.

ఇట్టి సమగ్ర సమాచారం వల్ల సమస్త జీవరాసి కేవలం ఆరేడు వేల సంవత్సరాల క్రితమే సృష్టించబడ్డాయని చెప్పే బైబిల్ కథనాలకు మూడువందల కోట్ల సంవత్సరాలకు పూర్వం నుండే బ్యాక్టీరియా జీవిస్తుందనే సైన్సు సత్యానికి ఏవిధమైన సంబంధములేనందున ఈ బ్యాక్టీరియాను సృజించాడనే నిందను యెహోవాకు అంటగట్టడం ఎంతమాత్రము సమర్ధనీయం కాదు. అందుచే ఈ విషయములో యెహోవాను నిర్దోషిగా చెప్పకతప్పదు. ఇందలి మంచి చెడ్డలతో ఆయనకు ఎటువంటి సంబంధములేదు.

మరో ముఖ్యవిషయం: మనతో పాటే పెనవేసుకొని యున్న ఈ బ్యాక్టీరియా మనము మరణించి మట్టిగలసి పోయినా మన ప్రాణంలో ప్రాణాలైన వీటికి మాత్రం మరణంలేదు. దహన సంస్కారాలు ఆచరించక సమాధి చేయబడిన క్రైస్తవుల మృతదేహాలందలి బ్యాక్టీరియా అది భూగర్భంలోనే జీవించి వుంటాది. అవి భూగర్భమందలి శిలలనుండి వెలువడే ధార్మిక వాయువులను స్వీకరించి కలకాలము జీవిస్తూ తమ సంతతిని అభివృద్ధి చేసికొంటూ వుంటుంది.

..... మంచి బ్యాక్టీరియాకు సంబంధించిన సమగ్ర సమాచారాన్ని అందించిన ఆంధ్రజ్యోతి వారికి అభినందనలు.





# బైబిల్ వివరించిన మానవ హృదయం

నరుల హృదయము యొక్క తలంపులలోని ఊహలన్నియు ఎల్లప్పుడు కేవలము చెడ్డదనియు యెహోవా చూచి తాను భూమీమీద నరులను చేసి నందుకు యెహోవా సంతాపమునొంది తన హృదయమందు నొచ్చుకొనెను. (ఆదికాండము 8:21) యెహోవాకు అసహ్యములైన వాటిలో...దుర్యోచనలు చేయుహృదయము ఒకటి (సామెతలు 6:16-18) యెహోవా ఫరో హృదయమును కఠినపరచెను (నిర్గమ 10:20) నేను అతని సేవకుల హృదయములను కఠిన పరచెదను (నిర్గమ 10:2).



ఇశ్రాయేలీయులు మోషే మాట చొప్పునచేసి ఐగుప్తీయుల యొద్ద నుండి వెండి నగలను, బంగారు నగలను, వస్త్రములను అడిగి తీసికొనిరి. యెహోవా యూద ప్రజల ఎడల ఐగుప్తీయులకు కటాక్షము కలుగ జేసెను. గనుక వారికి కావలసిన వాటిని ఇచ్చిరి. అట్లువారు ఐగుప్తీయులను దోచుకొనిరి (నిర్గమ 12:35-36).

హృదయ శుద్ధి గలవారు ధన్యులు వారు దేవుని చూచెదరు. (మత్తయి 5:8) యేసు వారి తలంపులను గ్రహించి మీరెందుకు మీ హృదయముల యందు దురాలోచనలు చేయుచున్నారు? (మత్తయి 9:4)

ఈ వాక్యములను బట్టి బైబిల్‌లో సృష్టికర్తగా మానవుని మంటినుండి చేశాడని చెప్పే యెహోవా వాక్కులు, యేసు ప్రబోధాలు మానవ హృదయమును గూర్చి అదిపాపపంకిల మైనదని అది నరుల సకల కార్యాలోచనలకు మూలమని సందేహానికి ఏమాత్రము తావు లేకుండ వివరించబడింది. యెహోవా తన స్వరూపమందు మానవుని చేసినట్టు చెప్పబడుచున్నందున యెహోవాకు కూడ మానవుని వంటి హృదయమే వుండి తీరాలి. ఆ ప్రకారంగానే మానవ సంతతియైన యేసుకు కూడ ఈ విధమైన గుండే వుండేదని వేరెచెప్పనవసరము లేదు. ఈ విషయాలను యావత్ క్రైస్తవ ప్రపంచం నరుడు దేవుని పోలికలోనే ఆయన అంశలోనే జన్మించాడని ప్రగాఢంగా విశ్వసిస్తారు.

నేటి ఆధునిక మానవ ప్రపంచం మానవుని సౌకర్యార్థం అనేక యంత్ర పరికరాలను, ప్రయాణ సాధనాలనను ఆవిష్కరిస్తూ ముందుకు సాగుతుంది. ఇట్టి యంత్రాల నిర్మాణ విధానంపై వాటివాటి సాంకేతిక పరిజ్ఞానాన్ని మనకు అందిస్తూయున్నారు. ఆ ప్రకారం వాటిని మనము ఉపయోగిస్తున్నాము.

అయితే ఎవడో ఆకాశరామన్న ఒక విమానాన్ని తెచ్చి దానిని తానే రూపొందించానని చెప్పుచున్నాడు. ఆ విధంగానే వేరొక డబ్బారేకుల సుబ్బారాయుడు ఒక మోటారు కారును చూపి దానిని తానే తయారు చేశానని చెప్పుకొనుచుండగా ఈ రెండు విషయాల పరిశీలనకు వాటికి సంబంధించిన నిపుణుల బృందాన్ని రావించారు. పై ఇరువురిని వారి వారి ఆవిష్కరణలకు సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించిన విషయాలను విడమరచి చెప్పమన్నారు. అయితే వారు తలాతోకలేని విధంగా తబ్బిబు సమాధానాలీయగా చూచిన నిపుణులు వారి మాటలన్నీ గాలి కబుర్లని కొట్టి పారవేసి వారు పై యంత్రాల రూపకర్తలు కానేకారని వారిని పిచ్చివారిగా నిర్ధారించారు. ఈ కథవలెనే మానవ శరీర శాస్త్రంపై ఇసుమంతైనా అవగాహనలేని అలనాటి అమాయక రచయితలు తమ అజ్ఞానాన్ని యెహొవాకు అంటగట్టి అభాసుపాలైనట్టు తేటతెల్లంగా కనబడుచున్నది. ఇట్టి అస్తవ్యస్తమైన రచనలు, పనికిమాలిన వివరణలు నేడు యావత్ క్రైస్తవ ప్రపంచాన్ని శాసిస్తున్నాయి. పరమ సత్యాలుగా చెలామణీ ఔతున్నాయి. సకల శాస్త్ర పారంగతులైన క్రైస్తవ మేధావులు సైతం తమ శాస్త్ర పరిజ్ఞానాన్ని ప్రక్కనపెట్టి తమనుతాము వంచించు కోవడమే గాక తమ తమ ప్రసంగాలతో కోట్లాదిమందిని తప్పుదారి పట్టిస్తూ వారివారి గుండెలను పిండిపారేస్తున్నారు.



మానవ హృదయాలను గూర్చి బైబిల్ వివరిస్తూ అది పాప పంకిలమైనదని, అది బాల్యం నుండి బహుచెడ్డదని వాటిని అపవిత్రమైనవి గాను అవి దురాలోచనల పుట్టలుగాను అభివర్ణిస్తూ చెబుతూ ఇట్టి అపవిత్ర హృదయాలను యేసు తాను సిలువపై కార్చిన పవిత్ర రక్తంతో కడిగి శుద్ధిచేసి, అందలి సమస్త పాపాలను ప్రక్షాళన చేసి పవిత్ర హృదయాలను అనుగ్రహిస్తాడని ఏకరువుపెడతారు. ఇది క్రైస్తవ బోధనల్లో అతిముఖ్యమైన విషయం. గుండెకు - క్రైస్తవ్యానికి యీ విధమైన దగ్గర సంబంధాలు కనబడతాయి.

పై వివరణ ప్రకారం మనము యావత్ ప్రపంచ మందలి అయిదు ఖండాలను, చిందరవందరగా చెదరియున్న సమస్త ద్వీపకల్పాలను గాలించి చూచినా ఏ క్రైస్తవ విశ్వాసిగాని కనీసం ఒక్కడంటే ఒక్కడు కూడ దొరకనే దొరకడు. సామాన్యక్రైస్తవుల సంగతి అలాగుంచి మతాధిపతులైన పోపులు గాని, ఆర్చిబిషప్పులు గాని, బిషప్పులు గాని, చర్చిపాదిరీలు గాని తదితర ప్రసంగీకుల హృదయాలు గాని, పవిత్రమైనవిగా కనబడవనేది ముమ్మాటికి నిజం. అదంతా ఎందుకు





చివరకు మానవాకృతిలో నేయున్నాడని చెప్పేయెహొవా దేవునికి గాని, మానవ సంతతియైన యేసు ప్రభునికి గాని పవిత్ర హృదయాలుంటాయని చెప్పే ఆస్కారమే లేదు. ఈ పరమసత్యాన్ని మతవాదు లెవరూ జీర్ణించుకోలేరు. ఇవన్నీ దైవ వ్యతిరేకియైన రచయిత విమర్శలని, ఇది కేవలం సాతాను పనిగా చెబుతారు.

ఒక విధంగా చెప్పాలంటే దేవుళ్లు మానవులు అనే వ్యత్యాసము లేకుండ ప్రతీ ఒక్కరి హృదయాలు 50% పవిత్రంగాను మిగతా సగము అపవిత్రంగా వుండి తీరవలసిందే ఇది నగ్నసత్యం! పాఠకులు ఈ విషయాన్ని అంగీకరించి తీరవలసిందే! నాతో మీరంతా ఏకీభవించనున్నందుకు ప్రతీ ఒక్కరికి అభినందనలు తెలియ పరుస్తున్నాను. ఈ హృదయ మనబడే గుండె చేసేపని ఏమిటి? సమస్త శరీరమందలి చెడురక్తాన్ని ఈ చిత్రంలో కనబడుచున్న "సిరలు" అనే రక్తనాళాలు సేకరించి గుండెకు చేరవేస్తాయి. గుండె ఆ రక్తాన్ని స్వీకరించి దానిని ప్రాణవాయువుతో మలినాలను వేరుపరచి శుద్ధీకరిస్తుంది. అనంతరం కనబడే ధమనులు స్వీకరించి సకల శరీరానికి పవిత్ర రక్తాన్ని సరఫరా చేస్తాయి. మానవ మనుగడకు ఇంతటి ముఖ్యమైన పనిని మానవ హృదయం నిర్వహిస్తూ "రియాక్టర్" వలె పనిచేయడం గుండె యొక్క విధి.



ఇది సర్వకాల సర్వావస్తలయందు ఒక్కక్షణమైనా విరామమెరుగక మానవప్రాణాన్ని సంరక్షిస్తూ యున్న ప్రధానావయవం మాత్రమే! ఈ గుండె కొన్ని సెకనుల పాటు పనిచేయకపోతే మనిషి మరణిస్తాడు. ఆ కారణంగా అలనాటి అనాగరిక దశలో శరీర శాస్త్రంలో అణుమాత్రమైనా అవగాహన లేని బైబిల్ రచయితలు తెలిసీ తెలియని ఆలోచనలతో గుండె ఆగిపోతే మనిషి మరణించడం చూచి గుండెకు అతీత శక్తులు అంటగట్టి ప్రచారం చేశారు. ఇవన్నీ కేవలం అపోహలే! ఇట్టి అవగాహనా లోపాలు బైబిల్‌లో చోటు చేసికొన్నాయి. ఈ విషయాలు చాలామంది క్రైస్తవ మేధావుల దృష్టికి

వచ్చినా వారు నోరు మెదపరు. మత గ్రంథం చెబుతుంది. స్వయానా యెహోవా, యేసులు పలికిన పలుకులుగా వివరించబడింది, గనుక దీనిని సజీవంగా కాపాడవలసిన బాధ్యత తమ భుజస్కందాలపై యున్న కారణంగా ఈ "బుద్ధి జీవులు" ఇట్టి వివాదాస్పద విషయాల జోలికి వెళ్లక మతంముందు మోకరించి, చెప్పింది వినడం, విన్నది విశ్వసించడం తప్ప ప్రశ్నించే ప్రయత్నమైనా చేయని వీర విధేయులు గానే కొనసాగుతూ యుంటారు. లేకుంటే అవిశ్వాసులంటారు.

ఈ కారణంగా వేలాది సంవత్సరాలుగా యెహోవా ప్రవక్తలు, న్యాయాధిపతులు, రాజులు, యాజకులు, యేసుశిష్య బృందాలు, అపోస్తలులు, అలనాటి మతాధిపతులైన పోపులు, ఆర్చిబిషప్పులు, కార్డినల్సు, పాస్టర్లు, రెవరెండ్లు, టి.వి.ప్రసంగీకులు, చిన్నాచితకా కేటకిస్టులు, మత ప్రభోధకులు మొదలైన సత్ క్రైస్తవ సమాజాలు తమ తమ రక్షణ సందేశాలందు, ప్రసంగాలందు, బహిరంగ సభల్లోను, ప్రార్ధనా కూటముల్లోను.... హృదయ శుద్దిగలవారు ధన్యులు. పరలోక రాజ్యం వారిది! హృదయ శుద్ధిలేని పాపహృదయం గలవారందరు నిశ్చయంగా నరకాగ్ని గుండంలో పడి కాలిపోతున్నా, చావు అనేదే రాదని, ఏ టెల్లకాలం బాధలను భవిస్తూ అంగలార్చు చూయుండగా మరోప్రక్క అగ్ని పురుగులు ప్రాక్కొంటూ వచ్చి కొరుక్కు తింటూ యుంటాయని అనేక అమాయక హృదయాలను కంపింపజేస్తూ, పసిడి గుండెలను పిండివేస్తూ? కాదుకాదు మానసిక హింసను చేస్తూ భయానకంగా హింసిస్తూ నేదే రక్షణ దినం! ఈ సాయంకాలం సమయంలో మీ హృదయాలను ప్రభువుకు సమర్పించి రక్షణపొంది నిత్యజీవానికి వారసులు కండని అశాస్త్రీయ ప్రసంగాలలో వేదిస్తూ యుంటారు.

ఖగోళ శాస్త్ర పితామహులు అలనాడు బైబిల్ ప్రతిపాదించిన "భూ" కేంద్ర సిద్ధాంతాన్ని పటాపంచలు చేసి సూర్యకేంద్ర సిద్ధాంతం ప్రతిపాదించి మత పునాదులను కంపింపజేశారు. కాని ఆ నిజమే నిప్పై అట్టి మహనీయులను సజీవ దహనాలు గావించినా అట్టి నిజాన్ని మాత్రం కప్పివేయ లేక పోయారు. అయితే బైబిల్ ప్రతిపాదించిన ఈ హృదయ కేంద్ర సిద్ధాంతాన్ని చాలామంది తేలికగా తీసికొని దీనిని ఎవరూ అంతగా వ్యతిరేకించినట్టు కనబడదు. అయితే ఈ రచనలో హృదయ కేంద్ర సిద్ధాంతాన్ని ఖండించడం చూచిన క్రైస్తవ హృదయాల్లో కొంత దడపుట్టవచ్చేనేమో!

ఈ గుండె సంగతులు మతగ్రంథాల వరకు ప్రాకడానికి మరికొన్ని కారణాలు కూడ లేకపోలేదు. నేటి ఆధునిక యుగాల్లో కూడ రచయితలు, కవులు, వాగ్గేయకారులు, గీతరచయితలు, వ్యాకరణ పండితులనే తేడాలేకుండ పాత ఒరవడినే కొనసాగిస్తూ... నా ప్రాణేశ్వరీ... నా హృదయాంత రాళల్లోకి తొంగిచూడు... నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో!.... "నా హృదయంలో నిదురించే చెలీ" యంటూ యుగళ గీతాలు





పాడారు. పల్లె వాసులేకాదు, మనం కూడ... "నీవన్న తూటాల్లాంటి మాటలు నాకడుపులో దాచుకున్నాను. నా గుండెల్లో పదిలపరచుకున్నాను అంటారు. ఆంజనేయుడు తన ఎదను చీల్చి తన గుండెల్లో ఏముందో చూడమంటాడు. ఇప్పుడిప్పుడే ఈ ధోరణ కొద్ది కొద్దిగా మార్పులు సంతరించుకొంటూ... "మనసా! నీవుండే చోటు చెప్పమ్మా!" అంటూ "మున్నా" సినిమ్మాలో ఒక పాటకనబడతాది.

ఈ విధమైన నమ్మకాలతో కూడిన భాషే-బైబిల్ నందుకూడ చోటు చేసికొన్నట్టు కనబడతాది. యేసు క్రీస్తు "హృదయామనెడు తలుపూనొద్దా తట్టూచూన్నాడ"నే చక్కని చిత్రంలో పాటు - శ్రావ్యమైన పాటలు పాడుతూ యుంటారు... ఇక్కడ ప్రభువు రెండువేల సంవత్సరాల నుండి కెరోస్సిన్ లాంతరుపట్టుకొని (అప్పుడు కెరోసిన్ ఎక్కడిది?) క్రొవ్వుదీపమో పట్టుకొని హృదయాలను నిర్విరామంగా తట్టుతూయున్నా వాటికి చెవులు లేనందున. అందునా హృదయ కవాటాలు క్షణమైనా తీరక లేకుండ విధినిర్వహణలో నుండగా ప్రభువు బిక్కముఖంతో వెళ్లి పోతున్నాడుకావచ్చు.

అయితే బైబిల్ దేవుళ్లు హృదయాన్ని గూర్చి భ్రమపడిన విధంగా కాక గుండె చేస్తూవస్తుందను కొన్ని పనులను హృదయము కాక మానవ మేధస్సు అనగా మెదడు (BRAIN) నిర్వహిస్తూ వస్తూంది. ఆలోచనా శక్తి జ్ఞాపకశక్తి మంచిచెడులకు సంబంధించిన ఏ విషయాన్నైనా మెదడు క్షణకాలంలో ఆలోచించి తగిన నిర్ణయాలు తీసికొని దానికి సంబంధిత అవయవాలను ఉత్తేజపరచి ఆదేశిస్తుంది. ఈ విధంగా సర్వ శరీరాన్ని ప్రతి విషయంలోను నియంత్రించి ఉత్తేజపరచేది మెదడే గాని హృదయాలు ఎంతమాత్రము కావనేది పరమసత్యం.



అందుచే యెహోవా హృదయాన్ని ఉద్దేశించి నీవుకఠినమైపో!... నీవు జాలిగుండెవైపో!!.... పాపాల పుట్టవైన అపవిత్ర హృదయమా! నీవు చేసిన సవాలక్ష పాపాలను క్షమించి పారేస్తున్నాను పో!!! అన్నంత మాత్రాన... లబ్ డబ్! - లబ్ డబ్! అంటూ తనపనేదో తాను చేసికొంటూపోతుందే తప్ప ఈ ఆదేశాలను హృదయాలు

ఎంతమాత్రము ఖాతరుచేయవు. మెదడుతో చెప్పవలసిన సంగతులను గూర్చి గుండెలను ఆదేశించడం గూర్చి కాస్త ఇంగిత జ్ఞానంలో ఆలోచించి మీ మనస్సును ప్రశ్నించి చూడండి.

ఈ సందర్భంలో ప్రియక్రైస్తవ సోదరప్రజానీకాని కొక విజ్ఞప్తి: మిత్రులారా ఇకనైనా మీరు అనునిత్యం క్రమం తప్పకుండా చేసే ప్రార్థనా విన్నపాలందు.... ప్రభువా! మీకొక క్రొత్తసంగతి విన్నవించవలసి యుంది. అనాదిగా మా తాత ముత్తాతలందరి వలెనే మేము కూడా మీ పరిశుద్ధ నామమున మిమ్మును ప్రార్థిస్తూ.... "మా పాప పంకిలమైన మా హృదయాంతరాళాలను తెరచి నీ పవిత్రమైన శిలువరక్తంతో కడిగి శుద్ధి చేసి మాకు పవిత్ర హృదయాలను దయచేయు" మని..... దేవా! కఠినాత్ముడైన నాభర్త రాతి గుండెను తొలగించి జాలిగల మాంసపు గుండెగా మార్చు" మని తండ్రీ! ఆ దుర్మార్గుడి దుష్ట హృదయాన్ని కరిగించి దయాదాక్షిణ్య పూరిత హృదయాన్ని అనుగ్రహించు" మని మిమ్మును అనేక శతాబ్దాలుగా శోధిస్తూ అర్థరహితమైన పనికి మాలిన ప్రార్థనలు చేస్తూ అనవసరంగా మోకాళ్ల నొప్పులు తెచ్చుకొంటూ వచ్చాము. అయ్యో! దేవా! నిప్పులాంటి నిజం మాకిప్పుడే నెల్సన్ రఫ్డీ ద్వారా తెలిసింది. మీరు మార్చవలసింది, శుద్ధిచేయవలసింది, నీరక్తాన్ని ప్రోక్షించవలసింది మా గుండె కాయలను కాదట! ఇట్టి దురాలోచనలకు, దుష్టకార్య నిర్వహణకు, సన్మార్గాలకు మూలం మానవ మస్తిష్కమని తెలిసినప్పటి నుండి మాకు గుండెదడ పట్టుకొంది. ఇంతవరకు మేము చేసిన ప్రార్థనలన్నీ బూడిదలో పోసిన పన్నీరులా అయిపోయాయని చింతిస్తూ! ఏసు నామము పేరట వేడుకొనుచున్నాము తండ్రి! యంటూ యెహోవాతో చెప్పండి! ఈ విషయము యెహోవాకు గాని, యేసు ప్రభునికి గాని ఏమాత్రము తెలియని ఈ విజ్ఞాన శాస్త్ర సముపార్జన కోసం మానవ శరీర శాస్త్రాన్ని పఠించుటకు ప్రయత్నించవలసిందిగా ప్రియసోదర క్రైస్తవ సంఘాలను సవినయంగా హెచ్చరిస్తున్నాను.



దీనినే స్వేచ్ఛాలోచన (FREE THINKING) అంటారు. ఇది అశాస్త్రీ ఆలోచనా విధానాన్ని ఖండిస్తూ శాస్త్రీయ దృక్పథంతో విహంగలా విహరిస్తూ ముందుకు సాగుతుంది. చెవులు గలవాడు వినును గాక! మనసున్న వాడు గ్రహించును గాక!

ఆఖరుగా శాస్త్ర పరిజ్ఞానం మరింత ముందడుగు వేస్తూయుండగా లండన్‌లో ఏకంగా "ప్లేస్టిక్ గుండె"ను అమర్చిన తాజావార్తను ఇక్కడ పొందుపరస్తున్నాను. ఇది పవిత్రమైన ప్లేస్టిక్ గుండెకాయ. దీనికి పాపాలేమీ అంటుకోవు. ఈ గ్రీన్ "మాథ్యూ" గారు తాను గతంలో





చేసిన పాపాలేమయినా వుంటే ఆ రికార్డు ఇకదొరకదు కావచ్చు! ఆయన పాత గుండెను పారవేయగా ఏకుక్కలో తినివేసి వుంటాయి. బైబిల్‌లో చెప్పబడిన హృదయ శుద్ధికథనాలన్నీ ఆశాస్త్రీయమైనవే! ప్రియ క్రైస్తవ సోదరుల్లారా! ఈ హృదయం కథనం విన్నాక అనవసరంగా గుండెలు బాదుకోవద్దని మనవి. ఇక మిస్టర్ గ్రీన్ మాథ్యూ దొర ఎవ్వర్ గ్రీన్‌గా జీవిస్తాడు కావచ్చు.

# కృత్రిమగుండెతో పునర్జన్మ

లండన్

గుండెజబ్బుతో బాధపడుతూ మరణం అంచుల్లో ఉన్న ఒక వ్యక్తికి కృత్రిమగుండెతో కొత్త జీవితాన్ని ఇచ్చారు బ్రిటన్ వైద్యులు. తమదేశంలోనే తొలిసారిగా ప్లాస్టిక్ కృత్రిమగుండెను విజయవంతంగా అమర్చి సంచలనం సృష్టించారు. పాప్‌వర్త్ ఆసుపత్రికి చెందిన వైద్యుల బృందం 40 ఏళ్ల గ్రీన్‌మాథ్యూపై ఆరుగంటలపాటు శస్త్రచికిత్స జరిపి కృత్రిమ గుండెను అమర్చింది. ఈ ప్లాస్టిక్ గుండె 9.5 లీటర్ల రక్తాన్ని సరఫరా చేసే సామర్థ్యాన్ని కలిగి ఉంటుంది. గుండెపోటు వంటి సమస్యలు దీనికి ఉండవు. కాకపోతే ఇది పని చేయటానికి అవసరమైన శక్తిని (బ్యాటరీని) నిరంతరం అందిస్తూ ఉండాలి. దీనికోసం వెంట ఒక చిన్నబ్యాగును మోస్తూ ఉండాలి. గ్రీన్‌మాథ్యూ 'ఆర్రిత్‌మోజెనిక్ రైట్ వెంట్రిక్యులర్ కార్డియోమయోపతీ' అనే జబ్బుతో బాధపడుతుండే వారు. గుండె కండరాలకు సంబంధించిన ఈ వ్యాధి వల్ల ఏ క్షణమైనా గుండె నిలిచిపోయి ప్రాణాలు పోయే ప్రమాదం పొంచి ఉంటుంది. మాథ్యూ పరిస్థితి రోజురోజుకూ క్షీణిస్తోంది. హృదయంలోని రెండు విభాగాలూ పాడైపోయాయి. ఎవరిదైనా గుండె లభించేవరకూ వేచి

14 హైదరాబాద్ బుధవారం ఆగస్టు 3, 2011



కృత్రిమ ప్లాస్టిక్‌గుండె : భార్య, కుమారుడితో గ్రీన్‌మాథ్యూ

## బ్రిటన్‌లో అరుదైన శస్త్రచికిత్స

చూసే పరిస్థితి కూడా లేదు. ఈ నేపథ్యంలో కృత్రిమగుండెను అమర్చాలని నిర్ణయించాం' అని క్రైవెన్ చెప్పారు. ఆపరేషన్ బాగా జరిగిందని, మాథ్యూ ఇంటికి వెళ్లి సాధారణ జీవితం గడపవచ్చని పేర్కొన్నారు. గుండెజబ్బు మొదలైనప్పటి నుంచీ నాలుగు అడుగులు వేయాలన్నా కష్టంగా ఉండేదని, ఇప్పుడు ఇంటికి వెళ్లి ఇంతముందులాగా గార్డెనింగ్ వంటి పనులు చేస్తానని మాథ్యూ సంతోషంగా తెలిపారు.

# యావత్ ప్రపంచం - మానమనుగడ సకలజీవజాలం ఆరేడువేల ఏళ్ల క్రితమే సృజించబడిందా?

అలనాటి ప్రపంచంలో మానవ మనుగడ సజావుగా సాగాలంటే, వారు భయభక్తులతో చెప్పుచేతల్లో అదుపాజ్ఞలలో జీవించాలంటే ఏదోఒక అతీతశక్తి అజమాయిషీ అవసరమని కొందరు కుహనా మేధావులు భావించారు. ఈ నేపథ్యంలో వారంతా ఒక మాస్టర్ ప్లాన్ వేశారు. అరాచకం...అలజడి...దోపిడీ... హింసా ప్రపంచాన్ని అదుపాజ్ఞలలో వుంచడానికి దేవుళ్లు, దయ్యాలు, రాక్షసులను రంగప్రవేశం చేయించారు. ఇట్టివారు అర్జంటుగా "కలలు" కనేశారు. ఆ "కల"ల్లో వీరితో దేవుళ్లు మాట్లాడేశాడట! ఇట్టివారు వంతుల వారీగా ప్రక్తలుగాను, మహాపురుషులు గాను అవతారాలైత్తేశారు. కాలక్రమంలో ఆదేవుళ్ల దేవదూతా గణాలు, ఆదేవుళ్లపైనే తిరుగుబాటు యత్నాలు చేశారు. ఇరుప్రక్షాల మధ్యప్రచ్ఛన్న యుద్ధాలు జరిగాయి. ఒకరి కొకరు పోటీగా తయారైయ్యారు.

ఈ ప్రవక్తలు దేవుళ్లను అడ్డంపెట్టుకొని ప్రత్యక్ష పాలన ప్రారంభించారు. దేవుళ్లు ప్రవక్తల మధ్యవర్తిత్వంలో న్యాయాధిపతులను, రాజులను, చక్రవర్తులను నియమించడాలు, బర్తరఫ్‌లు చేయడాలు యధేచ్ఛగా సాగిపోయాయి. ఆ ప్రవక్త గారిని వెంటనే దేవుడు పర్వతం పైకి ఎక్కిరమ్మని ఆదేశించాడట. ఆ పర్వతం మీద దేవుడు పది బండరాళ్లు తీసికొని పది ఆజ్ఞలుగా రాళ్లపై చెక్కి ప్రవర్తనా నియమావళిని ప్రజలకు అందించడం జరిగిందట. పనిలో పనిగా పుణ్యాత్ములకు భోగలాలసమైన ఆకలిదప్పులులేని పరలోక స్వర్గము, పాపాత్ములను శిక్షించుటకు నిత్యనరకాగ్నిగుండం తయారుచేయించారు. ఇట్టి ఆశలు, భయాలు కల్పించి ప్రజలను అదుపులో వుంచ ప్రయత్నించారు.

ఇక్కడ ఈ దేవుళ్ల చరిత్రలో మనము మరిముఖ్యంగా చెప్పుకోవలసిన ప్రత్యేకత మరియొకట్టుంది. మానవులకు కులగోత్రాలు, బందుత్వాలు అంటే చానాఇష్టం. అందుచే తాము ఎంచుకున్న దేవుడ్ని కూడ తమ కుల గోత్రాలకు చెందిన వాడినే నియమించుకొన్నారు. తన స్వజనులంటూ వారి కొమ్ముకాస్తూ యూదేతర జాతులపై యుద్ధం ప్రకటించి ఆ దేవుడుగారే స్వయంగా యద్ధాల్లో పాల్గొంటూ స్వజాతీయుల పక్షాన పోరాడుతూ వుండేవాడు. ఒకోసారి ఇంతపెద్ద దేవుడిని నేనుండగా నన్నుకాదని మీరు అన్యజాతుల దేవుళ్లను మ్రొక్కుతారా? యని తాటరేగ గొడుతూ యుండేవాడు. ఇది యూద దేవుడైన యెహోవా ఆవిర్భావానికి సంక్షిప్త చరిత్ర!

అయితే అలనాటి అంధకార యుగాల్లో అంతటి సన్నిహితంగా వుంటూ తన ప్రజలను పాలించిన దేవుడు (ఈ ఒక్క దేవుడేకాదు మిగతా దేవుళ్లందరూ) నేటి నాగరిక యుగాల్లో





"మిడియా" విలయ తాండవం చేస్తున్న ఈ ఆధునిక కాలంలో అడ్రసు లేకుండా పోయారు. అయినప్పటికి యావత్ ప్రజానీకం ఈ దేవుళ్ల జాడకాని నీడగాని కానరాకున్నా మౌత్ పీసులు – రిసీవర్లులేక పోయినప్పటికి మన క్రైస్తవ సోదరులు మాత్రం వారితో గంటల తరబడి సంభాషిస్తూ ఎడతెగని ప్రార్థనలు చేస్తూనేవున్నారు. ఇన్ని రకాల ప్రపంచ భాషలు ఈ దేవుళ్లకు ఎలా అర్థమౌతాయో ఎవరికీ తెలియదు.

ఇప్పుడు మనము చర్చించనున్న చర్చాంశము విశాలవిశ్వం, సమస్త జగత్ "సృష్టి" కేవలము ఆరేడు వేల సంవత్సరాల కాలంలోనే ఉనికిలోనికి వచ్చిందా! బైబిల్ ప్రకారముగా పై విధంగానే సమస్త జగత్తు, సూర్య, చంద్ర, నక్షత్రాదులు వగయరాల నన్నింటిని ఆదేవుడే సృష్టించాడని చెప్పుకున్నారు. ఒక కుర్చీ వున్నదంటే దానిని తయారు చేసిన "కార్పెంటర్" ఒకడు వుండి తీరాలి కదా! ఆ విధంగానే భూమ్యాకాశాలు, సూర్యచంద్ర నక్షత్రాదులు, గాలి, నీరు, నిప్పు సమస్తాన్ని ఆదేవుడే సృజించాడని చెప్పబడింది. కాని ఆదేవుడనే వాడిని ఎవడు సృష్టించాడనే ప్రశ్నను పూరించడము వాళ్లవల్ల కాలేదు. అందుచే ఆయన ఎప్పుడూ వున్నాడని మొండివాదన చేశారు.

అయితే ఈ దేవుళ్ల ఆవిర్భావం, ఆయామతాల వునికి ఎప్పటి నుండి ప్రారంభమయ్యిందో వీటి పుట్టు పూర్వోత్తరాల్లోకి కాస్త వెళ్లి చూద్దాము.

యూదమతము ప్రారంభమై 6000....6500 సంవత్సరాలకు పైగా అయ్యింది. అనంతరం కొన్నివందల సంవత్సరాలకు సంపూర్ణత సంతరించుకొంది. హిందూమతము అయిదారు వేల సంవత్సరాల క్రితం ఆవిర్భావం చెందింది. ఈ మతానికి మూలాధారాలైన ఉపనిశత్తులు 2,800 సంవత్సరాలకు పూర్వం రచించబడ్డాయి. బౌద్ధమతం – జైనమతము 2,500 సంవత్సరాల క్రితము ఉనికిలోనికి వచ్చాయి. అయితే మన ఇండియాలో బౌద్ధమతం ఇంచుమించు హిందూమతంలో కలిపివేయబడింది. అలాగే జోరాష్ట్రియన్ (ZORASTRIAN) మతం కూడ 3,500 సంవత్సరాల క్రితమే అంకురించినా అది కాలక్రమంలో కనుమరుగయ్యే స్థితికి చేరుకొంది. అటులనే క్రైస్తవ మతం రెండువేల సంవత్సరాల క్రితమే ఉనికిలోనికి వచ్చి అనంతరం అది ఆరువేల సంవత్సరాల చరిత్రగల యూతమత దేవుడైన యెహోవాకు, యేసుకు లంకెపెట్టి, యూదమత గ్రంథ ప్రవక్తల చరిత్రను క్రైస్తవం తనలో విలీనంచేసికొంది. ఈ రీతిగానే యూదమత మూలాల నుండే కేవలము 1500 సంవత్సరాల క్రితమే మరో ప్రముఖ మతమైన ఇస్లామ్ ఆవిర్భవించింది. గురునానక్ స్థాపించిన సిక్కుమతము అయిదారు వందల సంవత్సరాల క్రితమే పుట్టుకొచ్చింది. ఇట్టి నేపథ్యంలో ముక్కోటి దేవతలు తనవారేనని చెప్పుకొనే హిందూమతము తమకున్న దేవీదేవతలకు తోడు స్వాములు, భగవాన్లు, అమ్మలు, మాతలు, బాబాలను కూడ తన అక్కున చేర్చుకొని అత్యధిక దేవుళ్లుగల మతంగా కొనసాగుతుంది.

ఇప్పటి మన చర్చాంశమైన బైబిల్ సృష్టికార్య సమయంపై అమెరికా వంటి క్రైస్తవ దేశంపైకి నమ్ముచున్నట్టు కనబడుచున్నా అధిక సంఖ్యాకులైన అంతరిక్ష శాస్త్రప్రముఖులు, ఆదేశ ప్రసిడెట్లు మొదలుకొని రాజకీయ వేత్తలకు సైతం లోలోన అనుమానాలు ఈ విషయంలో పొడసూపుతునే ఉన్నట్టు నమ్మవలసి వస్తుంది. అందుచేతనే మనకు సుదీర తీరాల్లో వున్న చంద్రమండలం మీదికినాడు, నేడు అంగారక గ్రహమీదికి జీవాన్వేషణ కొరకు శకటాన్ని పంపడము జరిగింది. మనకు 57 కోట్ల కిలోమీటర్ల సుదీర తీరాల్లోనున్న అంగారకునిపైకి సుమారు సంవత్సరకాలం పయనించి చేరడం సామాన్యమైన విషయంకాదు. ఈ క్యూరియాసిటీని గూర్చిన సమాచారం చూడండి.


భూమి రాయబారిని! అంగారకుడి అతిథిని!!!

అమెరికా ఈ విధమైన అన్వేషణలతో తీవ్రప్రయత్నాలు చేస్తూయుంది. వేలాదిమంది శాస్త్రవేత్తల ఆధ్వర్యంలో వందలాది కోట్లడాలర్లను ఖర్చు చేస్తూ మరే ఇతర గ్రహాల్లోనయినా జీవం వుండియుండక పోతాదాయని సర్వ విధాల ప్రయత్నిస్తూనే ఉంది. అయితే గ్రహాంతరవాసులు వున్నారోలేదో చెప్పడానికి నేటి వైజ్ఞానిక సమాచారం ప్రకారము కచ్చితమైన ఆధారాలేమి లేవు. అయినప్పటికి భూమిమీద ఉన్న వాతావరణ పరిస్థితులు, పరిణామం, మరెక్కడైనా సంభవించి ఉంటే అట్టి గ్రహాల మీద జీవం ఆవిర్భావం చెందే అవకాశాలు లేకపోలేదు. అలా జరిగివుంటే అట్టి జీవులు కాలక్రమంలో పరిణామం చెందే అవకాశాలుంటాయి.

మనకు సమీపంలో నున్న "కుజగ్రహం" మనకు 20 కోట్ల కిలోమీటర్ల దూరంలో వుంది. నేడు క్యూరియాసిటీ రోవర్‌ను పంపిన అంగారక గ్రహం మనకు 57 కోట్ల







కిలోమీటర్ల దూరంలో వుండగా "రోవర్" దానిని చేరుటకు సుమారు ఒక సంవత్సరం పట్టింది. దీనికే ఇంతకాలం పడితే మనకు అనేక కాంతి సంవత్సరాల దూరతీరాలలో వున్న సౌరమండల మందలి గ్రహాలను చేరుకోవడానికే కొన్ని వందల ఏళ్లు పడుతుంది. ఆయా గ్రహాల్లో ఎవరైనా గ్రహాంతరవాసులున్నా వారు మనంత వైజ్ఞానికులో కాదో తెలియదు. మనకన్నావారే విజ్ఞానులైతే వారైనా భూమికి దిగవచ్చును. ఏది ఏమైనా అధ్యతన భావిలో ఏదో ఒకనాడు అంతరిక్షంలో గ్రహాంతరవాసుల ఉనికి బయల్పడుట తథ్యం. మరో వంద సంవత్సరాలకో లేక వేయి సంవత్సరాలకో అట్టి సంచలనాత్మక సమాచారం మానవాళికి చేరగల దనుటలో ఎటువంటి సందేహములేదు. అదే నిజంగా జరిగితే ఈ మాయా మతగ్రంథాల దేవుళ్ల కథనాలన్నీ పటాపంచలైపోతాయి. ఒకవేళ్ల ఈ మానవులు ఆయా దేవుళ్లనుకూడా అట్టి గ్రహాలకు "ఎక్స్‌ఫోర్ట్" చేసినా ఆశ్చర్యపోవలసిన పనిలేదు.



"సృష్టి"ని గూర్చి బైబిల్ వివరిస్తూ ఒక చేతిమీద లెక్కించే వేల సంవత్సరాలని నమ్మిస్తూ వుండగా సైన్సు - విజ్ఞాన శాస్త్రం. పురాతత్వ పరిశోధనలు ఏమంటున్నాయో ఒక్కసారి మీ నేత్రద్వయాన్ని విప్పిమరి చూడండి... భూమిమీద మానవ స్వరూపం ఏర్పడి పదిలక్షల సంవత్సరాలైయ్యింది. మానవుడు అగ్నిని రాజేయడం తెలుసుకొని యాభైవేల ఏళ్లయ్యింది. నరుడు నాగలిపట్టి పదివేల సంవత్సరాలైయ్యింది. కాని బైబిల్ లో మాత్రం



ఇవన్నీ కేవలం ఆరేడు వేల ఏళ్ల క్రితమే ప్రారంభమైయ్యాయి. అంతకుముందు నరుడు మృగప్రాయంగా జీవించాడు. ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ చలికి బిగుసుకు పోతూకొండగుహల్లోను. మహారణ్యాలందు, చెట్టుతొర్రల్లోను దుర్భర జీవితం జీవించాడు. క్రూర మృగాలతో సహజీవనం చేశాడు.

విషసర్పాలు కొండ చిలువల భారిన పడ్డాడు మనుగడ కోసం అనేక జాతులతో పోరాటాలు సాగించాడు. నదీపరీవాహక ప్రాంతాల్లో సంచరించాడు. పచ్చిమాంసం తింటూ వచ్చాడు. దావానలంలో కాలిన జంతువుల మాంసం రుచిమరిగి, కాలక్రమంలో చెకుముకి



రాళ్లతో అగ్నిని రాజేయడం తెలుసుకొని కాల్చిన, ఉడికించిన ఆహారంతో పాటు కందమూలాదులను, ఆకులలమలను తింటూ మనుగడ సాగించారు. ఇలా వేల సంవత్సరాలు, లక్షల సంవత్సరాలు గతించిపోయాయి. కాలక్రమంలో జంతువులను మచ్చిక చేయడం, వాటిపై స్వారీ చేయడము, అనంతరము బండిచక్రం కనుగొని ఎద్దులబండ్ల వంటివి చేసికొన్నాడు. మెలమెల్లగా రాతియుగం... లోహయుగం దాటు కొంటూ వ్యవసాయంలో అభివృద్ధి సాదించడం జరిగింది. కాలక్రమంలో స్థిరనివాసాలు ఏర్పరచుకోవడం ఆరంభమైయ్యింది.



బైబిల్‌లో రాతియుగం జాడలు మచ్చుకైనా కానరావు. ఈ సృష్టి కార్యం అబద్ధమని చెప్పుటకు ఈ ఒక్క ఉదాహరణ చాలు. ఆరువేల సంవత్సరాల క్రితము యెహోవా భూమ్యాకాశాలను, ఆదాము హవ్వలను సృజించాడని చెప్పేనాటికే, మన అఖండ భారత దేశంలో అద్భుతమైన మానవ నాగరికత ‘‘హరప్పా-మహెంజోదారో’’ ప్రాంతంల్లో విలసిల్లుతూ యుందని పురాతత్వ త్రవ్వకాలందు బయల్పడ్డాయి. ఆ ప్రాంతము ఇప్పుడు పాకిస్తాన్‌లో వుంది. అప్పుడు మనమెవ్వరము లేము. కాని భూమ్మిద మానవ జాతులు కొద్దోగొప్పో నాగరికత వైపుకు పయనించన ఆరంభించాయి. లక్షలాది సంవత్సరాల పరిణామ క్రమంలోని మానవ చరిత్రను బైబిల్ కేవలం ఏడు దినాల్లో రూపొందించబడినట్టును, విశాలవిశ్వం, సమస్త ప్రకృతి, సకల జీవరాసులు భూమి మీద మనుగడ సాగించడం ప్రారంభమై ఆరేడు వేల సంవత్సరాలే అయ్యిందని విశధీకరిస్తుంది.

అయితే కోట్లాది సంవత్సరాల పరిణామ క్రమంలో ఏర్పడిన విశాలవిశ్వాన్ని గూర్చి సమస్త మతగ్రంథాలు ఊహాజనితమైన రీతిలో తలోరకంగా వివరించాయి. అవన్నీ శాస్త్రీయ దృక్పథంతో కాక కాల్పనిక జగత్తును సృష్టించాయి. వారి కట్టుకథలకు అండగా దైవాన్ని ప్రతిపాదించి అసత్యాలను సత్యాలుగా చూప ప్రయత్నించాయి. అన్ని మతాలందు ఎందరో మేధావులు, సైంటిస్టులు, వైజ్ఞానిక శాస్త్ర వేత్తలు, అంతరిక్ష పరిశోధకులు, సాఫ్ట్‌వేర్... తదితర ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు, రాజకీయ నాయకులు దేశాధినేతలు, మరింకెందరో బుద్ధిజీవులు ప్రపంచమంతటా ఎంతోమంది మహానుభావులున్నారు. వీరెవ్వరికి మతాలపై ఏ విధమైన సందేహాలు రావనడం సబబుకాదు వస్తూనే వుంటాయి. కాని వీరికి కావలసింది





అధిక సంఖ్యలోనున్న మతవాదుల అండ. మాతాన్నికాదంటే వీళ్ల “ప్రేక్టీసు”లు నడవవు, మరి ముఖ్యంగా వీరికి ఓట్లుపడవు. వీరికి కావలసింది అధికారము కదా! అందుచే వీరంతా సైన్సును నమ్మినా అది యీలోకంలో నాలుగుకాలాల పాటు హాయిగా బ్రతకడానికే వాడుకుంటారు. మతాలకు మాత్రం మోకరిల్లకుండా ఉండలేరు. “నలుగురితో పాటు నారాయణ కులంతో పాటు గోవిందా” అనే అవకాశవాదులే!



శాస్త్ర మేమంటుందో మళ్లీ చూడండి భూమ్యాకాశాలు, సూర్యచంద్ర నక్షత్రాదులు సమస్త విశ్వాంత రాళాలతో పాటు భూమిమీద జీవం ఏర్పడి కోటాను కోట్ల సంవత్సరాలైయ్యిందని, అంచెలంచెలుగా ఫృద్విపై మానవ స్వరూపం ఏర్పడి పదిలక్షల సంవత్సరాలైయ్యిందని చెప్పుచుండగా బైబిల్ మాత్రం ఆదిమానవులు భూమిమీద పట్టుమని పదిమంది కూడ లేనప్పుడే వ్యవసాయం చేయడం, గొర్రెల పెంపకం జంతువులను మచ్చిక చేయడము, అనతికాలములోనే గనులు త్రవ్వడం లోహాలు వెలికి తీయడము, బంగారు ఆభరణాలు ధరించడము, సంగీత వాయిద్యాలు తయారు చేయడంలో నైపుణ్యం సంపాదించి నట్టు చెప్పబడింది పైన చెప్పబడిన ఈ విషయాలు కేవలము కల్పితాలు మాత్రమే.

అది 1975వ సంవత్సరం. అప్పుడు నేను ఆదిలాబాద్ జిల్లా బెల్లంపల్లిలో వున్నాను. 1955 - 1965 ప్రాంతాల్లో బెల్లంపల్లికి సుమారు 30 - 40 కి॥మీ॥ దూరంలో వున్న వేమన పల్లి అటవీ ప్రాంతంలో పశ్చిమబెంగాల్ (కలకత్తాకు) చెందిన పురాతత్వ శాఖవారు జరిపిన త్రవ్వకాలలో సరీసృపాల (రాక్షస బల్లులు)కు చెందిన ఆకృతులు శిలాజాల రూపంలో లభ్యమయ్యాయట. అనంతరం కార్బన్ టెస్ట్ ద్వారా వాటి కాలాన్ని విశ్లేషించగా అవి నలువది లక్షల సంవత్సరాలకు పూర్వం ఈ ప్రాంతంలో జీవించిన రాక్షస బల్లుల కాలాన్ని వివరించడము జరిగింది.



పై శిలాజాలు లభించిన వేమనపల్లికి సమీప గ్రామాన్ని నేను సందర్శించగా ఆ రాంపూర్ వాగు కోతకు గురియై ఒక మహావృక్ష శిలాజం బయటపడి వుండుట నేను గమనించాను. అది శిలాకృతిలోనికి మారిపోయింది. వెంటనే దాని చిన్న కొమ్మను విరుగగొట్టి ఈ శిలాజాన్ని సేకరించడము జరిగింది. ఈ కొమ్మముక్క బరువు పది కిలోలపైగా వుంది. ఈ వృక్షం కూడ అలనాడు రాక్షస బల్లులు జీవించిన నలువది లక్షల ఏళ్లనాటి వృక్షమే కావచ్చును. ఈ వృక్ష శిలాజాన్ని పరికించి చూడగా

చెట్టు మ్రానుకు కనబడే చారలు తేటగా కనబడుచున్నవి.

ఆ విధంగానే నాటి త్రవ్వకాలలో పనిచేసిన "రామ్‌లా" అనే లంబాడీ కార్మికుడు ఇచ్చిన రాక్షసబల్లి కాలి వ్రేలు యొక్క శిలాజాన్ని కూడ భద్రపరచడం జరిగింది.

ఇక్కడ చూపబడిన "పక్షి శిలాజ చిత్రం" 22 కోట్ల సంవత్సరాల నాడు జీవించినదిగా చెప్ప బడుతుంది. అలనాటి పక్షి ఎముకలు "శిలాజం"గా మారిపోగా వాటిని క్రమపద్ధతిలో పేర్చిపక్షి రూపాన్ని తీర్చిదిద్దారు. గతంలో 55 సంవత్సరాల క్రితము రష్యాలో మంచు పర్వతాల్లో కప్పబడిన రక్తమాంసాలు గల ఏనుగు కళేబరం లభించినట్టు వార్తలు వచ్చాయి. అదికోటి సంవత్సరాల క్రితము జీవించిదని నిర్ధారించారు. ఇట్టి నిర్ధారణ "కార్బన్ టెస్ట్" అనే ప్రక్రియ ద్వారా ఖచ్చితంగా చెప్పబడుతుంది. ఇట్టి ఆశ్చర్యకర విషయాలను మనము మరింత తేలికగా అవగాహన


22కోట్ల సంవత్సరాలనాటి పక్షి

చేసి కొనుటకు మరిన్ని భూగర్భ నిక్షేపాలను గూర్చి మరింతగా పరిశీలించవలసిన అవసరముంది. ఏది ఏమయినా ఈ నోరులేని శిలాజాలు బైబిల్ సృష్టికార్యం అబద్ధమని రుజువు చేస్తున్నాయి.

కోటాను కోట్ల సంవత్సరాలకు పూర్వం భూమండలం పై సంభవించిన భూకంపాల కారణంగా అరణ్యాలకు అరణ్యాలే భూగర్భంలోనికి దిగబడి పోయాయి. అసలు భూమిమీద మానవ మనుగడ లేనప్పుడే అనాది నుండి భూకంపాలు సంభవిస్తూనే వున్నాయి. మన ఆయుర్ధాయం స్వల్పమైన దైనందున గతచరిత్ర మనకు తెలియదు. మా ప్రాంతం భూకంపాలు సంభవించే "బెల్ట్"లో లేదని మన ఆంధ్రప్రదేశ్ నందలి సింగరేణి బొగ్గుగనుల ప్రాంతవాసులు తలంచవచ్చు అది తప్పు. ఈ ప్రాంతం బహుషా కోట్లాది సంవత్సరాల క్రితమే భయంకర భూకంపాలు వచ్చి అతలాకుతలమైన ప్రాంతమే. ఆకారణంగానే అక్కడ మనకు రాక్షసి బొగ్గులభిస్తుంది.







పై విధంగా అంతులేని అరణ్యాలు అందలి మహావృక్షాలు భూగర్భంలోకి చేరి లెక్కలేనన్ని సంవత్సరాలు అనేక (CHEMICAL CHANGES) రసాయనిక మార్పులకులోనై రాక్షసి బొగ్గుగా రూపాంతరం చెందింది. నేడు ఈ బొగ్గుతోనే విద్యుదుత్పత్తి జరుగుచున్న విషయం మనందరికి తెలుసును.



ఈ విధంగానే భూగర్భమందలి అనేక పదార్థాలు మన ఊహలకందని కాలం నుండి అనూహ్యమైన మార్పులు చెంది మానవాళికి ఈ బొగ్గుతో పాటు ఇనుము, ఉక్కు, ఇత్తడి, రాగి, కంచు, వెండి, బంగారము మొదలైన లోహసంపద, అభ్రకము, ప్లూటోనియం, యురేనియం, బాక్సైట్, రేడియం, గంధకము తదితర పదార్థాలు, సున్నపురాయి. మార్బుల్ స్టోన్ తదితర అమూల్య పదార్థాలు మనకు లభిస్తున్నాయి. నేడు ప్రపంచ స్థితి గతులనే మార్చివేసిన భారతైలాలు: పెట్రోలు, డీసిల్, క్రూడాయిల్, కిరోసిన్ లభిస్తున్నాయి. మరింత ఆశ్చర్యకరమైన విధంగా మహాసముద్రాల గర్భం నుండి మనకు ఇంధన వాయువులు (L.P.G GAS) లభిస్తూ మన జీవన విధానాన్నే మార్చివేయడము జరిగింది. పై చిత్రంలో "గేస్" - పైప్ లైన్లను మనము చూడవచ్చును.

నేటి యువతరానికి 60 - 70 సంవత్సరాల క్రితము కట్టెలపొయ్యిలు ఊదలేక సతమతమైన మన తాత ముత్తాతమ్మల పొగసూరి బ్రతుకు సంగతి ఏ మాత్రము తెలియదు. నేటి మన స్వల్పజీవిత కాలంలోనే ఎన్నెన్ని మార్పులు జరిగాయో చూడండి. నేను పడవ ప్రయాణాలు, "లాంచి" విహారాలు చేశాను. ఎండ్లబండ్ల మీద రెడ్డి సీమ ప్రాంతానికి వెళ్లాను. అలాగే పొగబండ్ల మీద పయనిస్తూ కంట్లో పడ్డ బొగ్గు నలుసులను నలుపుకొంటూ వెళ్లాను. మరీ చిత్రమైన రీతిలో కర్రబొగ్గుతోనడిచే బాయిలర్ బస్‌ల మీద నిడదవోలు నుండి నరసాపురం తిరిగాను. చెన్నపట్నంలో ట్రాముల మీద ఎక్కాను. ఇటీవల ప్రపథమంగా ఢిల్లీకి విమాన ప్రయాణాలు చేశాను.

నేటి మన పెద్దలు, మరి ముఖ్యంగా యవతరం కెమిస్ట్రీ, ఫిజిక్సు, వృక్షశాస్త్రం, బయోలజీ, వైద్య విజ్ఞానం, సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్, కంప్యూటర్ సైన్స్ వంటి చదువులతో మరింత విజ్ఞానులుగా రూపొందుచున్నారు. ఇప్పటి వరకు మనము చర్చించిన విషయాలు వీరికందరికి చాలా బాగా తెలుసు. మనకన్నా ముందుకు దూసుకొని వెళ్తున్న నేటి వైజ్ఞానిక ప్రపంచం మరింత ముందడుగు వేస్తుంది. సౌర విద్యుత్తుతో పాటు మరెన్నో నూతనా విష్కరణలను రూపొందించి మానవ వికాసానికి పాటు పడుచున్నారు. ఇట్టి శాస్త్ర విజ్ఞానం మనకు ఆకాశాన్నుండి ఊడి పడలేదు. ఏ దేవుడు ప్రత్యక్షమై ఏ "ఐన్

స్టీన్"కు చెప్పిన పాపానపోలేదు.

ఈ విధంగా కోటానుకోట్ల సంవత్సరాల క్రితము ఆవిర్భావము చెందిన భూమ్యాకాశాలు, సకల సముద్రాలు, సౌర మండలం మందలి సూర్యచంద్ర నక్షత్రాదులు, తదితర సుదూర గ్రహాలు ఏర్పడి లక్షల కోట్ల సంవత్సరాలైయ్యిందని అందరికి తెలుసు. కానీ ఈ విషయాలన్నీ తాము చదివిన చదువులకే పరిమితం చేస్తారు. ఆ చదువులు కేవలం ఉద్యోగాల కొరకే! అయితే వీరంతా మత గ్రంథాల కాడకు వచ్చేసరికి వీరికి పై విషయాలేమి గుర్తుకు రావు. క్రైస్తవేతరులైన హిందువులు సూర్యచంద్ర నక్షత్రాదులను దేవతలని పూజిస్తారు. క్రైస్తవులు బైబిల్ దగ్గర మోకరించేసరికి యావత్ విశాల విశ్వం, భూమండలం మందలి వృక్ష సంపద, సప్త సముద్రాలు, యావత్ జీవరాశితో పాటు నరమానవులంతా కేవలము ఆ రేడువేల సంవత్సరాల క్రితమే యెహోవాచే ఆరంటే ఆరుదినాలలో సృష్టించబడ్డాయని నమ్ముతూ తాము చదివిన విజ్ఞాన శాస్త్రాన్ని గాలికి వదలి బైబిల్ ముందు మోకరిల్లతారు.



నేటి యావత్ ప్రపంచమందు సుపీరియర్ బుద్ధి జీవులుగా చెలామణీ అవుతున్న పాశ్చత్యదేశాల సైంటిస్టుల్లో చాలామంది పైన చెప్పిన విధంగానే మతం దగ్గరకు వచ్చేసరికి "సీను" మారిపోతుంది. ప్రప్రథమంగా చంద్రమండలం పై కాలుమోపిన "నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్" చంద్రునిపై మోకరించి యెహోవాను స్తుతించాడట. ఇటీ వలనే ఆయన మరణించాడు. ఈ విధంగానే మన అంతరిక్ష శాస్త్రవేత్తల తీరు తెన్నులు కూడ అలాగేవున్నాయి. గతంలో అంత రిక్షపరిశోధనా కేంద్రం "ఇస్రో" అధ్యక్షులైన రాజారామన్నల నుండి నేటి అధ్యక్షుల వరకు అంతరిక్ష నౌకలను విజయవంతంగా ప్రయోగించి వెనువెంటనే తిరుపతి వచ్చి గుళ్లుగొరిగించుకున్న వారే! హిందూ పురాణాలు చంద్రుని ఒక దేవతగా వర్ణించగా, క్రైస్తవ సత్యవేద గ్రంథంగా చెప్పబడే బైబిలు చంద్రుని ఒక జ్యోతిగా వర్ణించింది. ఇది సర్వాబద్ధమని ప్రత్యక్షంగా రుజువైనప్పటికి ఇట్టి మానవుల అశాస్త్రీయ నమ్మకాలు ఎందుకు సడలడంలేదు? సైన్సు కాడికి వచ్చే సరికి మీ నోళ్లెందుకు మూతబడిపోతున్నాయి. మీరు అంగీకరించనంత మాత్రాన అవి నిజాలు అయిపోవు కదా! ఇన్ని అపూర్వ విషయాలను మీరు సాక్ష్యాధారాలతో సహా విన్న తర్వాత కూడ ఇట్టి యధార్థ విషయాలను అంగీకరించే ప్రయత్నం చేయకపోతే.... "ఆదేవుడు కూడ మిమ్మును రక్షించలేడనే!" పాత చింతకాయ పచ్చడి లాంటి దిక్కుమాలిన సామెతలను చెప్పి నిష్క్రమించ వలసిందే! "సైన్స్ జిందాబాద్!... మతగ్రంథాలు ముర్దాబాద్!"





# ప్రేమగల దేవుడు - దయగల తండ్రి! ఇంతటి భయకరుడా?

యూద మతగ్రంథ మందలి దావీదు మహారాజు రచనలను నేటి మన బైబిల్ నందు కీర్తనల గ్రంథమందు పొందుపరచారు. ఇందు సౌలు రాజు, తదితర శత్రు రాజులతో పాటు, తన స్వంత కుమారుడైన స్పురుద్రూపియైన "అబ్షాలోము" సహితంగా రాజ్యధికారం కోసం రాజైన దావీదు యొక్క ప్రాణాలు తీసే ప్రయత్నం చేశారు. ఈ నేపథ్యంలో దావీదు కొన్నిసార్లు అజ్ఞాతంలో యుంటూ ప్రాణభయంతో తనను కాపాడమంటూ యెహోవాను వేడుకొనుటతో పాటు తన శత్రువులను సర్వనాశనం చేయమని వారిని తన మెరుపు బాణాలతోను, పిడుగు బాణాలు కూడ మెండుగా కురిపించి చంపమని యెహోవాకు మధ్యమధ్యలో సలహాలిస్తూ, యెహోవా సైన్యమైన కందిరీగలు, జోరీగలు, మిడతల దండ్లను పంపి వారిని హతము చేయమని వికావికలు చేయమని ప్రార్థించడమే కాక వారివారి సంతానాన్ని అనాథలుగా చేసి, అప్పుల పాలు చేయమని అనేక శాపనార్థాలు పెడుతూ ఈ కీర్తనల గ్రంథరచన సాగించాడు.

ఇంతేగాక యెహోవా గుణగణాలను, ఆయన యొక్క శక్తి యుక్తులు, బలాధిఖ్యత ఎంతటి మహోన్నతమైనవో లేనోళ్ల కొని యాడుతూ, గతంలో యూద ప్రజల ఎడల జరిగించిన అద్భుత కార్యాలను సింహావలోకనం చేస్తూ, తల్లిగర్భమందు మానవులను దేవుడు రూపొందించిన చిత్రమైన విధమును గూర్చి పొగుడుతూ, ఒక్కమాటలో చెప్పాలంటే యెహోవా ఇంకా భూమికి "పునాది" వేయకముందే, అసలు భూమికి పునాదులు వేయడమనేదే ఒక అజ్ఞానపు భావన! సృష్టికార్యం ప్రారంభించకముందే, ఆయనకు మరుగైనదేదీ లేదని, భూమిమీద పుట్టబోయే ప్రతీఒక్కరి యొక్క నైజం యెహోవాకు ముందే తెలుసునని ఆయన వర్తమాన, భూత, భవిష్యత్, గ్రాహియని యెహోవాను తెగపొగుడుతూ యుంటాడు. ఇంతేగాక సృష్టిరహస్యాలను, సూర్యచంద్ర నక్షత్రాదుల గతులను వివరించారు. ముఖ్యంగా ఈ శీర్షికలో చూడనున్న యెహోవా యొక్క భయంకర లక్షణాలను క్రూరమైన ఆయన రూపాన్ని, యెహోవాలో దాగియున్న భయంకర అగ్ని జ్వాలలను, ఆయన దుర్భరమైన గర్జనను వివరించాడు. ఇట్టి భయానక, వర్ణనలను చదివిన భక్తజనాలు – అయ్యబాబోయ్! మా యెహోవా దేవుడింతటి భయంకరుడాయని గజగజ లాడిపోతూ యుండడమే గాని – ఈ వర్ణనలందు ఎంతటి నిజమున్నదో, ఇందలి సంభవా సంభవాలను గూర్చి ఏ మాత్రము సందేహ పడరు. అది గాకున్నా దావీదు మహారాజు తన ప్రాణరక్షణ కోసం వెలిబుచ్చిన భయాందోళనలు, ఆక్రందనలు సమస్తము తమతమ జీవితాల్లో తమకు సంభవిస్తున్న ఆపదలవలెనె తలచి ఆదరణపొంద ప్రయత్నిస్తారు. ముఖ్యంగా సూర్యచంద్ర నక్షత్రాదులను గూర్చి, భూమి బల్లపరుపుగా ఉన్నదని, సూర్యుడే భూమి చుట్టూ తిరుగుచున్నాడని, యెహోవా ఆకాశంలో సూర్యుని

కొరకై ఒక గుడారము వేశాడని మరింకెన్నో దావీదు వ్రాసిన వివరణలు అశాస్త్రీయాలైనా ప్రపంచమందలి ఏక్రైస్తవ శాస్త్రవేత్త కూడ నోరు మెదపరు. ఈ కీర్తనల గ్రంథమందు అనేక చోట్ల ఇట్టి ప్రకృతి విరుద్ధ వివరణలు కనబడతాయి. యెహోవాను గూర్చి ఈ బైబిల్ రచయిత యొక్క అతిశయోక్తులకు సంబంధించిన ఒకేఒక వాక్యమును గూర్చి చర్చిందాము.

**అప్పుడు భూమి కంపించి అదిరెను. పర్వతముల పునాదులు వణికెను. ఆయన కోపింపగా అవి కంపించెను. ఆయన నాసికా రంధ్రముల నుండి పొగపుట్టెను. ఆయన నోటినుండి అగ్నివచ్చి దహించెను. నిప్పుకణములు రాజబెట్టెను.... యెహోవా ఆకాశమందు గర్జన చేసెను. సరోన్నతుడు ఉరుముల ధ్వని పుట్టించెను, వడగండ్లును, మండుచున్న నిప్పులును రాలెను. ఆయన తన బాణములను ప్రయోగించి శత్రువులను చెదరగొట్టెను. మెరుపులను మెండుగా కుమ్మరించి ఓడగొట్టెను. యెహోవా! నీ నాసికా రంధ్రముల ఊపిరిని నీవు వడిగా విడవగా, నీ గద్దింపునకు ప్రవాహ జలముల అడుగు భాగము కనబడెను. భూమి పునాదులు బయలుపడెను. (కీర్తనలు 18:7-15)**



పై వివరణ ప్రకారం దీనిని విశ్లేషించగా హిందూ పురాణాలందు చెప్పిబడిన విధంగా ఇంద్రలోకంలో అర్జునుడు తన రథమందు పయనిస్తూయుండగా మెరుపులు, ఉరుములు, పిడుగుల శబ్ధములు వస్తున్నవని ఆయా సమయాలందు హిందూభక్తులు "అర్జునా! - పాల్గుణా" యంటూ అర్జునుని తలస్తూ యుంటారు. ఇట్టి కథలకు దగ్గరగా కనబడే విధంగా యెహోవా గర్జనచేయగా ఉరుములు, పిడుగుల ధ్వని వినిపిస్తాదని, అట్టి





సమయాలందు వడగండ్లును, మండుచున్న నిప్పురవ్వలు రాలునని బైబిల్ చెబుతుంది. ప్రేమామయుడుగా చెప్పబడుచున్న యెహోవా ముక్కు పుటాల నుండి ధారుణంగా పొగలు ఎగజిమ్ముచుండగా ఒక ప్రక్క కారుమబ్బులు కమ్ముతూ యుంటే ఆదేవాది దేవుని నోటినుండి భయంకర అగ్నిజ్వాలలు వెడల గ్రక్కుతూ, నిప్పులు చెరగుతూ దహిస్తూ యుంటాడట. మరి ఎవరిని ఎప్పుడు దహిస్తాడో తెలియదు. మరణాంతర జీవితంలో యెహోవా దివ్యసన్నిధానంలో ఆనందమయ జీవితం గడపవచ్చని, తమ ఆదాయంలో పదియవ వంతులు ధారపోస్తూ అష్టకష్టాలుపడి అక్కడకు చేరతామని పగటి కలలు కనే "విశ్వాసుల" కలలు నెరవేరతాయా? ఎక్షణాన ఎవరి మీద నిప్పు గ్రక్కుతాడో తెలియదు. అంతా అయోమయంగా యుంది. అందుకే కావచ్చు అనేక చోట్ల యెహోవాను "భయంకరుడైన దేవుడు" అంటూ బైబిల్‌ల్లో పదేపదే వ్రాయబడింది. ఈ వాక్యాన్ని నేను అనేక సార్లు చదివాను గాని అప్పుడు నాకేమీ భయమనిపించలేదు. కాని ఈ నిప్పులు చెరిగే చిత్రం పెయింటింగ్ కూడా కాదు కేవలం ఒక గంటలో వేసిన "రఫ్ స్కెచ్" మాత్రమే అయినా దీనిని చూస్తూయుంటే అమ్మబాబోయ్ క్రైస్తవుల దేవుడు ఇంతటి భయంకరుడా! అందుకే కావచ్చు ఏ నరుడును నన్ను చూచి బ్రతక జాలడని సెలవిచ్చాడు. నిజంగా ఆయన నిజస్వరూపాన్ని చూస్తే ఇంతే సంగతులు కావచ్చు.

అయితే కరుణా కటాక్షాలు గలవాడు, దయామయుడైన తండ్రిగా వర్ణించబడిన యెహోవా దేవునికి ఇంతటి క్రూర భయంకర లక్షణాలా! ఇవి ఆయన కెందుకో తెలియదు. మనము ప్రకటన గ్రంథమందలి వివరణలలో అంత్య దినముల యందు అగ్ని గ్రంథకాలను వెడల గ్రక్కే క్రూరమృగాలను గూర్చి వర్ణించారు. అవన్నీ సాతాను రూపాలుగా చెప్పబడ్డాయి. వీటి తాలూకు వివరణలు, చిత్రాలు రాగల రచనల్లో చూడగలము. అంత్యకాల మందు అవన్నీ జరగనున్నాయని చెప్పబడింది గాని నిజంగా అట్టి లక్షణాలన్నీ మనకు పై వాక్యం ద్వారా యెహోవాలోనే కనబడడమేమిటో అర్ధం కావడం లేదు. ప్రియక్రైస్తవ సోదరులారా ఎందుకైనా మంచిది జరభద్రంగా యుండండి!!!



ఇక రెండవదిగా ఆయన యొక్క ఊపిరిని వేగముగా విడువగా నీగద్దింపునకు ప్రవాహజలముల అడుగుభాగము బయల్పడెను. ఒక్కసారిగా లక్షలాది వాయుగుండాల సునామీ వలె సముద్రమందలి సమస్తజలాలు చెల్లాచెదురై ఎగజిమ్మి సముద్ర దిగంతాలు బయల్పడి, సముద్రపు అట్టడుగు భాగం బయట పడడంతో యెహెూవా యోబు గ్రంథంలో వివరించిన భూమి యొక్క పునాదులు అక్కడ నిర్మించబడిన స్తంబాలు బయల్పడి పోయాయట. ఇది ఎంతటి ఆశ్చర్యకర విషయం! ఈ భయంకర ప్రళయాన్ని దావీదు మహారాజే చూచాడో! మరెవరు చూచారో వ్రాయబడలేదు. "నిజంగా బైబిల్ ఎంతటి సత్యమైనది?" భూస్తంభాలు వాటి పునాదులు బయటపడ్డాయా! ఆహా!! అసలు సముద్రమనేదే భూమిమీద ఉన్నదనే విషయం నాటి రచయితలకు బొత్తిగా తెలియదా?.

లోతైన సముద్రగర్భం అయిదారు కిలో మీటర్లంత లోతుంటాదట. అంతటి విస్తార జలాలు ఎగసిపడితే భూమండలాన్ని మొత్తంగా ఆ జలాలు ముంచివేస్తాయి. మానవులమైన మనం మన ఊపిరిని ముక్కుతో వేగంగా వదలే ప్రయత్నం ఎంతబలంగా చేసినచేప్పటికి ఆ గాలితో ఒక చిన్నకోడిపిల్ల వెంట్రుక ఎగర వచ్చునేమో! అదీ అనుమానమే! అయితే మానవాకృతిలోనే యున్న యెహెూవా యొక్క అవయవ నిర్మాణం కూడ మనవలెనే యుంటాది. అయితే ఆయన ఎలా చేశాడు? అనే సందేహమిక్కడ పనికిరాదేమో! ఆయన దేవుడు కదా! ఇంకానయం ఆయన ఊపిరి మాత్రమే విడిచాడు గనుక సరిపోయింది. ఒకవేళ్ల ఒక తుమ్మే తుమ్మి యుంటే భూమండలం అంద్రసు లేకుండా పోయేది కావచ్చు!

బైబిల్ నందు భూమండలానికి పునాదులు వుంటాయని, స్తంభాలపై భూమిని యెహెూవా నిలబెట్టాడని చెప్పారు. వారు ఊహాజనితంగా పెద్దపెద్ద కట్టడాలకు పునాదులుంటాయి గనుక భూమికి కూడ పునాదులతో పాటు స్తంభాలు కూడ వుండవచ్చని ఆ మొరటు రచయితలు పనిలో పనిగా యెహెూవాచే దానికి మూలరాతిని కూడ వేయించి ఘనంగా ప్రారంభోత్సవం కూడ చేయించారట. బైబిల్ చెబుతుంది గనుక అందరూ నమ్మేస్తున్నారు. ఇది ఎంతటి హాస్యాస్పధమైన కట్టుకథ! దీనిని సత్యవేద గ్రంథమైన బైబిల్ చెప్పడం సిగ్గుచేటయిన విషయం.



"నాసా" అంతరిక్ష పరిశోధనా కేంద్రం అమెరికా వారుతీసిన భూమిపొటో! దీని కెక్కడా స్తంభాలున్న జాడలే కనబడుటలేదు. వూరికే చదువుకొంటూపోకండి. ఆలోచించండి నేటి ఆధునిక యుగంలో భూమండలం స్వరూప స్వభావాలు భూగోళ





శాస్త్రంలో మూడవ తరగతి విద్యార్థులకు కూడ బాగా తెలుసును. గతంలో లాగా భూమి యొక్క స్వరూపాన్ని ఊహాచిత్రాల ద్వారా కాక దాని "లైవ్ ఫొటోగ్రాఫ్"ను మనము చూడగలుగుతున్నాము. మత గ్రంథాలు ఎన్నెన్ని కల్లబొల్లి కబుర్లు చెప్పుచున్నప్పటికి భూమిగుండ్రంగా యుందని, అది తన చుట్టూతాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ తిరుగుతుందనేది పరమసత్యమని మనకు తెలుసు. అయితే భక్తి ప్రభంజనంలో పడ్డ విద్యాధికులకు, మేధావి వర్గాలకు ఈ విషయాలు క్షుణ్ణంగా తెలిసినప్పటికి బైబిల్ నందలి అశాస్త్రీయం, అసంగతమైన విషయాలను నమ్ముచూ తమను తాము మోసగించుకొంటున్నారు. మత నమ్మకాల ముందు చదువు సంధ్యలు వెలవెలబోతున్నాయి. సకల వైజ్ఞానిక విషయాలందు వందలాది సంవత్సరాలుగా ముందంజలోనున్న పాశ్చాత్య దేశాలు మరి ముఖ్యంగా ఇంగ్లండు, అమెరికా, జర్మనీ, ఇటలీ, జపాన్, రష్యావంటి అనేక దేశాలందలి వైజ్ఞానికులైన వారు కూడ ఇట్టి మతాల మాయలో చిక్కుకు పోయారు. అలనాడు వీరి ముత్తాతల తాతలే మహెూన్నత శాస్త్రవేత్తలైన ప్రఖ్యాత సైంటిస్టులుగా కొనసాగారు. అట్టివారిని నాటి అజ్ఞాన మతాంధకారం వారి గొంతులను నలిమివేయగా అట్టి మహానుభావుల వారసులైన నేటి క్రైస్తవ మతావలంబులు నేడు అట్టి సైన్స్ సత్యాలను గూర్చి మాట్లాడ కుండ తమ గొంతులను తామేనొక్కుకుంటూ తమనోళ్లను తామే మూసుకుంటూ బైబిల్ అశాస్త్రీయ బోధనలను మౌనంగా అంగీకరిస్తున్నారు. ఇట్టి సైన్సు సత్యాలను వెల్లడిస్తూ మత గ్రంథాల అజ్ఞానాన్ని ఖండించే ప్రయత్నం, సాహసం చేయలేక పోతున్నారు. కాదంటే తాము అవిస్వాసుల జాభితాలో పడిపోతామని వీరి భయంకావచ్చు. ఈ యూదమత గ్రంథ రచయితల్లో అనేకులు రాజులు, చక్రవర్తులు, ప్రవక్తలు మొదలైన వారిలో చాలామంది నిరంకుశులు, చండశాశనులు నియంతలు, స్త్రీలోలురు, దోపిడీ మనస్తత్వం గల నరహంతకులు గాను, జాత్యాహంకారులు గనూ యుంటూ, హిట్లరు లాంటి సామూహిక హత్యా మనస్తత్వం, ఇ.డి.అమీన్ వంటి నరమాంస భక్షణకు సైతం పాల్పడే ఆటవిక ధోరణులను వంటబట్టించుకొని, మంత్రతంత్ర వశీకరణ విద్యలందు, పరకాయా ప్రవేశాలు, భూత ప్రేత పిశాచాల యందునమ్మకాలతో పశుపక్ష్యాదులు కూడ మాట్లాడతాయనే భ్రమలతో నాటి అనాగరిక దశలో వీరి ఆలోచనలకు అనుగుణంగా ఇట్టి కౄరమైన దేవునికి అంకురార్పణ చేశారు. ఇట్టి తమ భావాలకు తగిన విధంగా రూపొందించబడ్డ దేవుడే ఈ యెహెూవా!

ఈ నేపథ్యంలోనే ఆ దేవునితో తమకు అనువైన రీతిలో యూదమత గ్రంథాన్ని సృష్టించుకొన్నారు. అందుచే వీరి దేవుడైన యెహెూవా! తన ప్రజలను (ఇశ్రాయేలీయులు)గా చెప్పుకొంటూ, వారిలో జాత్యాహంకారము నూరిపోస్తూ, అన్య జాతులపై యుద్ధాలకు పురికొల్పుతూ, దొరికిన వారిని దొరికినట్టు సంహరిస్తూ వచ్చారు. అందులో భాగంగానే ఇట్టి యుద్ధాలందు పురుషులను, పురుష సంయోగ మెరిగినీ స్త్రీలను, పిల్లలను మాత్రం

చంపుతూ కన్యకలను మాత్రం మీ సుఖసంతోషాలకై ఉంచుకోండని ఆ దేవుడి మాటలుగా వ్రాసుకొన్నారు. అనేక సందర్భాల్లో యెహోవా తన ప్రజలకు స్త్రీ లోలత్వంలో సహకరించినట్లు కనబడతాది. దావీదు రాజు ఒక స్త్రీ విషయంలో తొందర పడినందుకు యెహోవా స్వయంగా మాట్లాడుతూ దావీదూ! నీవు ఊరియా భార్యను ఎందుకు చేరదీశావు.... నీకు నేను నీయజమానియైనన సౌలు స్త్రీల నందరిని నీ కౌగిట చేర్చాను గదా! నీవది చాలదని అనుకొనిన ఎడల మరి యెక్కువగా నీకిచ్చియుండెడి వాడనని యెహోవా చెప్పినట్లు వ్రాయబడింది. అలాగే రాజైన సొలోమోనుకు దగ్గర వేయిమంది వరకు భార్యలు, ఉంపుడు గత్తెలు, అన్యరాజుల కుమార్తెలతో యున్నప్పటికి యెహోవా నుండి అభ్యంతరము రాలేదు. ఇంతేకాదు దావీదు తనకు వ్యతిరేకంగా ఒక స్త్రీని చేరదీసినందుకు శిక్షగా అతని కుమారుడైన అబ్షాలోమును ప్రేరేపించి, పట్టపగలు మేడపై గుడారము వేయించి అతని పినతల్లులతో యెహోవా వ్యభిచంప జేశాడట. వ్యభిచారము ఘోరనేరంగా చెప్పే యెహోవా చేయించదగ్గ పనులేనా! ఇది!

ఇంతేగాక ఈ కౄరుడైన దేవుడు యూదప్రజల స్త్రీలను అన్యదేశాలకు అప్పగించి వ్యభిచారం చేయించడము, యెహోవాయే ఇశ్రాయేలీయులను విగ్రహారాధికులుగా చేయడము, వారి పిల్లల మాంసము వారితోనే తిపించిన సంఘటనలు ఈ రచనా భాగంలోనే సచిత్రంగా చూడగలరు. ఇంతటి దుర్మార్గ మనస్తత్వం గల యూద దేవుడైన యెహోవాను క్రైస్తవ్యం ప్రేమాయుడైన తండ్రిగా కీర్తిస్తూ బైబిల్ నందు ఆయనను మహోన్నతుడైన సృష్టికర్తగా స్వీకరించడం ఆయనను పదేపదే ప్రశంసించడం కనబడతాది. ఏదియేమైనా దేవుడైన యెహోవా తన నోటి నుండి అగ్నిజ్వాలలు, నిప్పురవ్వలు కురిపిస్తూ ఆయన నాసికా రంధ్రాల నుండి పాతకాలం నాటి పొగ బండివలె పొగలు సెగలు విడవడం నమ్మశఖ్యమైన విషయమేనా? ఇట్టి అసహజమైన కల్పిత గాథలను నమ్మేముందు నిశితంగా పరిశీలించి ఆలోచించవలసిన బాధ్యత బుద్ధిజీవులమైన మనకులేదా?

> ముఖ్య గమనిక ఈ రచనల్లో మొదటి నుండి చివర వరకు ఆయా బైబిల్ వాక్యాలు సందర్భానుసారంగా రెండుమూడు సార్లు కూడా "రిపీట్" అవుతూ వచ్చాయి గనుక చెప్పిందే మరల చెప్పబడుతందని "బోర్‌ఫీల్" కావద్దని మనవి. ఇందు యెహోవాను కించపరచడం జరిగిందని ఎంతమాత్రము భావించనవసరంలేదు. ఇదంతా బైబిల్ వ్యాఖ్యలే!ననే సంగతి మరువరాదు.





# "ప్రేమామయుడైన" యెహోవా యొక్క శిక్షల తీరుతెన్నులు



యెహోవాకు తన ప్రజలపై కోపతాపాలకు కారణమేమింటో ఆయన ప్రియభక్తుడైన దావీదు మహారాజు చక్కగా వివరించాడు.

**యెహోవా వారికి ఆజ్ఞాపించినట్లుగా వారు అన్యజనులను నాశనము చేయకపోయిరి.** అన్యజనులతో సహవాసము చేసి వారి క్రియలు నేర్చుకొనిరి. వారి విగ్రహములకు పూజ చేసిరి. అవి వారికి ఉరియాయెను. మరియువారు తమ కుమారులను కుమార్తెలను, దయ్యములకు బలిగా ఇచ్చిరి... అనగా వారి కుమారుల రక్తము, తమ కుమార్తెల రక్తము ఒలికించిరి. కానాను దేశపువారి బొమ్మలకు వారిని బలిగా అర్పించిరి. ఆ రక్తము వలన దేశము అపవిత్రమాయెను. తమ క్రియల వలనవారు అపవిత్రులైరి. తమ నడవడితో వ్యభిచరించిన వారైరి. కావున యెహోవా కోపము ఆయన ప్రజల మీద రగులు కొనెను. ఆయన వారిని అన్యజనుల చేతికి అప్పగించెను. వారి పగవారు వారిని ఏలుచుండిరి. వారి శత్రువులు వారిని బాధపెట్టిరి. అనేక మారులు ఆయన వారిని విడిపించెను. అయినను వారు తమ ఆలోచనను అనుసరించి తిరుగుబాటు చేయుచు వచ్చిరి. (కీర్తనలు 106:34-43)

వారు తన కట్టడలను అనుసరించుట లేదని, కొందరు అన్య దేవతలను పూజిస్తున్నారని కట్టలు తెంచుకొన్న క్రౌర్యంతో యవత్ యూదప్రజలను ఏకంగా 400 సంవత్సరాలు ఇగుప్తు రాజులైన ఫరోలకు అప్పగించి, ప్రపంచ చరిత్రలో ఎక్కడాలేని విధంగా భయంకర బానినత్వానికి గురిచేశాడట. మన ఇండియాను బ్రిటీష్ సామ్రాజ్యవాదులు నుమారు 300 సంవత్సరాలు పాలించారు. వారు మన వనరులు దోచుకున్నప్పటికి కొద్దోగొప్పో నాగరికంగానే పాలించారు. పై నాలుగువందల సంవత్సరాలలోను అయిదారు తరాలు మారియుంటాయి. దీనివల్ల వారు తమ జాతీయ కట్టుబాట్లకు దూరమై మరిన్ని ఐగుప్తీయుల అలవాట్లకు, వారి సంస్కృతికి



లోనైయుంటారు. యీ శిక్ష వల్ల ఏ విధమయిన మేలు జరగలేదు. ఇది యెహెూవా శిక్షలకు పరాకాష్టయైన ఆటవిక చర్యలు.

పై విధంగానే (యిర్మియా 25:8-12)లో చూడగా యూద జనులు తన ఆజ్ఞలు గైకొనుట లేదని మొత్తం ఉత్తర దేశంలోనున్న సర్వజనులను మరొక్కసారి బబులోను రాజులకు కల్దీయులకు డెబ్బది సంవత్సరాలు బానిసత్వానికి గురిచేశాడట యెహెూవా!

**తన ఇశ్రాయేలు ప్రజలు బొత్తిగా తన మాట వినుటలేదని, వారు నావాక్యమును నిరాకరిస్తున్నారని వారినందరిని మరి ముఖ్యంగా యూద స్త్రీలను, తన జనుల భార్యలను అన్యజనులకు అప్పగించి వీరిని బలాత్కరించి, వీరితో వ్యభిచరించి వీరి బ్రతుకులు సర్వనాశనం చేయమని యెహెూవాయే స్వయంగా ముష్కరులకు అప్పగించడం ఈ దేవుడు చేయవలసిన పనియేనా!** ఈ విధంగా వందలాది సంవత్సరాలు క్రూరులైన అన్యజాతుల చేతికి వీరిని బానిసలుగా అప్పగిస్తే వారు వీరి మాన ప్రాణాలకు విలువనిస్తారా వారు తమ చిత్తము వచ్చిన విధంగా వీరిని పాడుచేసే అవకాశమును యెహెూవా వారికి ఇచ్చినట్టే అవుతుంది కదా!



నరహత్య మహాపాపమని యెహెూవా తన పదియాజ్ఞలయందు పొందుపరచి, కన్న బిడ్డలనే కోసుకు తినండ్రా కొడకల్లారా! యని శిక్ష విధించడమా! ఈ యూద దేవుడైన యెహెూవా! భూదిగంత నివాసులకు తండ్రియైన దేవుడు! ఆలోచనా కర్త, ఆద్యంత రహితుడైన దేవుడు, నిత్యుడగు దైవం చేయించిన క్రూరాతి క్రూరమైన దుష్టచర్యలు ఎన్ని వెర్రితలలు వేశాయో చూడండి!





**ఏలయనగా, నన్ను విసర్జించి, ఈ స్థలములో అపచారము చేయుచున్నారు. ఈ పట్టణము పాడుగాను, హాస్యాస్పదము గాను చేసెదను. వారు తమ కుమారులను, కుమార్తెల మాంసమును తినునట్లు చేసెదను. తమ ప్రాణము తీయ వెదకు శత్రువుల ముట్టడికి వీరిని అప్పగించెదను. ప్రతీవాడును తన చెలి కాని మాంసమును తినును!** (యిర్మియా 19:4-9)

ఇవి స్వయంగా కరుణామయుడైన యెహెూవా పలికిన పలుకులా! లేక భయంకర దుష్టరాక్షస దుర్మార్గుల పరాకాష్టయా? పై శిక్షలను అనుభవించిన వారు లెంపలు వాయించుకొని, అయ్య బాబోయ్! ఇంకెప్పుడూ మేము అన్యదేవతలను మ్రొక్కమని వెనువెంటనే యెహెూవాను వెంబడించి సత్ ప్రవర్తనులై పోతారా!! ఎంతమాత్రము ఇట్టి వారిలో మార్పురాదు. మరింత క్రౌర్యం పెరుగుతాదే కాని ఇట్టి వారికి జ్ఞానోదయం కలగడం అసంభవం! ఇంతటి రాక్షస మనస్కుడు క్రైస్తవ మతానికి ప్రేమా సముద్రుడైన దేవుడిగా కనబడుచున్నాడా?

ఈ శీర్షికలో మనము చూస్తున్న హింసాకాండ, హత్యాకాండ, తన స్వజాతీయులని చెప్పుకుంటున్న యూద జనాంగాలను, అన్యజనాంగాలను, యెహెూవా ఇంత క్రూరమైన రీతిలో తుదముట్టిచడము, తన చేతితో తానే తన ప్రజలను వ్యభిచారులకు, హంతకులకు అప్పగించవలసినంత అగత్యమేమి వచ్చింది? చివరకు ఒకని నొకడు కోసుకుతిన మని చెప్పడం ఎందుకు జరిగింది? దీనికంతకు ఒకే ఒక్క స్వార్థపూరిత కారణం యావత్ ప్రపంచం, సకల జాతుల ప్రజలు తన పాదాల చెంత సాస్టాంగ పడాలని, తన కాళ్లు మ్రొక్కాలనే స్వార్థచింతనే పై విధమైన ధారుణ దుర్మార్గాలకు దారి తీసినట్టుగా చూస్తున్నాము. ఇంతకు ముందు మనము చూచిన హిందూ దేవుళ్లకు ఇట్టి "యావ" వున్నట్టు కనబడదని చెప్పకొన్నాము. వారెంతో విశాల హృదయులుగా కనబడతారు. నన్నుతప్ప మరొక దేవుడి మ్రొక్కితే తోలు ఒలిచేస్తానని వారెవరూ అన్న సందర్భాలు ఎక్కడా కనబడవు. దేవుళ్ల మీద మానవులకే భక్తి పారవశ్యం పుట్టుకొచ్చి స్వచ్ఛందంగా ముక్కు నేలకు రాసుకొంటూ యుంటే అదో తీరుగా యుంటాది కాని... ఓరినాయనో ఆ దేవుడికి దండం పెటకపోతే చంపుతాడు... నరుకుతాడు... మనల్ని మనమే కాల్చుకు తినమంటాడు... వ్యభిచరింపజేస్తాడు... అన్యదేవతలకు మ్రొక్కించే ఏర్పాట్లు చేస్తాడు, బానిసత్వానికి అప్పగిస్తాడురోయ్ నాయనోయంటూ బెదిరిపోతూ, గజగజ వణికిపోతూ సేవించేది ఒక భక్తేనంటారా! ఔను అది భక్తేనంటారు ఒక్క క్రైస్తవ భక్తులు మాత్రమే! ఇంతటి ఆటవికమైన బైబిల్ గ్రంథం పరిశుద్ధ గ్రంథం అంటారా?

మనలో దైవత్యము లేకపోయినా ఎంతోకొంత మానవత్వం ఇంకా మిగిలేయుంది. అయ్యయ్యో మరీ ఇంత క్రూరమైన రీతిలో కన్నబిడ్డలనే కాల్చుకుతినమంటావా దేవా!



యని ఏ ఒక్క విశ్వాసియైనా యెహోవాను విమర్శించకపోయినా కనీసం ఆయనకు పై విధంగా ప్రార్ధనా విన్నపాలైనా చేయరు. భక్త జనులారా! ఇక్కడ మీ కళ్లముందు కదలాడుచున్న ఈ చిత్రాలను చూచాకైనా మీకు కనీస స్పందనయైనా లేదా! మీ దృష్టిలో దేవుడనే వాడు ఏమి చేసినా, అది ఎంతటి నికృష్టమైన చర్యయైనా అది మీ దృష్టికి న్యాయంగానే కనబడతాదా? "ఆయన సృష్టి ఆయనిష్టం" అంటారా! అలాగైతే మీ కన్నా ఈ క్రింద చెప్పబడుచున్న ఆ అభాగ్యుడే వేయిరెట్లు నయమనిపించక మానదు. పాపమా అగంతకునికి ఎంత ఆకలైనా, కన్నబిడ్డలను గాని, చెలికానిని గాని, పరుల బిడ్డలను గాని కోసుకు తినకుండా, తన మాంసాన్ని తానే, తన చేతిని తానే కొరుక్కుతిన్న ఆ "మహానుభావుడు" ఎక్కడి వాడోకాదు. మన ఆంధ్రరాష్ట్రంలోనే విశాఖజిల్లా, పాయకరావుపేట "సిరి"దుకాణ సముదాయల సమీపమందలి నడిబజారులో అనేకమంది సమక్షంలో పత్రికా విలేఖరుల సాక్షిగా జరిగింది.

**స్వీయ మాంస భక్షకుడు!**

**పాయకరావుపేట, న్యూస్‌టుడే:** క్షుద్బాధను తట్టుకోలేక పోయాడో... లేక మతి స్థిమితం లేక అలా చేశాడో... తెలియదు కానీ... తన ఎడమ చేతిని తానే తిని సంచలనం సృష్టించాడు ఓ వ్యక్తి. ఒళ్లు గగుర్పొడిచే ఈ సంఘటన విశాఖ జిల్లా పాయకరావు పేటలో సోమవారం ఉదయం చోటు చేసుకుంది. స్థానిక సిరి దుకాణ సముదాయం సమీపంలోని రోడ్డు పక్కన ఉన్న సిమెంటు తూరలో కూర్చుని ఒక వ్యక్తి తన ఎడమ చేతిని తానే తింటున్నాడు. దీన్ని గమనించిన స్థానికులు పత్రికా ప్రతినిధులకు సమాచారం అందించారు. ఆనోటా ఈనోటా విషయం తెలిసిన పట్టణవాసులు పెద్దఎత్తున అక్కడ గుమిగూడారు. అయితే అప్పటికే అతడు అరడుగు పొడవునా చేతిని తినేశాడు. అంతకుముందు ఉదయాన్నే బ్లేడుతో చేతి వేళ్లను కోసుకుని వాటిని సూర్యమహల్ థియేటర్ ఎదురుగా పేపర్లతో కాల్యుకుని తన వెంట తీసుకువెళ్లినట్లు కొందరు చెప్పారు. పది గంటల తర్వాత సిమెంటు తూరలో కూర్చుని చేతిని ఆరగిస్తున్న విషయాన్ని స్థానికులు గమనించారు. అతడి ఒళ్లంతా రక్తం కారిపోగా, మాట్లాడుతున్న భాష ఏమిటో అర్థం కావడం లేదు. సమాచారం పోలీసులకు తెలియడంతో బాధితుడిని ప్రభుత్వ ఆసుపత్రికి తరలించారు.

**28 జూన్ 2011 ఈనాడు**

ఆలకించండి! మీరందరు నామాట వినకుండ కఠినమైన మీదుష్ట హృదయ కాఠిన్యము చొప్పున నడుచుకొను చున్నారు. మీరు మీ పితరుల కంటే విస్తారముగా చెడు తనము చేసి యున్నారు. కాబట్టి నేను మీయందు ఏమాత్రమును దయ యుంచక యీ దేశము





నుండి మీరైనను, మీ పితరులైనను ఎరుగని దేశమునకు మిమ్మును వెళ్లగొట్టుచున్నాను. అక్కడ మీరు దివారాత్రములు అన్యదేవతలను కొలుతురు. (యిర్మియా 16:12-13)



పై చర్య యొక్క పర్యవసానము ఏ విధంగా యుంటాదో యెహోవాకు తెలియదా! తనకు తానే వ్యతిరేకంగా నిర్ణయాలు తీసికోవడమేమిటి? ఇది ఉక్రోషమా ఉడుకు బోతు తనమా! మెంటల్ కేసా?

మరియొక హృదయ విదారకమైన శిక్షయిక్కడ చూడనున్నాము. నాటి యూదమత గ్రంథ రచయితలు తాము దైవాన్ని గూర్చి వ్రాస్తున్నామో! లేక రాక్షసుని గూర్చి వివరిస్తున్నారో వారికే తెలియనట్లుంది. అయ్యో కరుణాకటాక్షములు గల తండ్రీ! ఏమిటీ దౌష్టీకం! నీకు కొంచమైన "అది" లేదా? "ఇది" లేదా! అని ఎవరడగ గలరు? నీ శిక్షాస్మృతి ఘోరమయిన అద్భుతమని భక్తులు తరించి పోవలసిందే!



యెరూషలేమును - ఏదోము జనులు పాడుచేసిరి. నీవు మాకు చేసిన క్రియలను **బట్టి నీకు ప్రతీకారము చేయువాడు ధన్యుడు. నీ పిల్లలను బండకువేసి కొట్టువాడు ధన్యుడు!!** (కీర్తనలు 137:8:9)

**ఈ పట్టణములో నిలచువారు కత్తివలన గాని, క్షామమువలన గాని, తెగులు వలన గాని చచ్చెదరు. నేను (యెహోవా) కీడు చేయుటకై ఈ పట్టణమునకు అభిముఖముఖుడనైతిని.** (యిర్మియా 21:9) ఎంచక్కటి బంగారు వాక్యాలయా! పరిశుద్ధ దేవా! "ప్రెయిజ్-ద-లార్డ్!" అంటూ కీర్తించబడే దేవాది దేవుడు ఈ మహాను భావుడేనా?

ఇంతేగాక అనేకసార్లు యూద జనులను యెహోవా శత్రురాజుల చేతికి అప్పగిస్తూ యుండగా వారు అనేకులను చెరపట్టి వారి దేశాలకు బానిసలుగా, బంధీలుగా తీసికొనిపోతూ యుండేవారు.

బబులోను రాజు మమాతు దేశమందలి రిబ్లాలో వారిని కొట్టించి, చంపించి, యూదా వారిని తమ దేశములో నుండి చెరగొని పోయెను. నెబుకద్నేజరు తన ఏలుబడిలో ఏడవ సంవత్సరమున మూడువేల ఇరువది ముగ్గురు యూదులను చెరగొని పోయెను, తిరిగి తన ఏలుబడిలో పదునెని మీదవ సంవత్సరమున యెరూషలేము నుండి 832 మందిని చెరగొని పోయెను, తిరిగి ఇరువది మూడవ సంవత్సరమున యూదులలో ఏడువందల నలువది యైదుగురిని చెరగొని పోయెను. ఈ విధంగా వేలాది మందిని చెరగొని పోవుటకు యెహోవా తోడ్పాటుండేది. యెహోవా ఆనతి మేరకే ఇవన్నీ జరిగాయట. (యిర్మియా 52:28:30)

ఇక్కడ మనము చూచిన అత్యంత కౄరమైన విధంగా యెహోవా తన ప్రజలను అన్యరాజులకు అప్పగించి అగచాట్ల పాల్జేసినట్టు చూస్తున్నాము. యెహోవాకు తన ప్రతీచర్య యొక్క పర్యవసానము ముందుగానే "తెలిసియుండి" కూడ ఇట్టి దురాగతాలకు పాల్పడ్డాడా! మనము ఇతర ప్రాంతాల వారి అలవాట్లను ఆచార్య వ్యవహారాలను కొద్దికాలము చూస్తేనే వాటికి అలవాటు పడతాము. నా చిన్నతనంలో ఏప్రిల్ మొదటి తేదీన "ఏప్రిల్ ఫూల్" అంటూ విద్యార్థులు ఒకరి మీద ఒకరు సిరా చల్లుకొనే వారు. అనంతరం దేశ ఉత్తర ప్రాంతం నుండి మార్వాడీలు, గుజరాతీలు మొదలైనవారు ఆంధ్రప్రాంతంలో స్థిరపడివారు "హోలీ" పండుగను జరుపుకొవడము చూచిన మనము కూడ అలవాటు పడ్డాము. అలాగే "నరకాసుర వధ"కు సంబంధించిన దీపావళి పండుగ నేడు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతుంది. అయితే యెహోవా యూద జనులను శతాబ్దాల పాటు అన్యజనులకు అప్పగించి వారిని మరింత విగ్రహారాధికులుగా, భ్రష్టులుగా తీర్చిదిద్దడమేమిటి? ఇదంతా తలకాయలేని ఆటవిక రచయితల అజ్ఞాన రచనలతో యెహోవాను సర్వోన్నతుడైన దేవునిగా చూపబోయి చివరకు పచ్చినెత్తురు త్రాగే





రాక్షసుడుగా, రక్త పీపాసిగా, ఆలోచనా రహితునిగా, చండశాశనునిగా యెహోవా పాత్రను గజిబిజి గావించారు. అయినప్పటికి క్రైస్తవ సమాజాలకు ఇవేమీ ఎబ్బెట్టుగా కనిపించవు. అమ్మబాబో! యెహోవా చర్యలను విమర్శించుటకు మానవుడెంతటి వాడని గజగజలాడి పోతారు.

ఒక చిరుతపులి యొక్క దయార్థ్ర హృదయం గూర్చి ఒక మీడియా క్లిప్పింగ్ ద్వారా ఈ ఉదంతం వెలుగులోకి వచ్చింది. ఆఫ్రికాయందలి బోట్స్‌వానా అటవీ ప్రాంతంలో ఒక చిరుత పులి నెలలునిండి గర్భంతోయున్న ఒక కోతిని చంపి బరబరాలాక్కొని ఒక చెట్టుపైకి పోయి తింటుంది. అంతలో కోతి గర్భంనుండి పిల్లజారి క్రింద గడ్డిలోపడింది. ఆదృశ్యం చూచిన చిరుత కోతిని తినడంమాని, క్రిందికి దిగి ఆ పిల్లను చెట్టుపైకి తీసికొని రాగా అది కొంత సేపటికి మరల క్రిందపడి చనిపోయింది. ఆ చిరుత - ఆ చనిపోయిన కోతిపిల్ల యొద్దనే యుండి దానిని నాకుతూ గంటల తరబడి అక్కడేవుండి పోయిన విషయాన్ని "సాక్షి ఫన్‌డే" ఆగష్టు 23, 2000వ సంవత్సరంలో ప్రచురించింది. ఈ ఉదంతం చూడగా ఒక కౄర్ర జంతువు యొక్క ఔదార్యం! మానవత్వం కన్నా... కాదుకాదు! దైవత్వం కన్నా ఎన్నోరెట్లు మిన్నగా కనబడుచున్నది. ఇక్కడ మనము - కౄరజంతువు కోతి ఎడల చూపిన జాలి గొల్పేగాధను చూచాము. అయితే యిక్కడ కోతి కౄర జంతువు ఎడల చూపుచున్న వాత్యల్యం గూర్చిన మరో యధార్థ గాధను కూడ చూద్దాము.



థాయిలాండ్‌లోని సముత్ ప్రకాన్ జంతు ప్రదర్శనశాలలో అవార్న్ అనే పులిపిల్ల (2 నెలలు)ను దూడూ అనే చింపాంజీ కన్నబిడ్డలా సాకుతోంది. తన ఒడిలో ఉంచుకొని పాలు తాగిస్తూ సందర్శకులను ఆకట్టుకుంటోంది.

చాలామంది తాతల నోట మనవళ్లను ఒరే! కోతి వెధవా! అంటూయుంటారు. అలాగే కోతిని గూర్చి కథలు చెబుతూ... అది మర్కటాలపై హాస్యభరితమైన "జోక్"లు చెబుతూయుంటారు.

ఇక్కడ మనము చూడగా "ఈ మర్కటత్వం" మానవత్వం కన్నా మిన్నగా... మాతృమూర్తి కన్నా పదిలంగా పులిపిల్లకు పాలుత్రాగిస్తున్న ఛాయాచిత్రం ఎంతో చూడ ముచ్చటగా యుంది. కనీసం ఈ కోతికున్న ఔదార్యం కూడ మనకు ఈ దేవుళ్లలో కనబడుటలేదు.

ఈ శీర్షికలో మనము కరుణా మయుడని చెప్పబడిన దేవుని నైజం ఎటువంటిదో తేటగా చూచాము. అయితే మానవాళి ఎడల ఆయన చూపాడని చెప్పిన అత్యంత క్రూర చర్యలముందు క్రూరమృగాలు, అల్లరి మర్కటాల యొక్క దాతృత్వం వర్ణించ నలవికానంత ఉన్నత రీతిలోయుండడం విశేషము.

ఇవన్నీ బైబిల్ వ్యతిరేక రచయిత ఆరోపించిన అభియోగాలు, అభాండాలు ఎంతమాత్రము కాదు. ఇవన్నీ బైబిల్ నందు చెప్పబడిన దైవవాక్కులే! అబ్బో ఆయన దయా దాక్షిణ్య పూర్ణుడు... దీర్ఘశాంతుడు... కృపాసమృద్ధి కలవాడు... ప్రేమా మృతధార లొలకబోసే మహోన్నతమైన దేవునిగా చెబుతూ చివరకు రాక్షసమనస్కునిగా తీర్చిదిద్దిన యూదమత నిర్మాతలైన రచయితలకు బే! హార్లంటారో!! జో! హార్లంటారో!! అది క్రైస్తవ విశ్వాసులు విజ్ఞతకే వదలి వేస్తున్నాను.

ఇట్టి "దేవుని ప్రేమను" క్రైస్తవ సమాజాలు అహర్నిశలు కీర్తిస్తూ, కొనియాడుతూ... "దేవునీ ప్రేమ ఇదిగో! జనులార – భావంబునను దెలియరే! కేవలము నమ్ముకొనినా – పరలోక జీవంబు మీ కబ్బునూ!" యంటూ గొల్లపల్లి నథాని యేలుగారి గీతాలా పనల్లో మునిగి తన్మయత్వం చెందుతారో మీ ఇష్టం!!





# ఉపసంహారం



ఇంత తేలికగా ఈ శీర్షికను ఈ ప్రథమ భాగాన్ని ముగించడం సబబు కాదేమో! ఇంతటి తీవ్రాతి తీవ్రమైన అత్యంత ఆటవికమై క్రూరాతి క్రూరమైన యెహోవా చర్యలను కనీసం గర్హించనైనా గర్హించకుండ వదలి వేయడం సమంజసంగా అనిపించుటలేదు. ఏమి చేయాలని ఆలోచిస్తూ వుండగా ప్రింటింగ్ ప్రక్రియ ముగియనున్న తరుణంలో ఒక వార్త తెలిసింది. దీనిని యావత్ ప్రపంచ వార్తా పత్రికలు... టి.వి.లందు... ఇంటర్ నెట్‌లలోను ఈ వార్త భగ్గుమంది. యావత్ ప్రపంచం ముక్కుమీద వ్రేలేసుకుంది!

అదేమంటే మన ఇండియాకు చెందిన జంట చంద్రశేఖర్ – అనుపమ దంపతులకు వారు తమ కుమారుని కాస్తదారికి తేవడానికి శిక్షించి మందలించడము జరిగిందట. ఈ సంఘటన నార్వే దేశంలో జరగగా ఆదేశ శిక్షాస్మృతి ప్రకారము అది ధారుణ నేరమైనందున చంద్రశేఖర్‌కు 18 నెలలు ఆయన భార్యకు 15 నెలలు కారాగార శిక్ష విధించబడిందట. దీనిపై యావత్ ప్రపంచ దేశాలు ఇంతటి చిన్నపాటి క్రమశిక్షణా ప్రయత్నానికి అంత పెద్దశిక్ష ఆ బాలుని కన్న తల్లిదండ్రులకు అవసరమాయని తర్జన భర్జనలు జరిగాయి.

ఈ విషయం ఆలాంగుంచగా ఈ "ఇది నిజమా" ప్రథమ భాగంలో ఇంతవరకు మనము చూచిన ప్రేమామూర్తి దయాళుడైన తండ్రియైన యెహోవా దేవుడి దండనా విధానం... అన్నెంపున్నెం ఎరుగని అమాయక పసిబిడ్డలను బండరాళ్లకు వేసి బాది బాది చంపమనడం... తన స్వజనులని చెప్ప బడుచున్న ఈ ఇశ్రయేలు జనాంగమే తనను ఆరాధించకుండా అన్య దేవతలను మ్రొక్కుచున్నారని దీనికి ప్రతీకారంగా మీరు మీ కుమారులను కుమార్తెలను మీ చేతులతో మీరే ముక్కలుగా నరికి వారి శరీరాలను కాల్చుకొని తినేటట్టు చేయడము మొదలైన హృదయవిదారక చర్యలను యెహోవా తన ప్రజలతో చేయించడము చూచాము.



దావీదు మహారాజు కాలంలో యెహోవా ఆనతి ప్రకారము అన్యజాతుల రాజ్యాలపై యుద్ధాలు చేయించి వారిని ఓడించి

సమస్తజాతుల వారిని ఊరి బయటకు రప్పించి స్త్రీ పురుషులను బండల మీద పరుండ బెట్టి వారి తలలను సుత్తెలతో పగలగొట్టించి. మరి కొందరిని రంపాలతో కోయించి వారింకా మరణించక ముందే వారి దేహాలను ఇటుక ఆవములలో లేసి కాల్చుమని ఆదేశించి చేయించిన యెహోవా, అంతేకాక ఆయా జాతులలో పురుషులను పురుష సంయోగ మెరిగిన స్త్రీలను నిర్ధాక్షిణ్యంగా చంపించి మీ సుఖసంతోషాల కోసం పురుష సంయోగ మెరుగని కన్నెపిల్లలను బ్రతకనిచ్చి వారితో వ్యభిచరించమని ఈ దేవుడే ఆదేశించి... అలాగే బాలబాలికలను కూడ బ్రతక నిచ్చి బానిసత్వం చేయించుకోమని అదేశాలు ఇవ్వడం జరుగుతూ వచ్చింది. అనంతరం వారు వెళ్తూవెళ్తూ వారి ఆవాసాలను భస్మీపటలం చేసి వెళ్లవలసిందిగా సెలవిచ్చాడు.

ఇర్మియా గ్రంథంలో చూడగా ఈ యూద ప్రజలు తన కాళ్లు మ్రొక్కడంలేదని, తనను ఆరాధించకుండ అన్యదేవతలను పూజిస్తున్నారని వీరిని మరింతగా భ్రష్టులను చేయదలచి ముక్కుముఖము తెలియని అన్యదేశాలను రెచ్చగొట్టి ఈ యూద స్త్రీల మీదకు పంపి వారి మాన ప్రాణాలు దోచుకోమని ఆజ్ఞాపించాడీ దేవుడు... ఈ విధముగా ఒకసారి డెబ్బది సంవత్సరాలు, మరియొక్కసారి నలువది సంవత్సరాలు ఆయా రాజులకు బానిసలుగా అప్పగించడం జరిగింది.

మనమింకా మరికాస్త వెనుకకు పోయి బైబిల్ చరిత్రచూస్తే తాను భూమి మీద సృజించిన మానవాళిలో పాపం పెరిగిపోయిందని అంతా పాపులై పోయారని ఒకే ఒక్క నీతి మంతుడైన నోవహును, అతని కుటుంబాన్ని మాత్రం ఓడలో ఎక్కించి యావత్ ప్రపంచాన్ని వృద్ధులు. అమాయక బాలబాలికలు అనే విచక్షణ లేకుండ వారితోపాటు సమస్త జంతుజాలాన్ని పక్షులను పురుగు పుట్రలను మహాజల ప్రళయం పంపి ఈ యెహోవా చంపివేశాడట. ఇట్టి మహానుభావుడ్ని ప్రేమామయుడని, దయార్ధ్ర హృదయుడని శ్లాగించడంలో ఏ మాత్రమైనా అర్థముందా! ఆయన ముక్కు పుటాలనుండి. నోటి నుండి అగ్నిని వెదజల్లే భయంకరుడైన దేవుడుగా చెప్పబడుచున్న ఈ రాక్షసుడు అసలు దేవుడే నంటారా? పరలోక రాజ్యంలో క్రైస్తవ సోదరులు ఇట్టి దైవంతో సహజీవనం చేయగలుగుతారా?

ఇంతకుముందు మనము చూచిన పసిబాలుడ్ని హింసించినందుకే నార్వే ప్రభుత్వం అంత అతిగా స్పందించగా ఇక్కడ మనము చూచిన హింసాకాండ వంటి కేసు ఏదయినా నార్వే రాజధాని ఆస్లో న్యాయస్థానానికి వస్తే ఎలా స్పందిస్తారో ఊహించగలమా? ఇట్టి భయంకర దైవంలో దైవ లక్షణం ఒక్కటయినా కనబడుతుందా? అన్నీ మైనస్ పాయింట్లే గాని ఒక్కప్లస్ పాయింట్ అయినా గోచరిస్తుందా? నాటి అనాగరిక కాలంలో నాటి రచయితలు ఈ ఉగ్రుడైన దేవుడు, నాడు ప్రజలతో అంత సన్నిహితంగా వుంటూ నేడు





అజాపజాలేకుండ అదృశ్యమైపోయాడు. మరొక్క సారి నిశితంగా ఆలోచించండి. "అత్తకు బుద్ధి చెప్పిన కోడలు తెడ్డునాకిన" చందాన నరహత్య చేయవద్దు, వ్యభిచరింపవద్దు, పరుల సొమ్ములు ఆశించవద్దు వంటి నీతులు చెప్పిన దేవుడే ఇట్టి నియమ నిబంధనలన్నింటిని ధిక్కరింపజేయువచ్చా? యావత్ ప్రపంచ మానవులను హతమార్చవచ్చా? అనంతర పర్యవసానం ఎలా గుంటుందో ఆ దేవునికి ఏ మాత్రము తెలియదా? ఆయన జలప్రళయంలో స్వర్వనాశనం చేశాక దానివల్ల అణుమాత్రమైనా ప్రయోజనం చేకూరలేదు కదా! మత గ్రంథాలు చెప్పినంత మాత్రాన అవి యధార్థాలు కావు. సామాన్య జ్ఞానంతో మరొక్కసారి ఆలోచించండి.

ఈ "ఉప సంహారం"లో నేను యెహోవాను ధారుణమైన రీతిలో విమర్శించానని కొందరు భావించవచ్చు. ఇక్కడ చెప్పబడిన దైవలక్షణాలలో నేను ఒక్కముక్కయినా నా స్వంతంగా చెప్పలేదు. అవన్నీ ఆ "దేవుడు" గారే తన ప్రవక్తల ద్వారా స్వయంగా బయలు పరచాడంటారు. బైబిల్ సత్యవేద గ్రంథం కదా! అందుకే ఈ బైబిల్ తనలో దాగియున్న సత్యాసత్యాలనన్నీ అదే బట్టబయలు చేసి దాని నిజస్వరూపాన్ని ఈ విధంగా లోకానికి నిజాయితీగా బయట పెట్టినందుకు జోహార్లర్పించ వలసిందే!!

- నెల్సన్ రష్మీ

## నెరవేరిన చిరకాల వాంఛ!

సుమారు ముప్పది సుదీర్ఘ సంవత్సరాల పైగా పరిశోధించి, పరిశీలించి జరిపిన అవిరళకృషి ఇంత కాలానికి ఒక కార్యరూపము దాల్చిన **ఇది నిజమా?** ప్రథమభాగం ఈ 2012వ సంవత్సరాంతములో అందునా క్రైస్తవ ప్రపంచం అత్యంత వైభవంగా జరుపుకొంటున్న క్రిస్మస్ వేడుకల సమయంలో డిసెంబరు 23వ తేదీన మానవ వికాస వేదిక, బాటసింగారం (రామోజీ ఫిలిమ్ సిటీ) హైద్రాబాద్ సమీపమందు శ్రీయుత సి.ఎల్.ఎన్.గాంధీ గారి చేతుల మీదుగా ఆవిష్కరించబడటం ఆనందదాయకమైన విషయం.

నా జీవిత చరమాంకంలో ఇంతటి బృహత్ కార్యపరంపరను నాభుజస్కందాలపై వేసికొని విజయవంతంగా ముందుకు సాగించడం ఎంతో గర్వంగా యుంది. ఇంతేగాక ఈ ఇది నిజమా రచనా పరంపరలను మరో మూడు నాలుగు భాగాలుగా విడుదల చేయ బూను కోవడం తలకు మించిన భారమేకావచ్చును. ఈ సందర్భంలో సోదర సహోద్యమ కారులు కొంతలో కొంత ప్రోత్సాహ మందించ గలిగితే అంతకన్నా కావలసింది లేదు. సాధారణంగా ఏ రచనలైనా "బ్లాక్ అండ్ వైట్"లోనే ముద్రిస్తూవుంటారు. అయినప్పటికి ఈ ప్రథమ భాగంలో కొన్ని రంగుల పేజీలను అర్థవంతమైన చిత్రాలతో సర్వాంగ సుందరంగా ముద్రించడం జరిగింది. ఈ విధంగా నా రంగుల కల నెరవేరింది. ఇంతవరకు చిన్నా చితుకూ సహాయాలందించిన ఉద్యమ కారులకు మరొక్కసారి కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

B. NELSON - SBH A/c No. 52103810923, DEFENCE COLONY BRANCH, SECUNDERABAD - 500054

అలాగే ఇది నిజమా రచనా పరంపరలను గూర్చి భక్తజనుల విమర్శలు ఎవరైనా పంపదలచుకుంటే అట్టి సందేహాలకు రాగలరచనల్లో తగిన వివరణలతో ప్రచురించబడతాయి. ఇష్టమయితే మీ ఫోటో కూడ పంపగలరు.

ఇది నిజమా ప్రతులు అన్ని విశాలంధ్ర బ్రాంచీలందు, మరికొన్ని ఇతర బుక్ షాపులయందు లభిస్తాయి. అలాగే పోస్టు ద్వారా తెప్పించుకొనగోరువారు ఈ క్రింది అడ్రసుకు M.O. చేసి మీ అడ్రసు వివరంగా వ్రాయగలరు... పోస్టేజి ఉచితం. (మీ సెల్ నెంబర్ వ్రాయండి). **Y.V. SREEKANT** (E.D.), SAINIKPURI (P.O.), SECUNDERABAD - 500094 (A.P.), Cell: 9440365273.





## దైవానికీ "దండప్రపాణాలు!!"... మానవతకు జేజేలు!!

ఇశ్రయేలు జనాంగమైన యూదజనుల మీద వాత్సల్యంతో యెహెూవా దేవుడు వారిని బుజ్జగిస్తూ లాలిస్తూ పాలిస్తూ నా స్వజాతీయలారా! నా ప్రజలారా! నిశ్చితంగా వుండండి. నా అడుగు జాడల్లో నడవండి. నేను చెప్పినట్టు వినండి.

మీరు నాకు మొరపెడితే చాలు నన్ను అడిగినంతనే నేను యావత్ భూప్రపంచ దిగంతాలలో నివసించే సమస్త అన్యజాతుల రాజ్యాలను నేను మీకు ధారాదాత్తం చేస్తాను. మీరు వారిని పట్టుకొని ఇనుప దండాలతో వారి నెత్తులు పగులగొట్టి, కుండ పెంకులల్లే ముక్కలు చెక్కలు చేయండి! నిర్దాక్షిణ్యంగా మీరు వారి సంపదలను దోచుకోండి! అని సెలవివ్వడము ఇక్కడ మనము మరొకసారి చూస్తాము. శాంతి సౌభాగ్యాలతో జీవనం కొనసాగించే అన్యజాతుల ఎడల యెహెూవా కెందుకీ అకారణ ద్వేషం? మహా పరిశుద్ధుడుగా... ఆలోచనాకర్తగా... ప్రేమాస్పదుడు నిత్యుడైన దేవునిగా వర్ణించబడిన ఈ మహెూన్నతుని ఆదేశామేనా? ఇవి హిట్లరు, ముసులోని, ఇ.డి.అమీన్, ఛంగిజ్ ఖాన్‌లు ఈయన కన్నా కాస్త ఉత్తములేమో అనిపిస్తుంది. ఇవి నిజంగా క్రైస్తవ దేవుడు ఇవ్వదగిన ఆదేశాలేనా? ఇట్టి మేళ్లకు బదులుగా వారు యెహెూవాయందు భయభక్తులు కలిగివుండాలా? ఇవి క్రైస్తవ సోదరులకు లభించే తాయిలాలా!

ఒక్కసారి ఈ యెహెూవా సరిక్రొత్త ఆదేశాలను ప్రత్యక్షంగా చూడండి...

దుష్టుల ఆలోచన చొప్పున నడవక, పాపుల మార్గమున నిలువక, అపహాసకులు కూర్చుండు చోట కూర్చొనక యెహెూవా ధర్మశాస్త్రమునందు ఆనందించుచు దివారాత్రములు దానిని ధ్యానించువాడు ధన్యుడు. అతడు నీటి కాలువల యోరను నాటబడినదై ఆకువాడక తన కాలమందు ఫలమిచ్చు చెట్టువలెనుండును. (కీర్తనల గ్రంథం 1:1-3)

నీవు నాకుమారుడవు. నేనునిన్ను 'కని"యున్నాను. నన్ను అడుగుము. జనములను నీకు స్వాస్థ్యము గాను, భూమిని దిగంతముల వరకు సొత్తుగా ఇచ్చెదను. ఇనుపదండముతో నీవు వారిని నలుగ గొట్టెదవు. కుండను పగులగొట్టినట్టు వారిని ముక్కలు చెక్కలుగా పగులగొట్టెదవు. భయభక్తులు కలిగి యెహెూవాను సేవించుడి! గడగడ వణకుచు సంతోషించుడి! ఆయన కోపము త్వరగా రగులుకొనును. (కపడ్‌దార్ అన్నట్టుగావుంది) (కీర్తనలు 1:7-11)

సాత్వీకులు ధన్యులు, ప్రేమామయులు, పరోపకారులు, నిర్మలమైన ముఖవర్చసును, నిదానము, నెమ్మది, మాదిరి జీవితము గల క్రైస్తవ స్నేహితుల్లారా!! పై బంగారు వాక్యాలను కనులు మూసుకొని నమ్మక నోరు తెరచి మాట్లాడండి. దీనికి ఏ అనుభవజ్ఞులైన గురువుల సంజాయిషీలు అవసరం లేకుండ మీకే బోధపడుతుంది.

దైవానికి "దండ" ప్రమాణాలు!!
మానవతకు జేజేలు.

**ఈ రచన ముగింపు సందర్భంగా**
**యెహూవాకు అభినందనలు...**

ఎంతమంచి వాడవయా అహోఓహో! యెహూవా!!
కొంతయినా బాధలేదు – చీకు చింతలసలెలేవు...
మమ్మును నీసంతతిగా కనీ – మరీ పెంచావా?
మా కేటి లోటయ్యా – నీ తోడు నీడ మాకుండగ
ఎంతమంచి వాడవయా – అహో ఓహో! యెహూవా!!

నిను నేనూ దరిచేరి – దేవిరించి – అడిగినంతనె...
భూదిగంత దిగువ వరకు "జనజనాల" నిత్తువా
దయాధర్మ మనకుండ – ఇనుపాదండాలు బట్టి...
దంచి కొట్టి పగులగొట్టి – కొల్ల గొట్టవచ్చునా!
ఎంతమంచి వాడవయా – అహో ఓహో! యెహూవా!!

– నెల్సన్‌రెడ్డి

సమాప్తము

మరియు తమ
ప్రధానత్వమును
నిలుపుకొనక, తమ
నివాసస్థలమును
విడిచిన దేవదూతలను,
మహా దినమున
జరుగు తీర్పు
వరకు కటిక చీకటిలో
నిత్య పాశములతో
ఆయన బంధించి
భద్రముచేసెను.
(యూదా. 1:16)

## ఇది నిజమా? అది నిజమా?... రెండూ అసత్యాలేనా!

నిబ్బరమైన బుద్ధిగలవారై
మెలకువగా ఉండుడి;
మీ విరోధియైన అపవాది
గర్జించు సింహమువలె
ఎవరిని మ్రింగుదునా
అని వెదకుతు
తిరుగుచున్నాడు.
(1. పేతురు. 4:8)

